Islam Aur Jadeed Ma'ashi Nazriyat
(Telugu)



# ఆధునిక ఆర్థిక సిద్ధాంతాలు


మూలం :

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది

అనువాదం ;

యస్. యం. మలిక్






తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

లక్కడ్‌కోట్, ఛత్తా బజార్,

హైదరాబాద్ - 500002

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్ 1990

ప్రతులు : 2000



వెల : రు. 12-00

ప్రకాశకులు :

**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్**
**లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,**
హైదరాబాద్ – 500 002

ముద్రణ :

కాస్మిక్ ప్రింటర్స్
లక్కడ్‌కోట్, ఛత్తా బజార్,
హైదరాబాద్–500 002

# మా మాట

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై) ఇస్లామీయ జీవన వ్యవస్థ విశదీకరణ, నిర్వచన, సంకలన, సంస్థాపనా మార్గంలో అవిరళ కృషి సలిపిన ఆధునిక పండితులు. ఆయన వడ్డీ వ్యవస్థలోని చెడుగులను బహిర్గతంచేసి వడ్డీలేని ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించే కృతనిశ్చయంతో చేసిన శాస్త్రీయ అధ్యయనానికి, ఇచ్చిన మార్గదర్శకత్వానికి ఇస్లామీయ ప్రపంచం ఎంతయినా ఋణపడి ఉంటుంది. ఆధునిక పరిభాషలో, అత్యాధునిక మానవునికి అర్థం అయ్యేలా ఏ విషయమయినా చెప్పగలగటం ఆయన విలక్షణత. ఆయన, ఆధ్యాత్మిక, నైతిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలన్నింటిలో ఇస్లామీయ జీవన వ్యవస్థ అధ్యయనానికి మార్గదర్శక గ్రంథాలు రచించారు. అలాంటి ఓ గ్రంథమే నేడు తెలుగు ప్రజలకు అందజేస్తున్నాము

ఈ పుస్తకం, శైలి, భాష, భావప్రకటనా విధానం దృష్ట్యా కాస్త సంక్లిష్టతను సంతరించుకున్నదేమోకాని దీని ప్రధాన విషయమయిన "ఆర్థిక విధానం" చర్చించేటప్పుడు ఇలాంటి సంక్లిష్టత అనివార్యమేనేమో అనిపిస్తోంది.

ఏది ఏమైనప్పటికీ ఇస్లామ్ ప్రతిపాదించే ఆర్థిక విధానాన్ని అధ్యయనం చెయ్యదలచినవారు ప్రథమంగా ఈ పుస్తకాన్ని అర్థం చేసుకోవడం ఆ తరువాత "వడ్డీ" అనే మరో పుస్తకాన్ని అధ్యయనం చెయ్యడం అవసరమని మేము భావిస్తున్నాము. "వడ్డీ"ని కూడా త్వరలో అందజెయ్యగలమని హామీనిస్తున్నాము.

సలహాలను, సూచనల్ని సదా ఆహ్వానిస్తున్నాము.

ప్రకాశకులు

# విషయసూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# నేటి సామాజిక సమస్యలు

## పూర్వరంగం

ఇటీవలి కాలంలో ప్రపంచమంతటా, ఆలోచనాసరళికి, ఆచరణా విధానాలకు, రెంటికీ నాయకత్వపు పగ్గాలు పాశ్చాత్యుల చేతుల్లోనే ఉండేవి. అందువల్ల సహజంగానే పాశ్చాత్యుల జీవితాల్లో ఏ సమస్యలైతే ఉత్పన్నమయ్యాయో, వాటిలో చిక్కులకు ఏ విషయాలయితే కారణభూతాలయ్యాయో. అవే నేడు మన నాగరికతకు, రాజకీయాలకు, ఆర్థిక వ్యవస్థకు పట్టుకున్న సమస్యలు అవే వాటిలోని చిక్కులకు మూల కారణాలూ అయ్యాయి. తమ సమస్యల పరిష్కారానికి పాశ్చాత్య మేధావులు, తత్వవేత్తలు ఏ విధానాలయితే అనుసరించారో ఆ మార్గదర్శకత్వం లోనే మన ఆలోచనాపరులు, మేధావులు అధికంగా మన సమస్యలకు పరిష్కారం వెదకుతున్నారు. నాయకత్వం పాశ్చాత్యుల అధీనంలో ఉండటాన సహజంగా జనించే పర్యవసానమే ఇది. అందువలన మనం, నేటి సామాజిక సమస్యల చారిత్రక పూర్వ రంగాన్ని పరిశీలించవలసి ఉంటుంది. అలాగే ఈ సమస్యల పరిష్కారానికి నేడు ప్రసాదించబడుతున్న నివారణోపాయాల

పుట్టుపూర్వోత్తరాలను కూడా తెలుసుకోవడం ముఖ్యం. ఈ చారిత్రక పరిశీలన ద్వారానే అధునాతన ఆర్థిక సిద్ధాంతాల అవగాహనకై మనం సాగించే చర్చలు సరిగ్గా బోధపడగలవు.

# భూస్వామ్య వ్యవస్థ

క్రీస్తు శకం అయిదవ శతాబ్దంలో పాశ్చాత్య రోమన్ సామ్రాజ్యం పతనమవగానే యూరపు యొక్క నాగరిక, రాజకీయ, ఆర్థిక ఏకత్వం ఛిన్నాభిన్నమయిపోయింది. ఏ బంధం అయితే వివిధ జాతుల్ని గట్టిగా పట్టి ఉంచిందో అది తెగిపోయింది. ఏ వ్యవస్థ అయితే ఈ సంబంధ బాంధవ్యాలు సాధ్యమయ్యేలా చేసిందో ఆ వ్యవస్థ కూడా కుప్పకూలిపోయింది. రోమనుల చట్టం సార్వజనీనమైందని, రోమనుల రాజకీయ పంథా ఉన్నతమయిందని పాశ్చాత్యుల హృదయంపై నేటి వరకు మాయని ముద్రపడి, అది చిరస్థాయిగా మిగిలిపోయినా సామ్రాజ్యం విచ్ఛిన్నం కావడంచేత యూరపు మొత్తం చిన్న చిన్న భాగాలుగా ముక్కచెక్కలయింది. ఒక్కొక్క భౌగోళిక భూభాగం ఎన్నో విభాగాలుగా తుత్తునకలయింది. కొన్ని ప్రాంతాలల్లో ఒకే జాతికి చెందినవారు. ఒకే భాష మాట్లాడేవారు కూడా తమ ఏకత్వాన్ని కాపాడుకోలేకపొయ్యారు. సామ్రాజ్యమంతా విభజనలు, చిరు విభజనలకు లోనయి చిన్న చిన్న భూభాగాలుగా చిందువందయిపోయింది. ఆ భూభాగాల పరిపాలనను స్థానిక నాయకుడు లేదా భూస్వామి నిర్వహించేవాడు. ఈ విధంగా యూరపులో "భూస్వామ్య వ్యవస్థ" (Feudal System) అనబడే జీవన విధానం

క్రియా రూపంలో ప్రారంభమయింది. ఆ వ్యవస్థలో క్రమేణ ఉత్పన్నమై తరువాత పటిష్ఠమయి స్థిరపడిన ప్రత్యేకతలు కొన్ని ఉన్నాయి :

## అధికారం

1. భూస్వామ్యమే అధికారానికి ప్రాతిపదిక. గౌరవమయినా, బలమయినా, ఆధిక్యత అయినా, శాశ్వత అధికారాలయినా, ఏ ప్రాంతంలోనైనా కేవలం భూమి కలవారికే పరిమితమయ్యాయి వారే తమ ప్రాంతంలో శాంతి భద్రతలను కాపాడేవారు. వారితోనే నాయకులు, జాగీర్దార్లు లేక రాజులు ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండేవారు. భూస్వాముల జాబితాలో లేనివారంతా— రైతులైనా, వృత్తి పనివాళ్ళయినా, వ్యాపారులైనా — వీరి సంరక్షణలోనే మనుగడ సాగించాలి. వారు పాలకులున్నూ మిగతావారంతా పాలిత ప్రజలన్నమాట. అయితే ఈ పాలిత ప్రజానీకంలోనూ ఎన్నో వర్గాలుండేవి. కొందరు అధికులు, మరికొందరు అధములు. ఈ వర్గ విభజన, దాని ఆధారంగా అంతస్తులు, వాటికనుగుణంగా హక్కుల తారతమ్యం ఇదంతా సమాజంలో లోతుగా వేళ్ళూనింది.

ఈ విధంగా భూస్వామ్య వ్యవస్థలో సమాజం ఒక నిచ్చెనగా, అంతస్తుల మేడగా రూపొందింది. దీనిలోని ప్రతి మెట్టుపై లేదా ప్రతి అంతస్తుపై ఉన్నవాడు తన క్రింది అంతస్తువానికి దైవంగా, పై అంతస్తువానికి దాసుడుగాను తయారయ్యాడు. ఈ వ్యవస్థలో అందరికీ పైన ఆ ప్రాంతపు రాజ్యాధి

నేత, అతని కుటుంబం ఉంటే, అందరికీ క్రిందుగా ఎవరిపైనా తమ దైవత్వపు బలాన్ని ప్రయోగించలేని నిరుపేద కుటుంబాలు ఉండేవి.

## అంధకారం

2. క్రైస్తవ చర్చి వ్యవస్థ దైవం తరఫున, దేవుని పేరు చెప్పి ప్రజలపై అధికారం చెలాయించేది. అయితే వాస్తవానికి దాని వద్ద ఏ దైవ శాసనమూ లేక దైవం పంపిన ఏ మార్గదర్శకత్వమూ లేదు. ఆ వ్యవస్థ అప్పుడప్పుడే యూరపులో కాలు మోపనారంభించింది. ఈ చర్చి వ్యవస్థ కొత్తగా ఆవిర్భవించిన భూస్వామ్య వ్యవస్థతో రాజీపడి, భూస్వామ్య వ్యవస్థతోపాటు సమాజంలో చోటు చేసుకుంటూ ఉన్న సాంప్రదాయికమయిన వర్గాలకు, సంస్థలకు, హక్కులకు, వివక్షతలకు, అంక్షలకు ధార్మిక అమోదముద్ర ప్రసాదిస్తూ వచ్చింది; ప్రతి పురాతనమయిన భావం చర్చి అమోదంతో మత నమ్మకంగా మారింది. దానికి విరుద్ధంగా ఆలోచించడం కూడా మతరాహిత్యంగా, ధర్మాధిక్కారంగా పరిగణించబడేది. ఒక ఆచారం ఒకసారి ఉనికిలోకి వచ్చిందంటే, అది ధర్మాదేశంగా రూపుదిద్దుకునేది. దానికి వ్యతిరేకంగా ఆచరించడమంటే దైవాన్ని వ్యతిరేకించడంతో సమానమన్నమాట.

సాహిత్యమయినా, తత్వశాస్త్రమయినా, సామాజిక విధానమయినా, రాజకీయాలయినా, ఆర్థిక విషయాలయినా— ఏదైనా భూస్వామ్య వ్యవస్థలో ఏ రూపం ధరించిందో "చర్చి" దాన్ని

దైవం ప్రసాదించిన రూపమని నిర్ధారించేది. తత్కారణంగా దాన్ని మార్చే ప్రయత్నం కేవలం అపరాధమే కాదు, మత పరంగా కూడా నిషిద్ధమయింది,

## సంకుచితం

3 పెద్ద పెద్ద రహదారుల్ని నిర్మించడానికి, వాటి మరమ్మత్తు ఇత్యాది వ్యవహారాలను చూడటానికి, వాటిపై శాంతి భద్రతల్ని కాపాడటానికి కావలసిన కేంద్రీయ అధికారం, పరి పాలనా వ్యవస్థ నెలకొనలేకపోయింది. ఈ కారణం వల్ల బహు దూర ప్రాంతాలకు ప్రయాణాలు, భారీ ఎత్తున వాణిజ్యం, అధిక ప్రమాణంలో నిత్యావసర వస్తువుల తయారీ, వాటి విక్రయం తదితర కార్యకలాపాలన్నీ అంతమయ్యాయి. ఈ విధంగా వ్యాపారాలు, పరిశ్రమలు, చివరికి ప్రజల మనస్తత్వాలు అన్నీ జాగీర్దారుల అధికార పరిధి వల్ల ఏర్పడిన చిన్న చిన్న భౌగోళిక భాగాల పొలిమేరల వరకే కుంచించుకుపోయ్యాయి.

## గుత్తాధిపత్యం

4. పరిశ్రమలు, వ్యాపారాలకు సంబంధించిన ఒక్కొక్క విభాగంపై ఒక్కొక్క వాణిజ్య కూటమికి, ఒక్కొక్క వృత్తి వర్గానికి ఒక గుత్తాధిపత్యం ప్రాప్తమైంది. ఒక వర్గంలోని వ్యక్తి తన వృత్తిని వదలుకోనూలేడు. మరే ఇతర వ్యక్తీ తనకు ఇష్టమైన వృత్తి చేపట్టనూలేడు. ప్రతి వర్గం కూడా తన పనిని తన పరిధి లోనే పరిమితం చెయ్యాలని పట్టుపట్టేది. ఏ సామగ్రి తయా

రయినా అది తాత్కాలిక స్థానిక అవసరాల మేరకే ఉత్పత్తి అయ్యేది, చుట్టుపట్లనున్న ప్రాంతాల్లో అమ్ముడుపొయ్యేది. అధికంగా ధాన్యాలకు మారుగా దాని మార్పిడి జరిగేది. ఈ విభిన్న కారణాలు వృద్ధి వికాసాలకు, పరిశోధనా ఆవిష్కారాలకు, సాంకేతిక సంస్కరణకు, పెట్టుబడి సమీకరణకు దావాపు ప్రతిబంధకాలుగా పరిణమించాయి.

రోమను సామ్రాజ్య పతనం వల్ల జనించిన ఈ రుగ్మతలు తరువాత 'హోలీ రోమన్ ఎంపైర్'(పవిత్ర రోమన్ సామ్రాజ్యం) అవతరణ వల్ల ఏ మాత్రం బాగుపడలేదు. పోపు మరియు సీజరు కలసి ఆధ్యాత్మికంగా, నైతికంగా కొంతవరకు రాజకీయంగా— కూడా యూరపును ఐక్యం చెయ్యడానికి ఆధారాలు చూపెట్టినా భూస్వామ్య వ్యవస్థలో మారిపోయిన నాగరిక, సామాజిక, ఆర్థిక రంగాల స్వరూపంలో మళ్ళీ ఎలాంటి మార్పు సంభవించకపోవడమే కాక, అది ఇంకా పటిష్టంగా సుస్థాపితమయిపోయింది. చివరకు ఆ జీవన వ్యవస్థ తప్ప మరో వ్యవస్థ పట్ల ఆలోచించడం కూడా సాధ్యం కానంతవరకు జన జీవనంలో అది వేళ్ళూనింది.

# పునరుజ్జీవనం

ఈ స్తబ్దత ఎలా వెర్రలు వేసింది, అలా ఏ కారణాల వల్ల జరిగింది. మరే విధంగా యూరపులో పునరుజ్జీవనం (Renaissance) అనబడే ఆ సర్వతోముఖమయిన ఉద్యమం తలెత్తింది. అన్న చర్చ మన చర్చనీయాంశం కాదు. సంగ్రహంగా జరిగిందేమంటే ఒక వైపు స్పెయిను మరియు సిసిలిపై ముస్లిమ్‌ల అధి-

పత్యం వల్లను, మరో వైపు కూ్రిసేడ్స్ (పవిత్ర క్రైస్తవ యుద్ధాలు) వల్లను పాశ్చాత్త్యులకు అనాటి నాగరికతకు పట్టుకొమ్మలయిన జాతులతో భేటీ జరిగింది. అయితే ముస్లిమ్‌ల ఈ సంపర్కం ద్వారా వారు ఇస్లామ్‌ను పరిచయం చేసుకోలేకపోయ్యారు. చర్చి ప్రభావం కారణంగా పాశ్చాత్త్యులు ఇస్లామ్ పట్ల దురభిప్రాయానికి లోనయి ఉండటం మూలాన వారి దృష్టి ఇస్లామ్ వైపుకు మళ్ళలేకపోయింది. కాని ముస్లిమ్‌లతో కలిగిన ఈ సంపర్కం వలన వారికి ఒక ప్రయోజనం మాత్రం తప్పక కలిగింది. వారికి ముస్లిమ్‌ల భావాలు, దృక్పథాలు, వారి విజ్ఞానం, వృద్ధివికాసాలు, వారి ప్రగతిశీల విధానాలు అన్నీ అంతంకాని బొక్కసంలా చేజిక్కాయి. ఈ విజ్ఞాన వృద్ధివికాసాల సంపత్తే చివరకు ఒక కొత్త యుగపు నాంది ప్రస్తావనకు మూల కారణమయింది.

14వ శతాబ్ది మొదలుకొని, 16వ శతాబ్దం వరకు రెండు శతాబ్దాల కాలం యూరపు చరిత్రలో, అటు మధ్యయుగం ఇటు ఆధునిక యుగాల మధ్య సంధికాలం లాంటిది. ఈ కాలంలోనే పాశ్చాత్త్య జీవితపు ప్రతి రంగంలో బాహ్య ప్రపంచం నుండి వచ్చే ప్రభావాల కారణంగా సంచలనం చెలరేగింది. భౌతిక శాస్త్రం, వైద్య శాస్త్రం, గణిత శాస్త్రం, యంత్ర శాస్త్రం, ఇంకా ఇతర రంగాలలోనూ పాశ్చాత్త్యుల విజ్ఞానం వికసించసాగింది. ప్రెస్ ఉనికిలోకి రావటాన భావ ప్రచారానికి, విజ్ఞాన వికాసానికీ సౌలభ్యం లభించి వైజ్ఞానిక ప్రగతి వేగం పుంజుకుంది. శాస్త్రీయ చైతన్యంతోపాటు తప్పనిసరిగా ప్రతి జీవన రంగంలోనూ విమర్శన, సంస్కరణలు ప్రారంభమయ్యాయి. కొత్త కళల ఆవిర్భావం మూలంగా పరిశ్రమలలో, వ్యవసాయంలో, వ్యాపా

రంలో ఇంకా సర్వసాధారణంగా నాగరికత అంతా కొత్త మొగ్గలు తొడగసాగింది. సరికొత్త భౌగోళిక ఆవిష్కారాల వలన మానవ ఆలోచన అవలోకనలు సయితం వికసించసాగాయి. దీనికి తోడుగా పాశ్చాత్యులకు బహు దూరపు దేశాలలో కొత్త వ్యాపార క్షేత్రాలు ప్రాప్తమవసాగాయి. అక్కడ వారు తమ దేశాల ఉత్పత్తుల్ని, ముడిసరకును విక్రయించి ఆ దేశాల ఉత్పత్తుల్ని ముడిసరకుల్ని కొనగలిగారు.

ఈ అవకాశాల కారణంగా, శతాబ్దాల తరబడి చల్లబడి వున్న వాణిజ్య రంగానికి తిరిగి కొత్త ఊపు లభించింది, ఎన్ని అవాంతరాలున్నా యూరపులోన, యూరపు వెలుపల వ్యాపారవేత్తల కార్యకలాపాలు బాగా విస్తృతమయ్యాయి. గొప్ప గొప్ప వాణిజ్య కూడలి ప్రాంతాల్లో కొత్త నగరాలు వెలసి పెరిగి పెద్దవవుతూపొయ్యాయి. సంపదకు, శక్తికి, యుక్తికి, సంస్కృతీ నాగరికతలకు కేంద్రాలుగా చలామణి అవుతూ వచ్చిన జాగీర్ల ఆస్థాన ముఖ్య పట్టణాల్లాంటి గ్రామాల ప్రాముఖ్యత తగ్గిపోయింది. ఆ కేంద్రీయ స్థానం, వ్యాపారం, పరిశ్రమల దృష్ట్యా, వైజ్ఞానిక సారస్వత ఉద్యమాల రీత్యా కేంద్రాలుగా రూపొందుతూ వచ్చిన పెద్ద పెద్ద నగరాలకు తరలిపోసాగింది.

## "బూర్జువా" పోరాటం

ఈ కొత్త సంచలనానికి, ఈ నవ ఉద్యమానికి నాయకత్వం వహించింది "బూర్జువా" వర్గం ప్రజలు (వ్యాపారులు, పెట్టుబడిదారులు, వృత్తిపనులవాళ్ళు నౌకా వ్యాపారులు మొదలైనవారు). ప్రగతిని, అభివృద్ధిని సాధించే ఈ అవకాశాల ద్వారా లాభ

మొందింది వీరే! వీరు సామాన్యంగా పట్టణాల్లో నివసించేవారు. విదేశాలతో రాకపోకల సంబంధాలు వీరికే ఉన్నాయి లేదా కనీసం బయటి ప్రభావాలు పడితే గ్రహించే పరిస్థితిలో ఉన్నది వీరే. మార్పు కోసం, ప్రగతి కోసం బలవత్తరమయిన ఆకాంక్ష వారిలో జనించింది. కాని వీరు పైకి రావాలంటే, చర్చి మరియు ఫ్యూడల్ వ్యవస్థ మిలీభగత్ వల్ల ఏర్పడిన సైద్ధాంతిక, నైతిక, ధార్మిక, సామాజిక, రాజకీయ ఆర్థిక కట్టుబాట్లు గొప్ప అవరోధాలుగా నిలబడ్డాయి. ఏ జీవన రంగంలోనయినాసరే శతాబ్దాల తరబడి సుస్థాపితమయి గట్టిపడిన పరిధుల్ని అధిగమించాలని వారు అడుగు ఎత్తగానే పాదిరీలు, జాగీర్దారులు కలిసి వారి దారికి అడ్డుతగిలేవారు. అందువల్ల ఈ రెండు శక్తులకు వ్యతిరేకంగా ఒక సర్వతోముఖమయిన సంఘర్షణ ప్రారంభమయింది. ప్రతి రంగంలోను చతుర్ముఖ పోరాటం మొదలయింది. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో చర్చి విధించిన మేధాబంధనాలను ప్రతిఘటించి స్వేచ్ఛా చింతన, స్వతంత్ర పరిశోధనను బలపరిచే వైఖరి అధికమయింది. ఆర్థిక, సామాజిక రంగాల్లో జాగీర్దార్ల ఆధిపత్యాన్ని సవాలు చేసి, ఫ్యూడల్ వ్యవస్థ ఏర్పరచిన తారతమ్యాలన్నింటినీ ఎదురించడం జరిగింది.

ఈ పోరాటం క్రమేణ పాత వ్యవస్థ పరాజయం రూపంలోనూ, కొత్త శక్తుల పురోగతి రూపంలోనూ పరిణమించసాగింది. పదహారో శతాబ్దానికి చేరేటప్పటికి యూరపులోని చిన్న చిన్న జాగీర్లు పతనమయి పెద్ద పెద్ద జాతీయ రాజ్యాలుగా రూపొందసాగాయి. యూరపు ఆధ్యాత్మిక అధికృతా ఇంద్రజాలం అంతమైపోయింది. కొత్తగా ఆవిర్భవించిన జాతీయ రాజ్యాల మత

ప్రసక్తిలేని పాలకులు చర్చి ఆస్తుల్ని జప్తు చేసుకోసాగారు. ప్రపంచ వ్యాప్తమయిన మత వ్యవస్థను కాదని విభిన్న జాతుల వారు తమ తమ విభిన్న చర్చి వ్యవస్థల్ని నెలకొల్పుకోసాగారు. ఈ చర్చి వ్యవస్థ జాతీయ రాజ్యాధికారానికి ప్రత్యర్థి శక్తిగానో లేక భాగస్వామ్య శక్తిగానో రూపొందకుండా అధికారాశ్రయంలో పోషణ పొందే విధంగా తయారయింది. ఈ విధంగా చర్చి మరియు ఫ్యూడల్ వ్యవస్థల ఉమ్మడి ఆధిపత్య బంధనాలు తెగటంతో పాటు "బూర్జువా" వర్గం తన మార్గాన పురాతన వ్యవస్థ నిలబెట్టిన సామాజిక సాంప్రదాయిక ప్రతిబంధనాల నుండి కూడా విముక్తమవసాగింది.

## మధ్యయుగాల లిబరలిజం

చర్చి మరియు జాగీర్దార్ల వ్యవస్థకు వ్యతిరేకంగా సాగిన ఈ పోరాటానికి ప్రాతిపదికలయిన దృక్పథాలకు "లిబరలిజం," లేదా "ఉదార వైఖరి," 'విశాల దృక్పథం' అని ప్రముఖంగా పేర్కొనవచ్చు. ఈ నవయుగ ధ్వజవాహకులు ప్రతి జీవన రంగంలో, ఆలోచన ఆచరణల ప్రతి క్షేత్రంలో స్వేచ్ఛా వైఖరి పట్ల, ఉదార బుద్ధి పట్ల, విశాల దృక్పథం పట్ల హితవులు బోధించసాగారు. వారి ఈ బోధలు సర్వసామాన్యంగా అన్ని రంగాలకు పరివ్యాప్తమయి ఉండేవి— అవి మతం, తత్వశాస్త్రం, విద్య, కళలు, సాహిత్య రంగాలైనా లేక సామాజిక, నాగరిక, రాజకీయ, ఆర్థిక రంగాలయినా సరే. వారు ప్రగతిశీల మనిషి మార్గంలో ఎదురయ్యే సకల ప్రతిబంధకాలను, అవాంతరాలను, సంకుచితతత్వాలను, కష్టాలను దూరం చెయ్యదలిచారు.

ఈ సంఘర్షణలో చర్చి వ్యవస్థ మరియు ఫ్యూడల్ (భూస్వామ్య) వ్యవస్థ భావాలు ఒక అతివాదానికి గురయితే ఈ బూర్జువా మహనీయులు ఉదార వైఖరి అనే రెండో అతివాదానికి గురయ్యారు. ఉభయత్రా స్వార్థ ప్రయోజనాలే మూల ప్రేరకాలు. న్యాయం, ధర్మం, నిజమయిన జ్ఞానం, సవ్యమయిన ఆలోచన ఇరుపక్షాల్లోనూ పూజ్యమే. ఒక వర్గమేమో నిరాధారమయిన నమ్మకాలు, అసంబద్ధమయిన విచక్షణలు, పై నుంచి రుద్దిన హక్కుల పరిరక్షణకై దైవాన్ని, ధర్మాన్ని, నైతికతను సాధనంగా వాడుకుంటే మరో వర్గమేమో దానికి ప్రతికూలంగా స్వేచ్ఛా భావన, ఉదార వైఖరి పేరిట నిత్యం ప్రజామోదం పొందుతూ వచ్చిన ధార్మిక, నైతిక యదార్థాలను సయితం తల్లక్రిందులు చెయ్యసాగారు.

ఈ కాలంలోనే రాజకీయాలను నైతికతకు దూరం చేయటం జరిగింది, రాజకీయ ప్రయోజనాలు, అవసరాల విషయంలో నైతిక సూత్రాలను పాటించే అవసరం ఏ మాత్రం లేదనే సిద్ధాంతాన్ని మెకానెలి బహిరంగంగానే సమర్థించాడు. ఈ కాలంలోనే చర్చి, భూస్వామ్య వ్యవస్థల స్థానంలో జాతీయత, జాత్యహంకారం, జాతీయ రాజ్యం అనే విగ్రహాలను మలచడం జరిగింది. నేడు ప్రపంచం ఘర్షణల, జాతీయ వైషమ్యాల అగ్నిపర్వతంలా తయారవడానికి కారణభూతమయిన మహాపద్రవానికి ఆనాడు నాంది ప్రస్తావన జరిగింది. ఆ కాలంలోనే ప్రప్రథమంగా వడ్డీ సక్రమమయినది, ధర్మబద్ధమయినది, ఆమోదయోగ్యమయినది అనే భావనకు అంకురార్పణ జరిగింది. వాస్తవానికి అతి ప్రాచీన కాలం నుండి కూడా ప్రపంచంలోని ధర్మవేత్తలందరు, నైతికవేత్త

లందరు, న్యాయవేత్తలందరు ఇది అధర్మమనే విషయంపై ఏకాభిప్రాయాన్ని వెల్లడిస్తూ వచ్చారు. కేవలం తౌరాత్, ఖురాన్ మాత్రమే దీన్ని నిషేధించలేదు, అరిస్టాటిల్, ప్లేటో కూడా దీని అక్రమతను గుర్తించారు, గ్రీకు మరియు రోమన్ న్యాయ నిబంధనాల్లో సయితం వడ్డీ నిషిద్ధమే కాని పునరుజ్జీవనోద్యమ కాలంలో బూర్జువా వర్గం క్రైస్తవ చర్చిని ఎదురించి నిలబడ్డప్పుడు ముందయితే వడ్డీని అనివార్యమయిన చెడుగా అభివర్ణించడం జరిగింది. చివరికి దాని బలవత్తర ప్రచారానికి ప్రభావితమయి క్రైస్తవ సంస్కరణావాదులు (Reformists) కూడా దాన్ని మానవ బలహీనత సాకుతో "గత్యంతరంలేని పరిస్థితుల్లో" సక్రమమయిందిగనే ప్రకటించసాగారు. క్రమేణ కేవలం "వడ్డీ రేటు" మాత్రమే చర్చనీయాంశంగా మిగిలింది. ఆ తరువాత ప్రముఖ మేధావులు, ఆలోచనాపరులంతా తమ చర్చను వడ్డీ రేటు "సమంజసమైంది"గా ఉండాలన్న అంశంపై కేంద్రీకరించసాగారు. చివరికీ వ్యాపార వ్యవహారాల్లో ధర్మం, నైతికతల ప్రసక్తి ఏమిటీ? అన్న భావం ఏర్పడింది. ఆర్థికంగా వడ్డీ పూర్తిగా ఒక సహజమైన సమంజసమైన విషయమనే సూత్రం నెలకొన్నది. ఇంకా, ఏ విధంగానయితే ఇంటి అద్దెను ఎదురు ప్రశ్నించడానికి వీల్లేదో అదే విధంగా వడ్డీని వ్యతిరేకించడం కూడా సహేతుకమయింది కాదు అన్న సిద్ధాంతం బలపడసాగింది.

చిత్రం ఏమిటంటే పునరుజ్జీవన యుగంలోనే ఈ బూర్జువా వర్గంవారు తమ ఈ ఉదార వైఖరి శంఖారావాన్ని బాగా విని పించి. పాదరీలు. జాగీర్దారులు, భూస్వాముల బారి నుండి విముక్తం చెయ్యగలిగిన కార్యరంగాన్నంతటికీ స్వయంగా తామే

అధికారులు, హక్కుదారులుగా రూపొందసాగారు. వారి ఉదార వైఖరి, వారికి దిగువన మరొక వర్గం, జన సామాన్య వర్గం కూడా ఉందన్న విషయాన్ని వారికి గుర్తువెయ్యలేకపోయింది. ఈ జన సామాన్య వర్గమే జాగీర్దారీ వ్యవస్థలో బూర్జువా వర్గం కన్నా అధికంగా పీడింపబడిందని అందువల్ల ఇప్పటి లిబరల్ వ్యవస్థలో ఒనగూడిన ప్రయోజనాల్లో దానికి వాటా ఉందని వారు పూర్తిగా విస్మరించారు. ఉదాహరణకు ఇంగ్లాండులో పార్లమెంటరీ పరిపాలనా విధానం రూపొందినప్పుడు, పార్లమెంటులో అసలు అధికారం, పైవారి(లార్డ్స్) చేతుల్లో నుండి సామాన్యులు (కామన్స్) చేతుల్లోకి మారినప్పుడు, ఈ అధికారం మొత్తాన్నీ ఈ ఉదార స్వభావులయిన బూర్జువా వర్గంవారే దోచుకున్నారు, ఏ ఆధారాలపై వారు తమకై ఓటు హక్కుకు సంపాయించారో ఆ ఆధారాలు, క్రింది తరగతి ప్రజలకు ఓటు హక్కును ఇవ్వ నిరాకరించినప్పుడు వారికి గుర్తుకు రాలేదు!

## పారిశ్రామిక విప్లవం

18వ శతాబ్దంలో "యంత్రం" ఆవిష్కరణ ద్వారా పునరుజ్జీవన యుగంలో ప్రారంభమయిన విప్లవ గతి తీవ్రతరమయింది. క్రొత్త శాస్త్రీయ పరిజ్ఞానంతో సరికొత్త ఆవిష్కరణలతో, పరిశ్రమల్లో, వృత్తి పనుల్లో, వ్యవసాయంలో ఇంకా రవాణా సౌకర్యాల్లో వృద్ధివికాసాలు జరిగాయి. తద్వారా, మునుపెన్నడూ ఊహించలేనంత భారీ ఎత్తున ఉపకర సామాగ్రి తయారవడం, ప్రపంచ నలుమూలల్లో తయారయిన సామాగ్రి విక్రయమవడం ప్రారంభమయింది.

ఈ మహత్తర విప్లవం, ప్రగతి, సుఖసంపదలు, శక్తి, అధికారాలు సాధించే మార్గాలు తెరవగా వాటి ద్వారా ప్రయోజనం పొందేందుకు వాటికి చేరువన ఉన్న వర్గం, పునరుజ్జీవన యుగంలో పైకి వచ్చిన బూర్జువా వర్గమే. ఎందుచేతనంటే పరిశ్రమలు ఈ వర్గం చేతుల్లోనే ఉన్నాయి. పెట్టుబడి, విద్యా విజ్ఞానాలు కూడా దాని వద్దనే ఉన్నాయి. ఈ వర్గం, పెట్టుబడి, సాంకేతిక నైపుణ్యం, కార్యనిర్వాహక సామర్థ్యం ఈ మూటి మేళవింపులో పరిశ్రమలు వాణిజ్యాల ఓ క్రొత్త వ్యవస్థను రూపొందించి నిలబెట్టింది. దీన్ని ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ అనంటారు. ఈ వ్యవస్థలో పట్టణాల్లో, పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు. వాణిజ్య కేంద్రాలు వెలిశాయి. వృత్తి వర్గాల పాత వ్యవస్థ ఛిన్నాభిన్నమయిపోయింది. చిన్న చిన్న కర్మాగారాలవారు, వ్యక్తిగత వృత్తిపనులవారు, చిన్న చిన్న పెట్టుబడులతో వ్యాపారం చేసే వారి జీవితం అనుదినం దుర్భరం కాసాగింది. పల్లెల్లో నివసించే వృత్తిపనులవాళ్ళు పట్టణాలకు వచ్చి పెద్ద పెద్ద ఫ్యాక్టరీల యజమానుల గడపలపై వాళ్ళ కూలీలుగా నిల్చోడం తప్ప గత్యంతరం లేకుండాపోయింది. చిన్న చిన్న వ్యాపారస్థులు, పెద్ద పెద్ద పారిశ్రామికుల వద్దనో లేక బడా వ్యాపారుల వద్దనో ఉద్యోగం చెయ్యడమో లేక వాళ్ళ ఏజంటుగా మారడమో తప్ప వేరే గతి లేకపోయింది. ఇదే విధంగా శాస్త్రీయ పరిజ్ఞానం, కొత్త ఆవిష్కరణల ద్వారా ప్రాప్తించిన శక్తిని బూర్జువా వర్గమే కట్టేసింది. తరువాత క్రమేణా అది తన విజయాల పరిధిని విస్తృతం చేస్తూపోయింది.

అయితే ఈ విజయాల పరిధిలో జరిగే విస్తృతిని అరికట్టే

పెద్ద అవరోధాలుగా, పునరుజ్జీవనోద్యమం ఫలితంగా ఉనికిలోకి వచ్చిన జాతీయ రాజ్యాలు రూపొందసాగాయి. ఈ రాజ్యాల నిరంకుశ పాలకులు "దైవ ప్రసాదిత హక్కు" కలవారుగా ప్రకటించుకోసాగారు. మాజీ భూస్వామ్య వ్యవస్థలోని బడా వర్గమంతా వీరి సామంత సంస్థానాధీశులయి కూర్చున్నారు. జాతీయ స్థాయిలోని చర్చి వ్యవస్థ వీరికి మతపరమయిన, ఆధ్యాత్మికమైన అండదండనిస్తూ పోయింది. అధికారమంతా ఈ "త్రయం" చేతుల్లోనే కేంద్రీకృతమయింది. బూర్జువా వర్గానికి ఈ త్రయం పరిపాలన రకరకాల అడ్డంకులు సృష్టించేది. ఇది సృష్టించిన అడ్డంకులు ఒక వైపు బూర్జువా వర్గాన్ని పారిశ్రామిక, వాణిజ్య రంగాల్లో నిరోధించగా, మరో వైపున సంస్కృతీ నాగరికతా క్షేత్రాల్లో సయితం ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాలు ఈ వర్గానికి ఇష్టకరం కానివి ఇంకా అనేకం మిగిలిపోయ్యాయి.

## ఆధునిక ఉదారతత్వం

ఈ యుగంలో మునుపటి పోరాటంలో విజయం సాధించిన లిబరలిజమే (ఉదారతత్వం) తిరిగి సరికొత్త ఆయుధాలు ధరించి విజృంభించింది. ఈసారి అది రాజకీయాల్లో ప్రజాస్వామ్యాన్ని, సంస్కృతీ నాగరికతల్లో, సభ్యతా సంస్కారాల్లో, సాహిత్యం నైతికతల్లో వ్యక్తిగత స్వేచ్ఛను, వాణిజ్యంలో విశృంఖలత్వాన్ని (**Laissez Faire Policy**) ప్రబోధించసాగింది. ఈ వాదం చెప్పే దేమంటే, చర్చి వ్యవస్థయినా, ప్రభుత్వ వ్యవస్థయినా, సామాజిక వ్యవస్థయినా ఎవరికైనా సరే వ్యక్తి చేసే ప్రగతి ప్రయత్నాన్ని, స్వలాభార్జన ప్రయత్నాన్ని నిరోధించే హక్కు లేదు. ప్రతి వ్యక్తికీ

స్వేచ్ఛగా తన శక్తిసామర్థ్యాలను, తన అభిరుచుల కనుగుణంగా వినియోగించుకోడానికి, తనకు సాధ్యమైన మేరకు పురోగమించడానికి అవకాశం లభించాలి. స్వయంగా సమాజ ప్రయోజనాలను సైతం సాధించడం ప్రతి వ్యక్తికీ అవధుల్లేని స్వేచ్ఛనివ్వడం ద్వారానే సుసాధ్యం. ప్రతి జీవన రంగంలో, ప్రతి ఆచరణా మార్గంలో సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలి. ప్రతి బాహ్య అవరోధాన్నుండి, ప్రతి ఆచారప్రాయమైన కట్టుబాటు నుండి, ప్రతి మతపరమైన నైతికమయిన ప్రతిబంధకాన్నుండి, ప్రతి శాసనపరమయిన, సామాజికమైన జోక్యం నుండి పరిపూర్ణమయిన స్వేచ్ఛ అవసరం.

ఈ విధంగా ఈ సిద్ధాంతాన్ని బలపరచినవారు అన్ని వైపులా ఉదార వైఖరిని, నిర్నిబంధతత్వాన్ని, విశృంఖలత్వాన్ని, వ్యక్తిగత ప్రత్యేకతను— ఒక్క మాటలో చెప్పాలంటే, వారి ప్రత్యేక పరిభాషలో "సామంజస్యత"ను అమలులోకి తేవాలని ప్రబల ప్రయత్నాలు చేస్తారు.

## అన్ని వైపులా విశృంఖలత్వమే

రాజకీయాల్లో వీరు కోరిందేమంటే, ప్రభుత్వానికి బహు స్వల్పమయిన అధికారాలు ఉండాలి. వ్యక్తి స్వేచ్ఛాపరిధులకు హద్దులుండరాదు. ప్రభుత్వం అనేది కేవలం న్యాయం చేకూర్చే ఒక సంస్థగా మాత్రం ఉండాలి. వ్యక్తుల్ని, ఒకరి పరిధుల్లో మరొకరు జొరబడకుండా వారిస్తూ ఉండాలి. వ్యక్తిగత స్వేచ్ఛల్ని పరిరక్షించాలి. పోతే, నాగరిక, ఆర్థిక జీవన రంగానికి సంబంధించిన వ్యవహారాలు అన్నీ వ్యక్తుల స్వేచ్ఛాయుత, కృషి

ఆచరణ, ఆలోచన, శక్తియుక్తుల ఆధారంగా సాగాలి. ఇందులో ప్రభుత్వం ఆచరణరూపేణా లేదా మార్గదర్శక రూపేణా— ఏ విధంగానూ జోక్యం చేసుకునే అవసరం లేదు.

దీనితోపాటు వారు రాజకీయాల్లో కోరిందేమంటే, పరిపాలనాధికారం ఏదో ఒక రాజ కుటుంబానికిగాని లేదా కొందరు జమీందారుల కుటుంబాలకుగాని సొంతమయి ఉండరాదు. అది దేశ ప్రజాసామాన్యానికి చెందింది. ప్రభుత్వపు వ్యవహారమంతా వీరు చెల్లించే పన్నుల ఆధారంగానే నడుస్తోంది గనుక, వీరి అభిప్రాయం ప్రకారమే ప్రభుత్వం ఏర్పడుతూ, పడిపోతూ, మారుతూ ఉండాలి. వీరి కోరికలకే, శాసన నిర్మాణంలోనూ, పరిపాలనా వ్యవస్థలోనూ నిర్ణయాత్మక శక్తి ఉండాలి.

ఈ సిద్ధాంతాలే 18వ శతాబ్ది చివరి భాగంలో ప్రపంచంలో ఏర్పడసాగిన సరికొత్త ప్రజాప్రభుత్వాలకు ఆధారభూతాలయ్యాయి.

ఆర్థిక రంగంలో వీరు బలపరచిన సిద్ధాంతమేమంటే, ఒకవేళ సహజమయిన వృత్తి విధానాల్లో బాహ్యం నుండి జోక్యం, అంతరాయం కల్పించకుండా ఉంటే, వాటిని స్వేచ్ఛగా పని చేసేందుకు వీలును కల్పిస్తే, మనుషుల వ్యక్తిగత ప్రయత్నాల వల్ల సామాజిక శ్రేయానికి సంబంధించిన గొప్ప సేవ దానంతట అదే జరుగుతూపోతుంది. ఉత్పత్తి ఇతోధికమవుతుంది. దాని పంపిణీ కూడా ఎంతో సక్రమమయిన పంథాలో కొనసాగుతుంది. దీనిగ్గాను జనులకు కృషి చేసే, పని చేసే స్వేచ్ఛ ఉండాలి. ఈ సహజ ప్రక్రియలో ప్రభుత్వం కృత్రిమంగా జోక్యం చేసుకోకూడదు. స్వేచ్ఛా విపణి (Free Enterprise)కి సంబంధించిన

ఈ సూత్రమే ఆధునిక పెట్టుబడిదారీ విధానానికి మూల సూత్రంగా రూపొందింది.

పునరుజ్జీవన యుగంలోని ఉదార వైఖరి మాదిరిగానే పారి శ్రామిక విప్లవ కాలంలోని ఉదార వైఖరి కూడా కొన్ని యదార్థాల ఆధారంగా రూపొందిందనడంలో సందేహం లేదు. ఈ యదార్థ విషయాలే చివరికి దాని విజయానికి కారణభూతాలయ్యాయి కూడా. కాని వీటిలోనూ పాశ్చాత్య మనస్తత్వంలోని రెండు ప్రాథమిక బలహీనతలు ఈ యదార్థాలతోబాటు తోడుగా ఉన్నాయి. ఈ బలహీనతలు పోపుల అధికార యుగంలోనూ, జాగీర్దారుల యుగంలోనూ మనం చూస్తూ వచ్చాము. అంటే, స్వార్థపరత్వం, తీవ్రవాదం.

## స్వార్థం

స్వార్థ బుద్ధి కారణంగా వీరిలోని చాలా మంది న్యాయం, ధర్మం కోసం ప్రకటించే కోరికలలో చిత్తశుద్ధి లోపించింది. ఏ సత్క్రమమైన సూత్రాలను వారు ప్రతిపాదించేవారో వాటి అసలు ప్రేరక శక్తి వారి ధర్మాభిలాష లేక న్యాయ బుద్ధి కాదు ; వాస్తవ మేమంటే అవి వారి సొంత ప్రయోజనాలకు ప్రయోజనకరంగా ఉన్నాయి. దీని ప్రబల నిదర్శనమేమంటే వారు ఏ హక్కులు తమకు కావాలని కోరేవారో వాటినే ఖుద్దుగా వారు తమ కార్మికు లకు, నిరుపేదలయిన ప్రజలకు ఇచ్చేందుకు సిద్ధంగా లేరు

# తీవ్రవాదం

తీవ్రవాదం అన్నది, వారి చిత్తశుద్ధి గల విద్యావంతులు, రచయితల్లో ప్రస్ఫుటంగా గోచరించేది, కొన్ని యదార్థాలను వారు తమ చర్చనీయాంశాలుగా స్వీకరించారు. వాటిని వాటి హద్దులకు బహు దూరంగా తీసుకెళ్ళి అతిశయ వర్ణనలతో ప్రజలకు అందజేశారు. ఈ పరుగులో వారు మరికొన్ని సత్యాలను విస్మరించారు, ఇంకా జీవితంలో ఈ సత్యాలు ఉండవలసిన స్థానే తమకు ఇష్టకరమయిన యదార్థాలను తెచ్చి కూర్చోబెట్టారు వాస్తవమేమంటే ఏ యదార్థమయినా తన స్థానాన్ని దాటిపోయిందంటే అది అబద్ధమయి కూర్చుంటుంది. దాని వల్ల వ్యతిరేక పరిణామాలే ఉత్పన్నమవుతాయి.

'విశృంఖలత్వం,' 'వ్యక్తిత్వం' ప్రజాతంత్రానికి సంబంధించిన ఈ సిద్ధాంతాల ప్రభావంతో ఏర్పడిన జీవన వ్యవస్థలోని ప్రతి రంగంలోనూ ఈ అతివాద ధోరణి ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. కాని మనం కేవలం ఒక ఆర్థిక రంగాన్నే విషయంగా తీసుకున్నందు వల్ల ఇతర రంగాలన్నింటినీ వదలి కేవలం ఈ ఒక్క రంగాన్నే పరిశీలించి చూద్దాం. అప్పుడే మనకు బోధపడుతుంది, సహజ ఆర్థిక నియమాలతోబాటు స్వార్థం, తీవ్రవాదం జోడయితే ఎలాంటి అసమానమయిన, సమతూలనం లేని ఆర్థిక వ్యవస్థ రూపొందుతుందో, ఈ స్వేచ్ఛాప్రియులు రూపొందించిన ఈ వ్యవస్థ వల్ల ఎలాంటి ఫలితాలు ఉనికిలోకి వచ్చాయో!

—:o:—

# ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ

మేము ఇంతకు ముందే వివరించినట్లు విశృంఖల సంపాదనా వ్యవస్థ యొక్క "ఉదార వైఖరి" సిద్ధాంతం ఆధారంగా ఏ ఆర్థిక వ్యవస్థ నిర్మాణమవుతుందో దాన్ని పరిభాషలో ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ (Modern Capitalism) అని అంటారు.

## విశృంఖల సంపాదనా సూత్రావళి

ఈ వ్యవస్థ యొక్క ప్రాథమిక సూత్రాలు ఇవి :

### వ్యక్తిగత ఆస్తి

1. మనిషి నిత్యం వాడుకునే వస్తువులు, అంటే బట్టలు, వంట పాత్రలు, ఫర్నిచర్, ఇల్లు, వాహనం, పెంపుడు పశువులు మొదలయినవి మాత్రమే కాదు, ఇతరులకు అమ్మడానికి నిర్మించే అనేక వస్తువులు, అంటే యంత్రాలు, పనిముట్లు, భూమి, ముడి పదార్థాలు వగైరా లాంటివి కూడా మనిషి ఆస్తిలో చేరినవే. మొదటి రకం వస్తువులనైతే ఏ వ్యవస్థలోనయినా నిర్ద్వంద్వంగా మనిషి వ్యక్తిగత ఆస్తిగానే పరిగణించటం జరుగుతుంది. కాని చర్చనీయాంశం రెండో రకానికి చెందిన వస్తువులు, ఇవి ఉత్పత్తి

సాధనాలు. వీటిపై కూడా మనిషి వ్యక్తిగత స్వామ్యం కలిగి ఉండే హక్కు న్యాయసమ్మతమైందా? కాదా? అన్న వివాదం బయల్దేరింది. పెట్టుబడిదారీ వ్యవస్థలోని ప్రాథమిక ప్రత్యేకత ఏమిటంటే అది ఈ హక్కును గుర్తిస్తుంది. వాస్తవానికి ఈ హక్కే ఆ వ్యవస్థకు పునాదిరాయి.

## కృషి చేసే స్వేచ్ఛ

2. వ్యక్తులకు, వారు వ్యక్తిగతంగానయినా, లేక చిన్న చిన్న వర్గాలుగానయినా, తమకున్న వనరుల్ని, తమకు నచ్చిన రంగంలో వినియోగించగల హక్కు ఉండాలి. ఈ ప్రయత్నంలో ఏ లాభాలు ఒనగూడినా, ఏ నష్టాలు వాటిల్లినా రెండూ వారి కొరకే. నష్టం కలిగే ప్రమాదాన్ని వారే భరించాలి. లాభం పొందే విషయంలో ఎలాంటి నిర్బంధాలూ వారిపై లేవు వారు తమ ఉత్పత్తిని, తయారీని ఎంత మేరకయినా పెంచేందుకు లేక తగ్గించేందుకు వారికి స్వేచ్ఛ ఉంటుంది. తమ సరకుకు తమకు ఇష్టమయిన ధర నిర్ణయించే హక్కు, తాము కోరినంత మందిని, తమ పనుల కొరకు వేతనంపైగాని, దినసరి కూలీపైగాని నియమించుకునే అధికారం, తమ వ్యాపార విషయాల్లో ఏ నిబంధనలనయినా ఏర్పరచుకోడానికి, ఏ బాధ్యతలనయినా స్వీకరించడానికి, ఏ నియమాలనయినా నిర్ణయించడానికి స్వాతంత్ర్యం వారికి ఉంటుంది. కొనేవాడు, అమ్మేవాడు, పారిశ్రామికుడు, కార్మికుడు, యజమాని. నౌకరుల మధ్య వ్యాపారం మేరకు సకల వ్యవహారాలు స్వేచ్ఛా వాతావరణంలో నిర్ణయమవ్వాలి. ఏ షరతులనయితే వారు పరస్పరాంగీకారంతో కుదుర్చుకుంటారో అవి అమలులో రావాలి.

## వ్యక్తిగత లాభమే ప్రేరక శక్తి

3. ప్రతి మనిషిలో సహజసిద్ధంగా ఉండే, అతన్ని ఆచరణ వైపుకు పురికొలిపే స్వార్థాపేక్ష మరియు లాభాలు పొందే ఆశలే పెట్టుబడిదారీ వ్యవస్థలో నిత్యావసర వస్తువుల ఉత్పత్తిని పెంచడానికి ప్రేరకశక్తులవుతాయి. పెట్టుబడిదారీ వ్యవస్థని సమర్థించేవారు చెప్పేదేమంటే, మానవ జీవితంలో ఆచరణకు పురికొలిపే ప్రేరక శక్తి దీనికంటే ఉత్తమమయింది మరొకటి కాజాలదు. ఇంకా నిజానికి, ఇది తప్ప వేరే ప్రేరక శక్తి అసలు ఏదీ లేదు. మీరు లాభాల అవకాశాలను ఏ మేరకు తగ్గిస్తారో అంతనానే మనిషి చేసే కృషి, పరిశ్రమలు కూడా తగ్గిపోతాయి. లాభాల అవకాశాలు విస్తృతంగా ఉంచండి. ప్రతి వ్యక్తికి అవకాశం కల్పించండి. అతడు తన శక్తిసామర్థ్యాలు, పరిశ్రమల ద్వారా ఎంత సంపాదించగలడో సంపాదించుకోనివ్వండి. అప్పుడు ప్రతి మనిషి అత్యధికంగా, అత్యంత ఉత్తమంగా పనిచేసేందుకు ప్రయత్నిస్తాడు ఈ విధంగా ఉత్పత్తి దానంతట అదే పెరుగుతుంది. ఉత్పత్తి ప్రమాణాలు కూడా పెరుగుతాయి. సాధ్యమయినన్ని సాధనా సంపత్తులన్నీ వినియోగమవుతాయి. నిత్యావసర వస్తువులు విస్తృతంగా అందుబాటులోకి వస్తాయి. వ్యక్తిగత ప్రయోజనాల ప్రలోభం ద్వారా వ్యక్తుల చేత సామూహిక ప్రయోజనానికి సంబంధించిన సేవలను సేకరించడం సాధ్యమవుతుంది. ఇదంతా మరో వేరే రీతిలో సాధించలేని విధంగా దానంతటదే జరిగిపోతుంది.

## పోటీ పరుగు

4. పెట్టుబడిదారీ వ్యవస్థ సమర్థకులు చెప్పేదేమంటే పోటీ అన్నది, ఈ విశృంఖల సంపాదన వ్యవస్థలో వ్యక్తుల స్వార్థాన్ని హద్దులు మీరకుండా నిరోధిస్తుంది. వారి మధ్య సమంజసత్వాన్ని, సమతూకాన్ని నెలకొలుపుతుంది. ఈ ఏర్పాటు ప్రకృతిలో సహజంగానే ఉంది. ఓపెన్ మార్కెట్‌లో ఒకే వస్తువు ఉత్పత్తిదారులు అనేక మంది, వ్యాపారులు అనేక మంది, కొనుగోలుదారులు అనేక మంది ఉన్నట్లయితే పోటీ ద్వారా హెచ్చుతగ్గులు జరిగి ధరల్లో దానంతట అదే ఒక సముచితమైన ప్రామాణికత నెలకొంటుంది. లాభసముపార్జన శాశ్వతంగా హద్దులు మీరి హెచ్చనూజాలదు, హద్దుల కంటే తగ్గనూజాలదు. యాదృచ్ఛిక కారణాల వల్ల హెచ్చుతగ్గులు జరగడం అన్నది వేరే విషయం. అలాగే శ్రామికులు, పారిశ్రామికులు కూడా తమ తమ స్థానాన పోటీ కారణంగా స్వయంగానే జీతభత్యాలకు సంబంధించిన సమంజసమయిన ఒక ప్రమాణాన్ని నెలకొల్ప కుంటారు అయితే పోటీ అన్నది బహిరంగంగా స్వేచ్ఛా వాతావరణంలో జరగాలి. ఎలాంటి గుత్తాధిపత్యాల ద్వారాను ఈ స్వేచ్ఛ పరిమితం చెయ్యరాదు.

## ఉద్యోగి, యజమానుల హక్కులు

5. పెట్టుబడిదారీ వ్యవస్థలో, ప్రతి వాణిజ్య సంస్థలో పనిచేసేవారు రెండు పక్షాలుగా విభజించబడతారు. ఒకటి యజమానుల వర్గం. వీరు తమ బాధ్యతపై ఏదైనా వ్యాపారాన్ని లేక పరిశ్రమని ప్రారంభిస్తారు, దాన్ని నడిపిస్తారు, చివరి వరకు

దాని లాభనష్టాలకు బాధ్యులై ఉంటారు. రెండవది కార్మికులు, లేదా ఉద్యోగుల వర్గం. వీరికి లాభనష్టాలతో ప్రమేయముండదు. వారు కేవలం తమ సమయం, శక్తిసామర్థ్యాలు ఈ వ్యవహారంలో వినియోగిస్తారు. తమ పరిశ్రమకు ఫలితంగా నిర్ణీతమయిన ఓ వేతనం తీసుకుంటారు. పలుమార్లు వ్యాపారంలో నిరంతరం నష్టం కలుగుతూ ఉంటుంది, కాని కార్మికుడు తన వేతనం మాత్రం తీసుకుంటూ ఉంటాడు. అనేకసార్లు వ్యాపారం పూర్తిగా పడిపోతుంది. ఇందులో యజమాని పూర్తిగా నాశనమయి పోతాడు. కాని దానితో కార్మికునికి ఎలాంటి సంబంధముండదు. అతనికి సంబంధించినంతవరకు ఏర్పడే వ్యత్యాసమేమంటే ఈ రోజు ఓ వ్యాపార సంస్థ లేక కార్ఖానాలో పని చేస్తూ ఉంటాడు, మరునాడు మరో చోట పోయి నిల్చుంటాడు. పెట్టుబడిదారీ వ్యవస్థ సమర్థకులు చెప్పేదేమంటే, వ్యవహారంలోని ఈ విధానం వల్ల తేలే విషయమేమంటే న్యాయపరంగా ఎవరయితే నష్టాన్ని భరిస్తారో, మరెవరైతే వ్యాపారంలోని మంచి చెడుల్ని భరిస్తారో, లాభం వారికే ప్రాప్తం కావాలి. అయితే ఉద్యోగునికి సంబంధించినంతవరకు అతను తనకు సముచితమయిన వేతనాన్ని పొందేందుకు హక్కు కలిగి ఉన్నాడు. అది అతని పని యొక్క స్వరూపాన్ని, పరిమాణాన్ని మార్కెటులోని రేటును బట్టి నిర్ణయమవుతుంది. దీనికి వ్యాపారంలోని లాభనష్టాలతో సంబంధం లేదు. లాభం వస్తే వేతనం పెరగాలని, నష్టం వస్తే తరగాలని లేదు. ఉద్యోగి తన నిర్ణీత వేతనాన్ని ఎట్టి పరిస్థితిలోనూ పొందాలి— అయితే కేవలం నిర్ణీత వేతనానికే అతడు అర్హుడు. అతని వేతనంలో హెచ్చుతగ్గులేవయినా జరిగితే అవి కేవలం

ఇతర వస్తువుల ధరలు పెరిగే తరిగే సహజమయిన విధానంలో జరుగుతాయి. యజమానులు తక్కువయి కార్మికులు అధికమై నప్పుడు వేతనాలు వాటంతట అవే తగ్గుతాయి. పని చేసేవారు తక్కువై, పని చేయించుకునేవారు అధికమయితే వేతనాలు వాటంతట అవే పెరుగుతాయి. సామర్థ్యం కల మంచి కార్మికుడు స్వయంగానే అధిక వేతనం సంపాదిస్తాడు. యజమాని కూడా తన ప్రయోజనం కొరకు అతనికి బహుమానాలు వేతనంలో పెంపుదల చేసి అతనిని సంతోషపెడతాడు. కార్మికుడు కూడా తనకు లభించిన వేతనాన్ని బట్టి వ్యాపార పురోగతి కొరకు ఇతోధికంగా పాటుపడతాడు. యజమానులు సహజంగానే వ్యాపారంలో ఖర్చు వీలయినంత వరకు తక్కువై లాభం అత్యధికం కావాలని కోరుకుంటారు. అందువల్ల వారు వేతనాల రేట్లు తక్కువగానే ఉంచే ప్రయత్నాలు చేస్తారు పనిచేసేవారు సహజంగానే తమ అవసరాలు సులభంగా పూర్తి కావాలని, తమ జీవన ప్రమాణం పెరుగుతూ ఉండాలని కోరుకుంటూ ఉంటారు. ఈ విరుద్ధ భావాల కారణంగా ఓ విధమైన సంఘర్షణ ప్రారంభమవుతుంది, ఇది సహజం. కాని ప్రపంచంలోని అనేక వ్యవహారాల్లా ఈ విషయంలోనూ సహజంగానే ఇచ్చిపుచ్చుకునే సర్దుబాటు ద్వారా ఉభయులకూ అనువైన వేతనాలు నిర్ణయమవుతూ ఉంటాయి.

## ప్రగతికి సహజమయిన సాధనాలు

6. పెట్టుబడిదారీ వ్యవస్థ సమర్థకులు ఇంకా ఇలా చెబుతారు: వ్యాపారంలో లాభానికి పునాది, తక్కువ ఖర్చు అధిక ఉత్పత్తి అన్న విషయమయితే వ్యాపారం చేసే వ్యక్తి తన లాభం నిమిత్తమయి ఉత్పత్తిని పెంచేందుకు ఇతోధికంగా ఉత్తమ

శాస్త్రీయ విధానాలను అవలంబించడానికి పూనుకుంటాడు. తన మెషిన్లను, యంత్రాలను వీలయినంతవరకు మంచి స్థితిలో ఉంచడానికి ఏర్పాట్లు చేస్తాడు. ముడి సరుకు పెద్ద ఎత్తున తక్కువ ధరలో సంపాయించే కృషి చేస్తాడు. తన వ్యాపార విధానాలను, తన సంస్థల్ని వృద్ధిపరిచే మార్గాలకై తన బుద్ధీ జ్ఞానాలను వినియోగిస్తూ ఉంటాడు. ఎవరి బయటి ప్రమేయం లేకుండా, ఎలాంటి కృత్రిమ ప్రయత్నాలు లేకుండా స్వేచ్ఛా విపణిలోని అంతర్గత తర్కం స్వయంగానే అతని ద్వారా ఇదంతా చేయిస్తూ ఉంటుంది. పలుచోట్ల విడివిడిగా పడున్న అనేక వ్యక్తుల, వర్గాల కృషి, క్రియాశీలతలు ఈ విధంగా సహజసిద్ధ మయిన నియమాల ద్వారా సమాజ ప్రగతి, సమాజ శ్రేయాల మహత్కార్యాన్ని సాధిస్తాయి. ఏ సాముదాయిక ప్రణాళికా నిర్మాణం వల్లనూ ఇంత ఉత్తమ రీతిలో ఈ కార్యం నెరవేరడం సాధ్యపడదు. ఇది ప్రకృతి ఏర్పరచిన ప్రణాళిక. ఇది మనకు తెలియకుండానే అమలులోకి వస్తూ ఉంటుంది.

## పరిపాలనా వ్యవస్థ జోక్యం

7. ఈ వ్యవస్థను సమర్థించేవారు ఇంకా చెప్పేదేమంటే, పై సిద్ధాంతాల ప్రకారం సమాజశ్రేయ సంక్షేమ కార్యాలు నెర వేరాలంటే, వ్యక్తులకు ఎలాంటి నిర్బంధాలు ఉండరాదు. స్వేచ్ఛగా పనిచేసే అవకాశాలు ప్రాప్తం కావాలి. ఆర్థిక సూత్రాల్లో ఉన్న సహజమయిన సామరస్యం వల్ల వ్యక్తులందరు కలసి కృషి చేసినప్పుడు ఫలితంగా అందరి శ్రేయం ఇనుమ డిస్తుంది. పైన తెలుసుకొన్న విధంగా వాస్తవానికి ఒక వ్యక్తి

తన సొంత ప్రయోజనం కొరకు కృషి చేసినా అది సామూహి-
కంగా అందరి ప్రయోజనానికి దోహదపడుతుంది. వ్యక్తులకు
తమ కృషికి ఫలితంగా అపరిమిత లాభం ప్రాప్తమయ్యే సూచనః
అగుపడగానే వారు అత్యధికంగా ధన సముపార్జన కొరకు తమ
శక్తిసామర్థ్యాలను వినియోగిస్తారు. దీని ఫలితంగా అత్యుత్తమ-
మైన వరకు అత్యధిక పరిమాణంలో అందరికీ ప్రాప్తమవుతుంది.
బజారులో వ్యాపారులు, పారిశ్రామికులు, ముడి సరుకు ఉత్పత్తి-
దారులు పోటీపడినప్పుడు ధరలు వాటంతట అవే అదుపులోకి
వస్తాయి, వస్తువుల ప్రామాణికత పెరుగుతుంది ; సమాజానికి
ఏ వస్తువు ఎంత మేరకు అవసరమో కూడా తెలుస్తూ ఉంటుంది.
ఈ వ్యవహారమంతా సజావుగా సాగాలంటే, పరిపాలనా వ్యవస్థ
అనవసరంగా జోక్యం కల్పించుకుని సంపాదన పెరిగే సహజమైన
ప్రక్రియలో సమతూకాన్ని చెరపకూడదు, దానికి బదులుగా,
వ్యక్తిగత ఆచరణా స్వేచ్ఛకు రక్షణ కల్పించే అనువైన పరి-
స్థితుల్ని సృజించాలి. పరిపాలనా వ్యవస్థ శాంతి భద్రతల్ని
కాపాడాలి. ఆస్తి హక్కుల్ని కాపాడాలి, ఒప్పందాలను చట్టం
ద్వారా నెరవేర్చేలా చూడాలి. విదేశీ దాడుల నుండి, అవ-
రోధాల నుండి, ప్రమాదాల నుండి, దేశాన్ని, దేశ వాణిజ్యాన్ని
కాపాడాలి. పరిపాలనా వ్యవస్థ న్యాయం, రక్షణ కనిపెట్టుకు
ఉండే భారం వహించాలి. అంతేకాని, స్వయంగా వ్యాపారాన్ని,
పరిశ్రమల్ని, జమీందారీ వ్యవహారాన్ని చేపట్టకూడదు. ఇంకా,
వ్యాపారులు, పారిశ్రామికులు, జమీందారుల పనుల్లో మాటి
మాటికీ జోక్యం కల్పించుకుని పని చెయ్యకుండా చెయ్యకూడదు.

## చెడుకు మూల కారణాలు

పైన పేర్కొన్నవి, ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ పుట్టుక సమయంలో ఎంతో అట్టహాసంతో ప్రవేశపెట్టిన సిద్ధాంతాలు. వీటిలో అతిశయోక్తితో బాటు కొంత నిజం కూడా ఉండటం మూలాన సాధారణంగా ప్రపంచమంతటా దాన్ని ఒప్పుకోవడం జరిగింది. వాస్తవమేమంటే వీటిలో కొత్త విషయం ఏదీ లేదు. అజ్ఞాత కాలం నుండి మానవ సంపాదనా వ్యవహారం, ఆర్థిక కార్యకలాపాలు— ఏ విషయాల ఆధారంగా సాగుతూ వచ్చాయో అవే ఇవన్నీను.

వీటిలో కొత్తదనం ఏదయినా ఉంటే వీటి పట్ల (1) అతిశయంతో కూడిన తీవ్రతలో కనిపిస్తుంది. ఈ తీవ్రతను బూర్జువా వర్గంవారు, పారిశ్రామిక విప్లవ కాలంలోని ఆర్థిక వ్యవహారాలకు కొన్ని సిద్ధాంతాలను అంటగట్టడానికి ఉపయోగించారు. పైగా వీరు తమ వ్యవస్థనంతా కేవలం పైన పేర్కొన్న సహజసిద్ధమైన సిద్ధాంతాల ఆధారంగానే నిర్మించలేదు. వాటితోబాటు (2) కొన్ని తప్పుడు సిద్ధాంతాలను సయితం మిళితం చేశారు. అలాగే పైన పేర్కొన్న స్వేచ్ఛా విపణికి సంబంధించిన సిద్ధాంతాలు సహజ వ్యవస్థలోని వాణిజ్యానికి ఎంత అవసరమో అంతే ప్రాముఖ్యం గల మరికొన్ని సిద్ధాంతాలను వారు (3) పూర్తిగా విస్మరించారు. దానికి తోడుగా తమ స్వప్రయోజనాల కొరకు స్వయంగా తామే ప్రవేశపెట్టిన కొన్ని (4) సిద్ధాంతాలకు వారు వ్యతిరేకంగానూ వ్యవహరించారు.

ఈ నాలుగు విషయాలు కలిసి చివరికి ఆధునిక పెట్టుబడిదారి వ్యవస్థలో పొడసూపిన చెడులకు మూలాధారాలయ్యాయి.

ఆ చెడులు ఎంత వరకు వ్యాపించాయంటే, ప్రపంచంలో వాటికి వ్యతిరేకంగా సర్వత్రా ఆందోళన జనించింది.

## అనుశీలన

ఇప్పుడు ఆ చెడుకు మూల కారణాలైన వాటిని పరిశీలిద్దాము.

1. స్వేచ్ఛా విపణిని సమర్థిస్తూ ఏ "సహజ సిద్ధాంతాలను" వీరు మాటిమాటికీ సూచించేవారో అవి కొంతవరకు నిజమయినవే. కాని వారు వాటిని ఏ అతిశయ స్థాయికి ప్రకటించారో, లేక ఆచరించదలచారో ఆ మేరకు అవి నిజమయినవి కావు. లార్డ్ కేన్స్ చెప్పినట్టు, "ప్రపంచంలో నైతిక, సహజ సిద్ధాంతాల ఆధిపత్యం అంత పటిష్ఠంగా లేదు. ఉంటే దాని ద్వారా వ్యక్తుల సొంత ప్రయోజనాలు మరియు సంఘం యొక్క సామూహిక ప్రయోజనాల మధ్య తప్పనిసరిగా సమన్వయం దానంతట అదే కుదిరేది. ఆర్థిక సూత్రాల ద్వారా, 'అభ్యుదయకరమయిన స్వార్థం నిత్యం సామూహిక శ్రేయం కొరకే కృషి చేస్తుంది' అని సూత్రీకరించడం సరయిన సూత్రీకరణ అనిపించుకోదు. ఇంకా స్వార్థం నిత్యం అభ్యుదయకరమయిందే అవటం కూడా సబబు కాదు. తరచుగా జరిగేదేమంటే, ఎవరయితే తమ ప్రయోజనాల కొరకు వ్యక్తిగతంగా కృషి చేస్తారో వారు చాలా మూర్ఖంగా, బలహీనంగా వ్యవహరిస్తారు. వారు తమ సొంత ప్రయోజనాలను సయితం నెరవేర్చుకోలేకపోతారు. అలాంటప్పుడు వారు సామూహిక ప్రయోజనాల కొరకు సదా తప్పనిసరిగా సేవ చేస్తారన్నది కల్ల"

ఈ అతిశయోక్తులు కేవలం నిర్హేతుకం మాత్రమే కాదు, బూర్జువా పెట్టుబడిదారులు స్వయంగా తమ ఆచరణ ద్వారా తమ స్వార్థం అభ్యుదయకరమయింది కాదని నిరూపించారు కూడా. వారు కొనుగోలుదారులైన ప్రజలు, వేతనానికి పనిచేసే కార్మికులు, శాంతియుత వాతావరణాన్ని సృష్టించే ప్రభుత్వం మూడింటి ప్రయోజనాలకు వ్యతిరేకంగా కుమ్మక్కయి కలసి కుట్రపన్నారు— పారిశ్రామిక విప్లవం వల్ల చేకూరే ప్రయోజనాలన్నింటినీ తామే కాజెయ్యాలని. వారి ఈ ఉమ్మడి పన్నాగం వల్ల వారు ప్రవేశ పెట్టిన ఓ పెద్ద నిదర్శనాన్ని స్వయంగానే ధ్వంసం చేశారు, వారు స్వేచ్ఛా విపణిని సమర్థిస్తూ ఇచ్చిపుచ్చుకునే పద్ధతి ద్వారా అన్ని వర్గాల మధ్య లాభాల సమతూకం సహజంగానే నెలకొంటుందని వాదించేవారు. అది కాస్తా వమ్మయిపోయింది. అందువల్లనే ఆడామ్ స్మిత్ లాంటి స్వేచ్ఛా విపణికి ప్రధాన సమర్థకుడు కూడా ఇలా అనవలసివచ్చింది :

> "వ్యాపారులు ఒక చోట కలవడం అంటూ జరిగితే వారి ఈ సమావేశం ప్రజలకు వ్యతిరేకంగా ఏదో కుట్రపన్న కుండా, ధరల్ని పెంచే నిర్ణయం జరక్కుండా ముగియదు. చివరికి, ఏవైనా వేడుకల్లో పాల్గొన్నా అక్కడ కలసి కూర్చునే అవకాశం లభిస్తే దాన్ని కూడా ఈ నేరం చేయ కుండా ఈ మహానుభావులు వృథా పోనివ్వరు."

ఇదే విధంగా వ్యక్తిగత ఆస్తి, కృషి చేసే స్వేచ్ఛకు సంబంధించిన వారి ప్రకటనలు కూడా అంతే. ఈ విషయాల్లో వ్యక్తులకు ఎలాంటి హద్దుపద్దుల్లేని హక్కులు ఉండి తీరాలి అన్న వారి వాదనలు కూడా పూర్తిగా అతిశయపూర్వకమయినవే.

వేలాది ప్రజల సంపాదన దెబ్బతినే విధంగా ఒక వ్యక్తి తన ఆస్తిని వినియోగిస్తే. లేక ఒక వ్యక్తి తన సొంత ప్రయోజనాల కొరకు, యావత్తు సమాజం ఆరోగ్యాన్ని, నైతికతను, మనుగడను పణంగా పెట్టే కృషి చేసే మార్గాలను అవలంబిస్తే అలాంటి వ్యక్తిని ఈ పనులు చేసేందుకు విచ్చలవిడిగా వదలవలసిన అవసరం ఏమిటీ? ఇలాంటి వ్యక్తుల వ్యక్తిగత హక్కుల వల్ల సామూహిక ప్రయోజనాలకు హాని కలగకుండా ఉండేందుకు చట్టపరమయిన అంకుశాలు విధించకపోవలసిన అగత్యమేముంది? ప్రభుత్వ జోక్యం కూడదన్న అంశాన్ని వారు దాని న్యాయమయిన అవధులకన్నా పెంచేసి అది దుష్పరిణామాలు సృజించడం తప్ప గత్యంతరం లేని పరిస్థితుల్ని కల్పించారు. బలంగలవారు ముఠాలుగా మారి అత్యధిక ప్రజల ద్వారా అధర్మంగా లాభాలు గడించనారంభిస్తే, అప్పుడు ప్రభుత్వం తమాషా చూస్తూనో లేక ఆ బలవంతుల ప్రయోజనాలనే కాపాడుతూనో ఉంటే దాని తప్పనిసరి పరిణామం అల్లకల్లోలం; కల్లోలం చెలరేగినప్పుడు అది సదా సమంజసమయిన మార్గాలనే పాటిస్తుందన్న నియమం ఏదీ లేదు.

## నిరుద్యోగం

2. ముఖ్యంగా పారిశ్రామిక విప్లవ కాలంలో స్వేచ్ఛా విపణి సిద్ధాంతాలను ఇంత తీవ్రమయిన అతిశయోక్తితో ప్రచారం చెయ్యడం చాలా నష్టం కలగచేసింది. పారిశ్రామిక విప్లవం కారణంగా ఉత్పత్తి విధానంలో వచ్చిన మార్పు ఏమంటే, ముందు మానవ శక్తి మరియు జంతు శక్తి ద్వారా చెయ్యబడే పనులు

ఇప్పుడు యాంత్రిక శక్తి ద్వారా చెయ్యబడుతున్నాయి. ఒక మెషిన్‌ని నెలకొలిపితే ముందు వెయ్యి మంది చేసే పని ఇప్పుడు కేవలం పది మంది చెయ్యగలుగుతారు. ఈ ఉత్పత్తి విధానం సహజంగానే కొందరు వ్యక్తులకు పని కల్పించి వేలాది ప్రజల్ని నిరుద్యోగులుగా చేసివేస్తుంది. ఇలాంటి ఓ విధానం నెలకొని ఉన్న వాతావరణంలో ఆస్తి, కృషి చేసే స్వేచ్ఛలకు హక్కు లుండాలనీ, అదీ అన్నింటికీ పరమయిన హక్కులు కావాలని కోరడం, ప్రభుత్వం జోక్యం కల్పించుకోకూడదని కోరడం సూత్ర ప్రాయంగా అసంబద్ధమయింది; ఒక వ్యక్తి లేక ఒక వర్గం ప్రత్యేక సరుకును తయారుచెయ్యడానికి, అకస్మాత్తుగా ఒక పెద్ద కర్మాగారాన్ని స్థాపిస్తారు. ఆ ప్రాంతంలో తమ ఇండ్లలో లేక దుకాణాల్లో లేక చేతి పనుల చిన్న చిన్న ఫ్యాక్టరీల్లో కూర్చొని అదే సరకును తయారుచేసే వేలాది ప్రజల ఉపాధిపై తమ ఈ చర్యల వల్ల ఎలాంటి ప్రభావం పడుతుందో ఖాతరు చెయ్యరు. తమ వద్ద సాధనా సంపత్తి ఉన్నంత మాత్రాన, ఎవరయినా ఇలా చెయ్యడం ఏ విధంగా న్యాయసమ్మతమవుతుంది? యంత్ర శక్తిని పరిశ్రమల్లో ఉపయోగించి ఉండకూడదని దీని భావం కాదు. భావమేమంటే, ఈ శక్తిని వినియోగించే అనుమతి గుడ్డిగా ఇచ్చి ఉండవలసింది కాదు. ప్రభుత్వం ఈ అనుమతి నిచ్చేటప్పుడే తొలినాడే, ఈ క్రొత్త పరిశ్రమ వల్ల నిరుద్యోగు లయ్యే ప్రజల ఉపాధికల్పనకు ఏర్పాటు చేసి ఉండవలసింది. ఇలా జరగకపోవడంవేత, యంత్రం ఆధారంగా ఉత్పత్తి జరిగే పద్ధతి ఉనికిలోకి రాగానే, మానవ సమాజంలో నిరుద్యోగ సమస్య తలెత్తింది. అదీ మునుపెన్నడూ మానవ చరిత్రలో ఇంత భారీ ఎత్తున ఈ సమస్య తలెత్తలేదు.

## అసలు ప్రశ్న

నిరుద్యోగమన్నది కేవలం ఒక్క సమస్య మాత్రమే కాదు, దాని వెంట అనేక చిక్కులున్నాయి. అది మానవుని భౌతిక, ఆధ్యాత్మిక, నైతిక, సాంస్కృతిక జీవితానికి సంబంధించిన అసంఖ్యాకమయిన సమస్యలకు పుట్టినిల్లు. ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే, ఒక వ్యక్తి లేక కొందరు వ్యక్తులు సామాజిక జీవితంలో ఇంత గొప్ప చిక్కును సృష్టించే విధంగా తమ ఆస్తిని ఉపయోగించే అధికారం వారికెక్కడిది? ఇలాంటి ఉపయోగాన్ని ఇది వ్యక్తుల అభ్యుదయకరమయిన స్వార్థమని, ఇది దానంతట అదే సామాజిక ప్రయోజనానికి దోహదపడుతుందని బుద్ధిగల ఏ మనిషయినా ఎలా అంటాడు? ఇలాంటి వ్యక్తిగతమయిన ఉపయోగానికి సంబంధించిన విషయంలో, ఇలాంటివాటికి స్వేచ్ఛానుమతినిచ్చి, ప్రభుత్వం మౌనంగా కూర్చోవాలని, కొందరు వ్యక్తుల చర్యల వల్ల జాతి మొత్తంపై పడే దుష్ప్రభావాల పట్ల కళ్ళు మూసుకుని వ్యవహరించాలని భావించడం ఎంత అవివేకం?

## సామాజిక సంబంధాలు మంటగలిశాయి

3. ఈ ఉత్పత్తి విధానం వల్ల వేలాది, లక్షలాది మనుషులు నిరుద్యోగులవగానే వారు తమ పల్లెల్ని, గ్రామాల్ని, వీధుల్ని, బజారుల్ని వదలి బడా పారిశ్రామిక వేత్తల వద్దకు, బడా వ్యాపారుల వద్దకు కూలినో, ఉద్యోగాన్నో అన్వేషిస్తూ రావడం అనివార్యమయింది. పర్యవసానంగా జరుగవలసిందే జరిగింది. ఆకలిదప్పులతో చచ్చే ఉద్యోగాన్వేషకులు, పెట్టుబడి

దారులు ఇస్తామన్న కనీసపు వేతనాలు స్వీకరించి పనిచేసేందుకు సమ్మతించవలసివచ్చింది. అయితే అప్పటికీ "పని" అందరికీ దొరకలేదు. పనిచెయ్యగల మనుషుల ఒక వర్గం శాశ్వతంగా నిరుద్యోగావస్థలో గడపవలసి వచ్చింది. పైగా పని దొరికినవారు కూడా పెట్టుబడిదారులతో సంప్రదింపులు జరిపి తమకు అనుకూలమయిన షరతుల్ని ఒప్పించే స్థితిలో లేకపొయ్యారు. ఎందుకంటే తాము ఉద్యోగం కావలసి వారి వద్దకు వచ్చినవారు. పెట్టుబడిదారుల షరతుల్ని ఒప్పుకోకపోతే ఆ రోజు సాయంత్రానికయినా రెండు మెతుకులు తినేందుకు నోచుకోలేరు. దాన్ని మించి ఏదయినా టెక్కు చూపించి ఉన్నట్లయితే ఆకలిగొన్న ఇతర వేలాది ప్రజలు విరుచుకుపడి ఆ షరతుల్ని అంగీకరించి ఆ ఉద్యోగాన్ని కాజేసేందుకు సిద్ధంగా ఉన్నారు.

ఈ విధంగా బూర్జువా మహాశయులు ప్రవేశపెట్టిన నిదర్శనాలన్నీ తప్పని రుజువయింది. స్వేచ్ఛా విపణిలో పోటీ బహిరంగంగా జరిగినప్పుడు, ఉద్యోగి మరియు యజమానుల మధ్య ఇచ్చిపుచ్చుకోవడాలు జరిగి, సముచితమయిన, న్యాయవంతమయిన వేతనాలు తామై నిర్ణయమవుతూ ఉంటాయని వారు వాదించేవారు. అదంతా బూటకమని తేలింది. ఎందుకంటే పోటీతోపాటు అది బహిరంగంగా జరగాలన్న షరతు అసలు ఇక్కడ లేనేలేదు. ఇప్పుడు పరిస్థితి ఏమంటే ఒక్క మనిషి వేలాది ప్రజల ఉపాధిని తన స్వాధీనంలో పెట్టుకొని, వారు ఆకలితో అలమటిస్తూ అతని వద్దకు వచ్చినప్పుడు, అందరినీ కాదు వారిలోని కేవలం పదో వంతు లేక ఇరువయో వంతు మనుషులకు మాత్రమే పని కల్పించడానికి అంగీకరించాడు.

ఇలాంటి పరిస్థితిలో బేరమాడే స్తోమత అంతా అతని ఒక్కనికే ప్రాప్తమయింది. ఆ వేలాది నిరుద్యోగుల్లో ఏ ఒక్కడు కూడా తన షరతుల్ని అమోదింపజేసే స్థితిలో లేడు. ఈ కారణంగానే ఈ పారిశ్రామిక విప్లవ కాలంలో ఆధునిక పెట్టుబడి దారీ విధానం పెరిగిన కొద్దీ సమాజంలో నిరుద్యోగంతో పాటు బీదరికం, లేమిబాధలు కూడా అధికమవసాగాయి. భారీ పరిశ్రమల్లో, పెద్ద వాణిజ్య కేంద్రాల్లో కూలినాలి. ఉద్యోగాలు చేసుకునేందుకు చేరినవారు అతి తక్కువ వేతనాలతో అధిక కాలం వరకు అధిక శ్రమ చెయ్యడానికి ఒప్పుకోవలసి వచ్చింది. వారు పశువుల్లా కష్టపడవలసి వచ్చింది. పశువుల కంటే హీనంగా పట్టణాల ఇరుకయిన చీకటి కొంపల్లో బ్రతకవలసి వచ్చింది. వారి ఆరోగ్యాలు చెడిపోసాగాయి. వారి మానసిక స్థాయి ఎదగ లేకపోయింది. వారి నైతికత దెబ్బతినసాగింది. ఎవరి స్వార్థం వారు చూసుకునే ఆ వాతావరణంలో తండ్రి కొడుకులు, అన్నా తమ్ముళ్ళ మధ్యన సయితం సానుభూతి, అభిమానం సన్నగిల్లాయి. తల్లిదండ్రులకై సంతానం, భర్తలకై భార్యలు సైతం భారమయ్యారు. మొత్తం మీద జీవితంలోని ఏ విభాగమూ ఈ తప్పుడు, ఏకపక్షపరమయిన స్వేచ్ఛా విపణి యొక్క చెడు ప్రభావాలను తప్పించుకోలేకపోయింది.

## అన్యాయానికి అంతు ?

4 పైగా జరిగిందేమంటే, ఉదార వైఖరిని, ప్రజా స్వామ్యాన్ని అమితంగా బలపరచి, భూస్వాములకు ప్రతిగా తమకు ఓటు హక్కు ఉందని పోరాడి ఒప్పించిన ఆ బూర్జువా

మహనీయులే ఆ ఓటు హక్కును, తాము ఎవరి ఉపాధికి స్వాములుగా తయారయ్యారో వారికి కాదన్నారు. ఒక్కొక్క వృత్తిపై ఆధిపత్యం వ్యాపారులు, తమ తమ సంఘాలు స్థాపించుకోడానికి, పరస్పరామోదంతో వస్తువుల ధరల్ని, ఉద్యోగుల జీతాలను, కూలీల వేతనాలను నిర్ణయించుకోడానికి తమకైతే హక్కుందని భావించారు. కాని ఉద్యోగులు, కూలీలకు కూడా సంఘటితమయి తమ సామూహిక శక్తి ద్వారా జీతాలు, వేతనాల కొరకు సంప్రదింపులు జరిపే హక్కు ఉందని వారు సుతరామూ అంగీకరించలేదు. చివరికి తమకు ఇష్టమయినప్పుడల్లా ఫ్యాక్టరీలను మూసివేసే హక్కు ఉందని, వేలాది ఉద్యోగులకు, కూలీలకు ఒక్కసారిగా ఉపాధి లేకుండా చేసి, ఆ విధంగా వారిని ఆకలిదప్పులకు గురిచేసి, వారు తక్కువ వేతనాలకు ఒప్పుకునేలా చేసే హక్కు కూడా తమకు ఉందని వారు ఘాటుగా వాదించేవారు. అయితే ఉద్యోగులు, కూలీలు సమ్మెలు జరిపి తమ వేతనాలను పెంచాలని కోరే హక్కును మటుకు వారు ససేమిరా ఒప్పుకునేవారు కారు. దీనికి తోడుగా, వీరి కార్ఖానాల్లో లేక వాణిజ్య సంస్థల్లో పనిచేసే కార్మికులు, ఉద్యోగులు వయసు పైన పడటం మూలానో, వ్యాధి కారణంగానో లేక మరే విధంగానైనా సరే నిరుపయుక్తులవటం జరిగితే, వారిని ఇంటికి సాగనంపడాన్ని వారు పూర్తిగా న్యాయమని భావించేవారు. కాని, పోయేవారు, 'స్వామి! నా ఆరోగ్యం, యవ్వనం అంతా మీ వ్యాపార ప్రగతి కొరకే ధారపోశాను. ఇప్పుడీ బలం లేని ప్రాణాన్ని ఏం చెయ్యను. కాళ్ళు చేతుల సత్తువ పోయిన తరువాత మిగిలిన పొట్టను ఎలా నింపను?' అని చేసే విన్నపం వారి వద్ద సమంజసమయింది కాదు.

ఇక్కడే ఆ బూర్జువా పెద్దలు, "సొంత ప్రయోజనం" ఒక్కటే నిజమయిన ప్రేరక శక్తి అని తాము చెప్పే సిద్ధాంతాన్ని దాన్ని బలపరుస్తూ తాము చూపే ఆధారాలను మరచిపోయ్యారు. లాభానికి అవకాశాలు అపరిమితమయితే తాము బాగా పని చెయ్య గలమని, ఈ విధంగా సామూహిక ప్రగతి శ్రేయాలు వాటంతట అవే ఒనగూడుతాయన్న విషయం తమకు సంబంధించినంత వరకయితే వారికి జ్ఞాపకం ఉండింది, కాని ఇదే విషయాన్ని వారు తమ కార్మికుల, ఉద్యోగుల విషయంలో మరచిపోయ్యారు; లాభం పరిమితమవడమే కాదు, ఎంతో తక్కువయిపోతే, వర్తమానం హీనంగా తయారయి భవిష్యత్తు అంధకారమయితే, అలాంటివారు దీక్షగా ప్రాణాలొడ్డి కష్టపడవలసిన అవసరం ఏమిటి? వారు తమ పనిలో ఆసక్తి చూపే అగత్యమేముందనీ ??

# వంచనలు రూపాలెన్ని ?

5. దీనికి తోడుగా వారు వ్యాపార విషయంలో సహజమయిన, సమంజసమయిన పద్ధతుల్ని కాదని తమ స్వప్రయోజనాల కొరకు, వేరే విధమయిన పద్ధతుల్ని అనుసరించసాగారు. అవి సామూహిక ప్రయోజనాలకు వ్యతిరేకమయినవి ; వాటివల్ల కృత్రిమంగా ధరలు పెరుగుతాయి ; రాబడి తగ్గుతుంది ; ప్రగతి కుంటుపడుతుంది. ఉదాహరణకు :

"ఒక విధానమేమంటే ; పెట్టుబడి ఆధారంగా నిత్యావసర వస్తువుల్ని కొని, కుప్పలు కుప్పలుగా నిల్వ చెయ్యాలి. చివరికి బజారులో వాటి సరఫరా కొరవడి డిమాండు అధికమవ్వాలి. ఈ విధంగా ధరల్ని కృత్రిమంగా పెంచడం సాధ్యం కావాలి.

"మరో విధానమేమంటే ఉత్పత్తిదారు, వినియోగదారుల మధ్య వందలాది మనుషులు కేవలం తమ బ్యాంకు బ్యాలెన్సు, టెలిఫోన్‌ల ఆధారంగా సరుకును పరోక్షంగా క్రయ విక్రయాలకు గురి చెయ్యాలి. ఈ విధంగా వస్తువు పై అనవసరంలో వాళ్ళ లాభం పెరుగుతూ దాని ధర అధికమవ్వాలి ఈ లాభాన్ని ఆర్జించడానికి 'విక్రయదారులు' ఆ వస్తువును ఉత్పత్తి చేయడానికో దాన్ని మొయ్యడానికో లేక దాన్ని ఉపయుక్తంగా మలచడానికో ఎలాంటి సేవ చెయ్యకుండానే ఇది జరగాలి.

"ఇంకో విధానమేమంటే, ఉత్పత్తి అయిన సరుకును, అది బజారులోకి వెళ్ళినట్లయితే ధరలు పడిపోతాయనే భయంతో కాల్చివెయ్యడమో. సముద్రంలో ముంచివెయ్యడమో జరగాలి.

"మరో పద్ధతి ఏమంటే, పెద్ద పెట్టుబడి వినియోగించి, విలాస వస్తువు దేన్నయినా తయారుచెయ్యాలి. తరువాత ప్రకటనల ద్వారా, ప్రేరణల ద్వారా, ఉచితంగా పంచి, రకరకాలుగా మాటలు అల్లి లేనిపోని డిమాండును సృష్టించాలి దాన్ని తమ నిత్యావసరాలనే పూర్తి చేసుకోలేని నిరుపేదలు మరియు మధ్య తరగతి ప్రజల 'జీవితావసరాల్లో' అనవసరంగా చొప్పించాలి.

"ఇంకా సామాన్య ప్రజలకు వాస్తవంగా ఏ వస్తువులు అత్యంతావశ్యకమయినవో వాటిని సమకూర్చడానికయితే ధనం శ్రమ వినియోగపడరాదు. కాని పూర్తిగా అనవసరమయినవాటి కొరకు ధనం విచ్చలవిడిగా ఖర్చు కావాలి. ఎందువల్లనంటే తొలి కోవకు చెందినవాటి కంటే, రెండవ రకపు పనులు అధిక లాభసాటివి.

"మరి ఇంకో విధానంలో, ఒక వ్యక్తి లేక ఒక వర్గం. ఆరోగ్యానికి అత్యంత హానికరమయిన, నైతికతను నాశనం చేసే, సభ్యతా సంస్కారాలను మంటగలిపే వస్తువుల్ని తన ధనంతో ఆకర్షణీయంగా, మనోహరంగా రూపొందించి మార్కెట్‌లోకి తీసుకురావాలి. సామాన్య ప్రజల క్షుద్ర భావాలను ఉత్తేజపరచి వారిని తమ ఈ వ్యాపారం వైపుకు ఆకర్షించాలి. వారిని పిచ్చోళ్ళుగా చేసి వారి స్వల్పమయిన ఆదాయంలో ఒక పెద్ద భాగాన్ని దోచెయ్యాలి వాస్తవానికి ఆ అభాగ్యుల ఆదాయం వారికీ వారి భార్యాపిల్లల పొట్ట నింపడానికే సరిపోదు.

"అన్నింటికంటే అపాయకరమయిన, వినాశకరమయిన విధానమేమంటే, తమ వాణిజ్యం, ఆర్థిక లాభాల కొరకు బలహీన జాతుల హక్కులను కొల్లగొట్టాలి. ప్రపంచాన్ని విభిన్న ప్రభావాల మండలాలుగా విభజించి లోబరచుకోవాలి. జాతిలోని బడా ఆసాములు, పారిశ్రామికులు, వ్యాపారులు తమ తమ జాతి ప్రజల్ని, తమ మితిలేని స్వార్థాలకు పనిముట్లుగా మలచుకొని వారు పరస్పరం కలహించుకుని శాశ్వత సంఘర్షణలో పడేలా చెయ్యాలి. ఆ సంఘర్షణ ఇటు యుద్ధం ద్వారానూ పరిష్కృతం కారాదు, అటు సంధి ఒడంబడికల ద్వారా సయితం ఓ కొలిక్కి రాకూడదు."

ఇదంతా చెప్పేదేమిటి ? వ్యక్తుల్ని, తమ స్వప్రయోజనాల సాధనకై హద్దుపద్దు లేకుండా వ్యవహరించనిస్తే వారి ద్వారా సామూహిక ప్రయోజనం ఒనగూడుతుందనడానికి నిదర్శనాలా ఇవన్నీ ? దీని ద్వారా తెలిసేదేమంటే, అవధుల్లేని స్వార్థం అభ్యుదయకరమవడం బహు స్వల్పం. ముఖ్యంగా, ఆర్థిక

రాజకీయ శక్తులు కూడా దాని చేతుల్లోకే చేరి చట్టాలు చేసేది కూడా అదే అయితే దాని వల్ల జరిగే ఘోరం ఇంతా అంతా కాదు. ఇలాంటి పరిస్థితిలో దాని ప్రయత్నాలు అధికంగా సామూహిక ప్రయోజనాల కొరకు జరగవు. పైగా సంఘ ప్రయోజనాలను దాని సొంత ప్రయోజనాలకై బలి పశువుగా వాడుకోటానికే ఆ ప్రయత్నాలు సాగుతాయి.

## కష్టం ఒకడిది సౌఖ్యం వేరొకడిది

6. ఇదంతా చేసి వదలిపెట్టలేదు. ఇంకా ఘోరాలు చేశారు. వ్యక్తులు పెట్టుబడిని కూడబెట్టి దాన్ని వడ్డీకి రుణాలివ్వవచ్చని, వడ్డీ న్యాయబద్ధమయిందని, సమంజసమయిందని, ధర్మబద్ధమయిందని నిర్ణయించారు. 'వడ్డీ' అసహ్యించుకోదగ్గ చెడుగానే ప్రపంచంలోని పలు సమాజాల్లో సదా ఉంటూ వచ్చింది. పలు చట్టాలు సయితం దాన్ని అయిష్టంగానే సహించాయి. అయితే ఒకప్పుడు పురాతన అరబ్బు అజ్ఞానం వడ్డీని సమర్థిస్తే ఇప్పుడు ఆధునిక పాశ్చాత్యుల అజ్ఞానానికి చెందిన బూర్జువా మేధావులకు ఆ గౌరవం దక్కింది. వారు వడ్డీని వాణిజ్యంలో ఏకైక సముచితమైన రూపంగా, అదే ఆర్థిక వ్యవస్థ మొత్తానికి నిజమయిన ఆధారంగా రూపొందించారు. వారు చట్టాల నిర్మాణం జరిపిన తీరు వల్ల అవి రుణగ్రస్తుడికి బదులుగా వడ్డీ తినే ఆసామీ ప్రయోజనాలకు రక్షణ ఇచ్చేవిగా తయారయ్యాయి. ప్రస్తుతం ఈ బ్రహ్మాండమయిన తప్పును వివరంగా చర్చించడం సాధ్యపడదు ఇక్కడ కేవలం ఈ చెడుగు మూలంగా సంభవించిన పరిణామాలను పేర్కొనదలిచాము.

రుణం గ్రహించడానికి రుణం ఇవ్వడానికి, ధనం ఇచ్చిపుచ్చుకోవడాలకు వడ్డీని ఆధారంగా పరిగణించడం మూలాన జరిగిన పరిణామం ఏమిటంటే, అంతకుముందే విశృంఖల పారిశ్రామిక విప్లవం వల్ల ఒకే వైపునకు ప్రవహించసాగిన శక్తి, సంపద, పలుకుబడి ప్రభావాలు, సకల ప్రయోజనాలు ఇప్పుడు ఈ చర్యల వల్ల ఇంకా అధికంగా ఏకపక్షమయిపోయాయి. దీని కారణంగా సామూహిక జీవితంలోని అసంతులనం పతాక స్థాయికి చేరింది. పర్యవసానంగా ఏదైనా ఉపాయంతో కొంత డబ్బును కూడబెట్టగలిగినవారు అమితంగా భాగ్యవంతులయ్యారు. మేధా సంపత్తి గలవారు, కష్టజీవులు, వాణిజ్య పధకాలు తయారుచేసే వారు, వాటిని నెలకొల్పేవారు, తమ శక్తిసామర్థ్యాలన్నింటిని వినియోగించి వ్యాపారాన్ని ప్రతి దశలో విజయవంతంగా నడిపే వారు, నిత్యావసర వస్తువుల తయారీ దాని సరఫరాకు సంబంధించిన పనులన్నీ చేసేవారు వీరంతా, వ్యాపారానికై డబ్బును రుణంగా ఇచ్చి తాపీగా ఇంట్లో కూర్చునే ఆ ఒక్క ఆసామి ముందు దేనికీ పనికిరానివారుగా తయారయ్యారు. వీరందరికీ లభించే లాభం నిర్ణీతమయింది కాదు, అది దొరుకుతుందని నమ్మకమూ లేదు. కాని ఒక్క ఆ వ్యక్తి లాభానికి మాత్రం ఢోకా లేదు. అది నిర్ణయమవడమే కాదు, సందేహరహితం కూడా, ఆ వ్యక్తులకయితే నష్టం కలిగే ఆస్కారం కూడా ఉంది కాని అతనికి స్వచ్ఛమయిన లాభం గ్యారంటీ ఉంది. వీరంతా వ్యాపారంలో జరిగే మంచీ చెడులను గురించి శ్రద్ధ చూపడం అవసరమే కాదు తప్పనిసరి కూడా. కాని ఆ వ్యక్తికి మట్టుకు ఏ విధమయిన చీకుచింతా ఉండదు. అతనికి తన వడ్డీతోనే

పని. వ్యాపారం వృద్ధిచెందుతూ కనిపిస్తే అతడు అందులో ఏ మాత్రం సంశయించకుండా. ఉరుకులు పరుగులపై పెట్టుబడి పెట్టడానికి సిద్ధమవుతాడు, చివరికి ఒకవేళ లాభం దొరికే అవకాశాలు అంతమవుతూ కనిపిస్తే, వ్యాపారం క్షీణ దశకు గురవుతూ అగుపిస్తే, సహాయం చేయడానికి బదులు ముందు పెట్టిన పెట్టుబడినే వెనక్కి లాక్కునేందుకు ఉపక్రమిస్తాడు. చివరికి ప్రపంచమంతటా వాణిజ్యం మందగిస్తుంది. ఎట్టి పరిస్థితిలోనూ నష్టం, కష్టం, ప్రమాదం ఏదయినా సరే, అది ఇతరులకే కాని ఇతనికి కాదు. మహా అయితే హెచ్చుతగ్గులయ్యేది కేవలం లాభంలోని హెచ్చుతగ్గులే. వ్యాపారులు, పారిశ్రామికులు. భూస్వాములే కాదు, ప్రభుత్వాలు కూడా అతనికి ఊడిగం చేస్తున్నాయి. అతను ఇచ్చిన ధనంతో అవి రోడ్లు, రైలు మార్గాలు, కాలువలు ఇంకా ఇతర పనులు చేస్తాయి. కొన్ని సంవత్సరాలే కాదు, శతాబ్దాల తరబడి, ఒక్కొక్క పౌరుడి నుండి టాక్సు వసూలు చేసి, ఆ వ్యక్తి వడ్డీని అతని ఇంట అతనికి చేరవేస్తాయి. చిత్రమేమంటే జాతికి ఎప్పుడయినా యుద్ధం సంభవిస్తే ప్రాణాలు కోల్పోయినవారు, కాళ్ళు చేతులు కోల్పోయినవాళ్ళు, ఇల్లు వాకిలి కోల్పోయినవాళ్ళు, తండ్రిని కొడుకును లేదా భర్తను కోల్పోయినవారు వీరందరి భారాన్ని అయితే జాతీయ ఖజానా సునాయాసంగా తప్పించుకోగలుగుతుంది. కాని అదే జాతికి చెందిన కొందరు యుద్ధానికిగాను రుణం ఇచ్చినందుకుగాను వారి డబ్బుకు వడ్డీ రెండేసి వందల ఏళ్ళ వరకు జాతి తీర్చుతూ ఉంటుంది. ఈ వడ్డీని ఇవ్వడానికి యుద్ధంలో ప్రాణాలొడ్డి పోరాడినవారు సయితం విరాళాలు ఇవ్వవలసి వస్తుంది. ఈ విధంగా ఈ వడ్డీ ప్రధానమయిన ఆర్థి

వ్యవస్థ సమాజంలో ధనాన్ని సంపాదించే నిజమయిన కష్ట జీవు లకు అన్ని రకాలుగా, అన్ని కోణాల నుండి అన్యాయం చేస్తుంది. అది యావత్తు సామూహిక జీవనం కళ్ళాలు కొందరు స్వార్థపరు లయిన పెట్టుబడి దారుల చేతుల్లో ఇచ్చివేస్తుంది. వారికి సమాజ శుభశ్రేయాల పట్ల ఎలాంటి ఆసక్తి ఉండదు. వారు సమాజా నికి ఎలాంటి సేవనూ చెయ్యరు. కాని, ఆర్థిక వ్యవహారాలకు, వాణిజ్య వ్యవస్థకు ఊపిరి లాంటి పెట్టుబడివారి వద్ద, వాళ్ళ అధీనంలో ఉండటం మూలాన. ఇంకా చట్టం, పెట్టుబడిని పెంచి దాన్ని వడ్డీ వ్యాపారానికిగాను వినియోగించుకునే అధికారం వారికి ఇవ్వటం మూలాన, వారు, సమాజం మొత్తం కష్టించి సంపాదించే సంపదలో పెద్ద భాగస్వాములవడం మాత్రమే కాక మొత్తం సమాజాన్నే తమ ప్రయోజనాల సాధనకు పనిముట్టుగా మార్చుకునే జాతులు, దేశాల భవితవ్యంతో ఆడుకునే తాహతు కూడా వారికి లభ్యమయింది.

## సానుభూతి లేని వ్యవస్థ

7. ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ నిర్మించే ఈ పునాదు లపై ఏర్పడిన కొత్తసమాజంలో సానుభూతి, సహకారం, దయ, అనురాగం లాంటి భావనలన్నీ కరువయిపొయ్యాయి. సమాజం వీటికి విరుద్ధమయిన గుణాలతో నిండిపోయింది. ఈ వ్యవస్థలో పరాయివాని మాట అలా ఉంచి, సొంత సోదరుడు కూడా తన సోదరుని అండదండలను పొందే హక్కును కోల్పోయ్యాడు. ఒక వైపేమో ఒక్కొక్క కొత్త మిషిన్ ఆవిష్కరణ వల్ల వందు లాది, వేలాది ప్రజలు ఒక్కసారిగా ఉపాధిని కోల్పోతున్నారు.

మరో వైపేమో నిరుద్యోగులయినవారికి, పని చెయ్యలేనివారికి, అంగ వైకల్యం కలిగినవారికి బ్రతుకుతెరువు ఏర్పాటైనా చేసే బాధ్యత ఎవరిపైనా లేకుండాపోయింది. ప్రభుత్వం, సమాజం, పారిశ్రామికుడు లేక సాహుకారు ఎవరూ ఆ బాధ్యతను స్వీకరించరు. ఇంతేకాదు, కొత్త వ్యవస్థ సృష్టించిన వాతావరణంలో. అది సామాన్య ప్రజల్లో సృజించిన నైతికతా భావనలో పతనమైన లేక పతనమవుతూ ఉన్న ఏ వ్యక్తినీ లేవనెత్తడం ఎవరి బాధ్యతా కాకుండా పోయింది. ఏవయినా దుర్ఘటనలు జరిగినా, వ్యాధి. మరణం ఇంకా ఇతర అవాంఛనీయ ఘటనలు జరిగినా వాటి నివారణ కొరకు ఈ వ్యవస్థ ప్రతిపాదించిన ఏ పరిష్కారమయినా ఉంటే అది కేవలం ప్రస్తుతం సంపాదనాపరులైన వారికి, అందులోనూ తమ ప్రస్తుత అవసరాలకు మించి సంపాయించి కూడబెట్టగలిగేవారికే వర్తిస్తుంది. కాని అసలు సంపాదించలేనివారు, లేక కేవలం ఏ పూటకా పూట గడవటానికి మాత్రమే సంపాదించగలిగేవారు గడ్డు కాలం దాపురిస్తే సహాయం ఎలా పొందాలి? ఎక్కడ నుండి పొందాలి? దీనికి సమాధానం ఈ అధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ వద్ద లేదు. అది చెప్పేది ఒక్కటే. ఇలాంటి వ్యక్తి వడ్డీ వ్యాపారస్తుని వద్దకు వెళ్ళి తన వంటి మీది బట్టలో, ఇంటి సామానో లేక పెండ్లాం వంటి మీది నగలో తాకట్టు పెట్టి సాలుకు మూడేసి వందల శాతం రూపాయల వడ్డీ చొప్పున అప్పు తీసుకోవాలి. ఆ అప్పు వడ్డీతో సహా చెల్లించుకో లేకపోతే దాన్ని చెల్లించడానికి మళ్ళీ అతని వద్దే వడ్డీపై అప చెయ్యాలి— అంతే !

# అసలంకే ఎసరు

8. సమాజంలో లక్షాది మనుషులు నిరుద్యోగులయితే, కోట్లాది ప్రజల ఆదాయం మరీ అల్పమయి, వారు ఎంత అవసరమున్నా దుకాణాల్లో నిండి ఉన్న సరకును కొనలేని స్థితిలో ఉంటే, పరిశ్రమకు, వ్యాపారానికి వలసిన పెరుగుదల ఎలా ప్రాప్తమవుతుంది? అందుకే నేడు ప్రపంచంలో ఉపయోగకరమయిన వనరులు అగణ్యంగా ఉన్నా, కోటాది ప్రజలు పని చెయ్యగలిగేవారున్నా, నిత్యావసర వస్తువులు అవసరమున్నవారు, విలాస వస్తువులు, సౌలభ్యాలు కొనదలచినవారు కూడా కోట్లాదిగా ఉన్నా నేడు ఫ్యాక్టరీలు వాటి ఉత్పత్తి స్థాయికి ఎంతో తక్కువగా తయారు చేసిన సరుకు కూడా దిక్కులేనిదిగా బజార్లలో పడి ఉంటుంది.* ఎందుకంటే ప్రజల వద్ద కొనేందుకు డబ్బు లేదు. లక్షలాది నిరుద్యోగులకు పని కల్పించలేకపోవటానికి కారణం, ఇప్పటికే తయారవుతున్న ఆ కొంత సరుకు కూడా బజారులో పూర్తిగా అమ్ముడుబోవడం లేదు. ధనాన్ని, వనరుల్ని వెచ్చించలేకపోవడానికి కారణం కూడా ఇదే. ఆ కొంత ధనం, వనరులూ ఉపయోగించినదానికే సరయిన ప్రతిఫలం లభించడం దుర్లభమై పోయింది, వనరుల్ని పెంపొందించేందుకు ఇంకా అధికంగా పెట్టుబడిని పెట్టే ధైర్యం ఎవరికి కాగలుగుతుంది? పరిస్థితుల ఈ స్వరూపం బూర్జువా మేధావుల హేతువును సమూలంగా తుడిచి వేస్తుంది. స్వేచ్ఛా విపణిలో తమ సొంత లాభాలకై వ్యక్తుల పరిశ్రమ స్వయంగానే సాధనా సంపత్తిని పెంచి ఉత్పత్తిని అధికం

* ఈ విషయాలు రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఏర్పడ్డ పరిస్థితుల్లో వ్రాసినవన్న విషయం ఇక్కడ గుర్తుంచుకోవాలి. (అను)

చేస్తుందన్న వారి వాదన పూర్తిగా తలక్రిందులయిపోయింది. ఇక్కడ అభివృద్ధి ఆలావుంచి స్వయంగా వారు తమ లాభాలకే అవాంతరాలు సృష్టించుకున్నారని అనుభవపూర్వకంగా తేలిపోయింది.

# సోషలిజం - కమ్యూనిజం

పారిశ్రామిక విప్లవం పర్యవసానంగా ఏర్పడిన నాగరిక ఆర్థిక వ్యవస్థల్లో ఉత్పన్నమయిన చెడులకు మూల కారణాలను మేము వెనుకటి పుటల్లో చర్చించాము. ఆ పరిశీలన వల్ల ప్రస్ఫుటంగా తేలేదేమంటే, వాస్తవానికి బూర్జువా పెద్ద మనుషులు స్వేచ్ఛా విపణి సమర్థనలో పేర్కొన్న సహజమయిన సిద్ధాంతాలు ఆ చెడులకు మూల కారణాలు కావు. ఆ సహజ సిద్ధాంతాలకు తోడుగా వారు కల్పించిన తప్పుడు భావాలే అసలు మూల కారణాలు.

## కొత్త సీసాలో పాత సారా

ఒకవేళ సకాలంలో ఆ తప్పుల్ని అర్థం చేసుకుని ఉంటే పాశ్చాత్యులకు, వారు ఈ కొత్త విప్లవ యుగంలో ఒక సంతులిత సమంజస వాణిజ్య విధానాన్ని నిర్మించుకోగలగటానికి అవసr

మయిన, వివేకవంతమయిన మార్గదర్శకత్వం లభించి ఉంటే, స్వయంగా వారికీ, ఇంకా ప్రపంచం మొత్తానికీ పారిశ్రామిక విప్లవం ఓ వరంగా, శుభకరమయిన మహా భాగ్యంగా రూపొంది ఉండేది. కాని విచారకరమయిన విషయమేమంటే, పాశ్చాత్య ఆలోచనా విధానం, వారి మనస్తత్వం ఆ కాలంలోనూ, గత కాలాల్లో ప్రదర్శించిన బలహీనతలనే ప్రదర్శించాయి. వాళ్ళ చరిత్ర ముందు నుండి ఏ అసమంజస పథాన మార్గం తప్పి పడి పోయిందో దానిపైనే ఆ తరువాత కూడా పయనించింది.

ముందు భూస్వాములు, చర్చి అధినేతలు, రాజ కుటుంబాలవారు ఉంటున్న స్థానంలో ఇప్పుడు అది మొండితనం, అన్యాయం, అత్యాచారాల స్థానాన్ని బూర్జువా వర్గం ఆక్రమించుకుంది. క్రితంలో హక్కుల్ని కోరడం, ఫిర్యాదులు చెయ్యడం, ఆగ్రహం, నిరసల్ని ప్రదర్శించడం బూర్జువా మహనీయుల పనయితే, ఇప్పుడు ఆ స్థానంలో కష్టజీవులు నిలబడ్డారు. గతంలో భూస్వామ్య వ్యవస్థలోని సంతృప్త వర్గంవారు తమ అన్యాయపరమయిన ప్రత్యేకతలు, అధర్మమయిన హక్కులు, తాము విధించిన దౌర్జన్యపరమైన ఆంక్షల్ని సమర్థించుకోడానికి మతాన్ని, నైతికతను ప్రకృతి సిద్ధాంతాల్లోని కొన్ని యదార్థాలను ఏ విధంగానయితే తప్పుడు పద్ధతిలో వినియోగించుకుని లేమికి గురయిన వర్గాల నోరు నొక్కటానికి యత్నించారో, ఇప్పుడు అచ్చంగా అదే విధానాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థలోని సంతృప్త వర్గంవారు అవలంబించనారంభించారు. అలాగే గతంలో ఏ విధంగా నైతే కోపం, మంకుతనం, చీదరించుకోవడంలో బూర్జువా ప్రజలు పడ్డారో అదే విధంగా ఇప్పుడు కార్మిక వర్గ ప్రజలూ

ప్రవర్తించనారంభించారు. ఏ విధంగా భూస్వాముల, పాదరీల అసలు తప్పిదాలను అర్థం చేసుకుని వాటికి సరయిన నివారణను చేపట్టడానికి బదులుగా తమ ప్రత్యర్థులకు ఆధారమయిన సత్యాలను వ్యతిరేకించడంలో బూర్జువా ప్రజలు తమ శక్తిని అధికాంశం ధారపోశారో అదే విధంగా ఇప్పుడు కార్మిక వర్గ ప్రజలు, వారి నాయకులు కూడా కోపావేశంలో ఆలోచనా సమతులనాన్ని కోల్పోయ్యారు. బూర్జువా నాగరికతలోని అసలు చెడుల్ని, తప్పుల్ని ముట్టడించడానికి బదులు ఆది నుండి మానవ నాగరిక, ఆర్థిక రంగాల నిర్మాణానికి ఆధారభూతమయిన సహజ సిద్ధాంతాలనే తప్పుపట్టసాగారు.

మధ్య తరగతి ప్రజలు కొన్ని బలహీనతలు, రుగ్మతలు కలిగి ఉన్నప్పటికీ తెలివిగలవారు, విద్యావంతులయి ఉంటారు. అందువల్ల వారు ఫిర్యాదు చెయ్యడంలోను, మంకుపట్టు పట్టడంలోనూ ఉత్సాహం చూపించినా కాస్తంత మనోస్థిమితాన్ని ప్రదర్శించారు. కాని శతాబ్దాల తరబడి అణచివేతకు గురయిన ప్రజల్లో విద్య. వివేకం, అనుభవం అన్నీ కొరవడ్డాయి. వీరు బాధల వల్ల స్థిమితాన్ని కోల్పోయినప్పుడు, ఫిర్యాదులు అధికమై అదుపు తప్పారు. అప్పుడు ఏ మాటనయినా స్వీకరించే ముందు బుద్ధి వివేకాల కొలమానంతో కొలవాలన్న ప్రశ్నే వారి సమక్షంలో తలెత్తలేదు. వారి ద్వేషాన్ని, క్రోధాన్ని, ప్రతీకారవాంఛను తీవ్రతరం చేసే ఏ విధానమయినా వారిని ఇతోధికంగా ఆకర్షించేది.

# ఘర్షణలో మొలచిన ఎర్ర మొక్క

నిరుపేదల క్రోధానికి పుట్టిన ఈ సుపుత్రికే సోషలిజం* పేరుతో ఖ్యాతి చెందింది. ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ పుట్టి ఇంకా అర్ధ శతాబ్దిపై కొంత కాలమయినా గడవక మునుపే అది జన్మించింది. అది జన్మించి అర్ధ శతాబ్ది దాటగానే ప్రపంచం అది లేవనెత్తిన ఉపద్రవాలతో నిండిపోయింది.

# సోషలిజం - దాని సూత్రాలు

ఈ కొత్త విధానాన్ని రచించిన యోధులు తొలుత 'ఆస్తి హక్కు'పై దాడి జరిపారు. అసలు చెడుకు మూలం ఇదే అని

---

* **సోషలిజం అన్నదానికి శాబ్దిక భావం "సామూహిక తత్వం" ఈ పారిభాషిక పదం వ్యక్తిత్వానికి(Individualism) వ్యతిరేకార్థంలో సృజించబడింది. ఈ వ్యక్తి తత్వం ఆధారంగానే ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ రూపొందింది. ఈ సోషలిజం పేరుతో అనేక విభిన్నమయిన సిద్ధాంతాలు, విధానాలు కార్ల్ మార్క్సుకు ముందు చాలా మంది ప్రవేశపెట్టారు. వారందరి ఆశయం ఒక్కటే; మొత్తానికి సమాజం యావత్తు శ్రేయాన్ని పొందగలిగే ఒక జీవన వ్యవస్థను రూపొందించాలి అన్నది. కాని ఆ ప్రతిపాదనలన్నీ కాగితంపైనే ఉండిపోయ్యాయి. మార్క్సు వచ్చి సర్వసామాన్యమైన ఈ కోరికకు సమాధానంగా ప్రత్యేక రకమయిన సోషలిజాన్ని అందజేశారు. దాన్ని 'సైంటిఫిక్ సోషలిజం,' "మార్క్సిజం," "కమ్యూనిజం" వగైరా పేర్లతో పిలిచారు. ఇక్కడ ఈ ప్రత్యేకమయిన సోషలిజం గురించే మేము చర్చిస్తున్నాము. పారిభాషిక పదాల విషయంలో శాస్త్రీయ సూక్ష్మభావాలను అట్టేపెట్టి మా పాఠకులు అర్థం చేసుకోగల లేక క్రితంలోనే పరిచితమయిన పరిభాషనే ఉపయోగిస్తున్నాము.**

వారు అభిప్రాయపడ్డారు. తొడిగే బట్టలు, వాడుకునే పాత్రలు, ఇంటి ఫర్నీచర్ ఇంకా ఇలాంటి ఇతర వస్తువులు వ్యక్తిగత ఆస్తిలో ఉంటే షరవా లేదు. కాని భూమి, యంత్రాలు, మెషిన్లు ఇంకా సంపాదనకు సాధనాలయిన ఇతర వస్తువులపై వ్యక్తులకు ఆస్తి హక్కు ఎట్టి పరిస్థితుల్లోనూ ఉండరాదు. ఎందుకంటే ఒక వ్యక్తి వీటిలో ఏదైనా ఒకటి పొంది ఉన్నట్లయితే అతడు దాని ద్వారా ధనాన్ని సంపాదిస్తాడు. ధనం సంపాదిస్తే దాన్ని కూడబెడతాడు, కూడబెడితే దానితో మరేదయినా మెషిన్ని, భూమిని కొని ధన సంపాదనా వనరుల్ని అధికం చేసుకుంటాడు వనరులధికమయితే కొందరు వ్యక్తులకు జీతం లేక కూలీ ఇచ్చి లేక మరే విధాన్నయినా ఒప్పందం చేసుకుని పని చేయించుకుంటాడు. ఇంతవరకు వచ్చాడంటే అతడు తప్పనిసరిగా బూర్జువా పెట్టుబడిదారు చేసేదంతా చేస్తాడు, కనుక ఈ పిశాచం పుట్టుక మూలాన్నే నరికివేస్తు పీడ విరగడవు తుంది. దీపపు పురుగును కాపాడాలంటే తేనెటీగను తోటలోనికి పోనివ్వకండి అన్న చందంలో ఉంది హేతువు *

## ఆక్షేపణలు - సమాధానాలు

అప్పుడు ఓ ప్రశ్న ఉత్పన్నమయింది. నిత్యావసర వస్తువులపై ఆస్తి హక్కు ఉన్నట్లే ఉత్పత్తి సాధనాలపై ఆస్తి హక్కు

* **తేనెటీగ తోటలోకి వెడితే మకరందాన్ని పీల్చి తేనెతెట్టె తయారుచేస్తుంది. అందులో నుంచి మైనం తీస్తారు. మైనంతో దీపం వెలిగిస్తారు. అప్పుడు దీపపు పురుగు దానిపై వ్రాలి అంత మవుతుంది. ఇదీ హేతువు.** — (సం)

అన్నది కూడా నేడు కొత్త విషయమేమీ కాదే, ఇది బూర్జువా పెట్టుబడిదారులు కల్పించుకున్నారనడానికి. అతి ప్రాచీన కాలాన్నుండి మానవ నాగరిక, ఆర్థిక వ్యవస్థల సౌధం నిర్మాణం అవుతూ వచ్చిన పునాదులే కదా ఇవి. ఇలాంటి దాన్ని పెకలించి పారేసే నిర్ణయం అంత టూకీగా తీసుకోవలసిన అవసరమేముంది?

దీనికి సమాధానంగా చరిత్రనే కల్పించి అందజేశారు. మానవాళి ప్రారంభ కాలంలో ఉత్పత్తి సాధనాలు వ్యక్తిగత ఆస్తిలో అసలు ఉండేవి కావు అని, తరువాత కాలంలో బలం గల వర్గాలు తమ స్వప్రయోజనాల కొరకు దీన్ని స్థాపించుకున్నారని అప్పటికప్పుడు కల్పనలు చేశారు.

మరో ఆక్షేపణ, ఈ ఆస్తి హక్కుల్ని సకల ధర్మాలు, సర్వ మతాలు, సమస్త నైతిక వ్యవస్థలు, ప్రపంచంలోని అన్ని శాసనాలు నిత్యం ఆమోదిస్తూ వచ్చాయి. వీటిలో ఏదీ సంపాదన, నాగరికతలకు సంబంధించిన ఈ విధానం తప్పయినదనే దృక్పథాన్ని వ్యక్తపరచలేదే. ఉత్పత్తి సాధనాల వ్యక్తిగత స్వామ్యం వల్ల జనించే ఈ విధానాన్ని ఎవరూ కాదనలేదే?

అప్పుడు మరు క్షణమే ఇలా ప్రాసెంచటం జరిగింది. మతం, నైతికత, చట్టం— ఇవన్నీ ప్రతి యుగంలోనూ బలం గల వర్గాల సాధనాలుగానే ఉండేవి. ఉత్పత్తి సాధనాలపై ఎవరయితే గుత్తాధిపత్యం పొందారో వారికి తమ ఆధిపత్యాన్ని పరిరక్షించుకోడానికి, పటిష్టం చేసుకోడానికి కొన్ని సిద్ధాంతాలు, కొన్ని సూత్రాలు, కొన్ని సంప్రదాయాలు, కొన్ని నియమాలు కావలసి వచ్చాయి. మరెవరయితే వీటిని వారి ప్రయోజనాల

కనుగుణంగా తయారుచేసి సమర్పించారో వారు ప్రవక్తలుగా, ఋషులుగా, నైతికతా ప్రబోధకులుగా, శాసన కర్తలుగా, చట్ట నిర్మాతలుగా నిర్ణయించబడ్డారు. కష్ట జీవులు చాలా కాలం వరకు ఈ వంచనలో, మాయాజాలంలో పడి ఉన్నారు. ఇప్పుడు వారు దాన్ని ఛేదించి తీరుతారు!

మరో ఆక్షేపణ తలెత్తింది: ఈ హక్కుల్ని అంతం చెయ్యాలంటే పెద్ద పోరాటం ప్రారంభించవలసి వస్తుందే. అప్పుడు ప్రతి జాతిలోనూ వివిధ వర్గాల ప్రజలు పరస్పరం ఘర్షించుకుని ఊరూరా వాడవాడనా వర్గపోరాటం దావానలంలా వ్యాపిస్తుందే?

సమాధానంగా చిటికలో ఓ చరిత్ర తత్వాన్నే కల్పించి చూపడం జరిగింది. అందులో మానవ నాగరికత పరిణామ ప్రగతులన్నీ వర్గపోరాటం ద్వారా జరిగాయని, ఈ మార్గం తప్ప ప్రగతికి మరో మార్గం లేదని నిరూపించటం జరిగింది.

ఇంకో ఆక్షేపణ ఈ విధంగా వ్యక్తమయింది: తన స్వార్థం కొరకు పరిశ్రమించడం మానవుని నైజంలో, ప్రవృత్తిలో నాటుకుని ఉన్న గుణం. ప్రతి మనిషి తల్లి గర్భం నుండి ఈ లక్షణాలనే పుణికిపుచ్చుకువస్తాడు కదా? ఒకవేళ వ్యక్తుల నుండి ఉత్పత్తి సాధనాల స్వామ్యం కలిగే హక్కును దోచుకుంటే, వారు కృషి చేసినంత మేరకు లాభసముపార్జనకు వారికి అవకాశాన్ని ఇవ్వకపోతే అప్పుడు వారిలో కృషి చెసే భావమే పుట్టదే? చివరికి ఈ విషయం మానవ నాగరికతా సంస్కృతులకే వినాశకరంగా రూపొందుతుందే?

దీనికి వెంటనే ఎదురు ప్రశ్న వేశారు. సహజ గుణమా? ప్రవృత్తియా? మానవాళి పరంపరగా వచ్చిన లక్షణాలా? ఇవన్నీ

బూర్జువా తత్వపు భావాలు. మానవుల్లో ఇలాంటి భావాలంటూ ఏవీ లేవు. మనిషిలోని సకల ప్రవృత్తులు అతని సామాజిక వాతావరణం సృజించినవే. ఈ వాతావరణాన్ని మార్చి మరో వాతావరణాన్ని కల్పిస్తే అతని మస్తిష్కం మరో విధంగా ఆలోచించడం మొదలెడుతుంది. ఇతని అంతర్యం మరో విధమయిన భావాలకు అలవాలమవుతుంది. ఇతని మనసు మరో విధమైన ప్రవృత్తుల్ని పోషిస్తుంది. వ్యక్తిగత ఆస్తి హక్కుకు సంబంధించిన వ్యవస్థ ఉన్నంత కాలం మనుషులు "వ్యక్తిగత ఆలోచనా" విధానానికి లోనయి ఉంటారు. సామూహిక ఆస్తి వ్యవస్థ నెలకొన్న తరువాత ఈ వ్యక్తులే "సామూహిక ఆలోచనా" విధానానికి అలవడుతారు.

## మరికొన్ని ఆక్షేపణలు

వ్యక్తిగత ఆస్తిని అంతం చేసి ఆర్థిక వ్యవహారాలన్నీ ఏ విధంగా నడిపిస్తారు? అని అడిగినదానికి, ఉత్పత్తి సాధనాలన్నీ (భూమి, కర్మాగారాలు, అన్ని రకాల వాణిజ్య, పారిశ్రామిక సంస్థలు) వ్యక్తుల అధీనంలో నుండి తీసివేసి జాతీయ సొత్తుగా చేసివెయ్యబడతాయి. ఈ సంస్థల్లో పనిచేసేవారిలోనే వీటి లాభాలు విభజించివెయ్యబడతాయి. ఈ కార్యకర్తల ఓటు బలం ద్వారానే వాటి నిర్వాహక వర్గం ఎన్నుకోబడుతుంది. వీరి చేతుల్లోనే ఈ వ్యవస్థ నిర్వహణ ఉంటుంది.

మరో ప్రశ్న. ప్రస్తుతం భూమి, ఫ్యాక్టరీలు, ఇతర ఉత్పత్తి సాధనాలపై అధీనం కలవారి స్వామ్యాన్ని అంతం చేసి జాతీయ స్వామ్యాన్ని నెలకొలిపే రీతి ఎలా ఉంటుంది?

దీనికి రెండు విభిన్న సమాధానాలు వచ్చాయి.

ఒక వర్గంవారు ఇలా అన్నారు: ఈ మార్పు కొరకు ప్రజాస్వామిక విధానాలు అవలంబిస్తాం. ప్రజాభిప్రాయాన్ని దీనికనుగుణంగా మలచి రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుంటాం. తరువాత శాసన నిర్మాణం ద్వారా క్రమేణ వ్యవసాయిక ఆస్తుల్ని, పారిశ్రామిక, వాణిజ్య కేంద్రాల్ని, (కొన్ని పరిస్థితుల్లో ప్రతిమూల్యం చెల్లించి, మరికొన్ని పరిస్థితుల్లో ప్రతిమూల్యం లేకుండా) సామూహిక ఆస్తిగా చెయ్యటం జరుగుతుంది.

ఈ అభిప్రాయం గల వర్గంవారిని గురించే ఇప్పుడు సాధారణంగా "సోషలిస్టులు" అనే పదం ప్రయోగమవుతుంది. అప్పుడప్పుడు వీరి విధానాన్ని "పరిణామ సోషలిజం" అని కూడా అంటారు.

రెండో వర్గం చెప్పేదేమంటే. ప్రజాస్వామిక విధానాలతో ఈ మార్పు సంభవించదు. దీనిగ్గాను విప్లవాత్మక విధానాలు అనివార్యం. లేమికి గురి అయినవారిని, కార్మికుల్ని సంఘటితం చెయ్యడం జరుగుతుంది. ఆస్తులున్న వర్గాన్ని ఎదిరించి సాధ్యమయిన ప్రతి విధానాన్ని అవలంబించి పోరాడటం జరుగుతుంది, బూర్జువా పరిపాలనను పడవేస్తాము. శ్రామిక వర్గ నియంతృత్వం నెలకొల్పుతాము భూస్వాముల నుండి వారి భూమి, కర్మాగారాల యజమానుల నుండి వారి కర్మాగారాలు, వ్యాపారుల నుండి వారి వ్యాపార కేంద్రాలు దోచుకోబడతాయి. ఎదిరించే వారు నాశనం చెయ్యబడతారు. వర్గాలన్నింటినీ తుదముట్టించి, ప్రజలందరినీ ఒకే వర్గం (కష్టించి భృతిని సంపాదించుకునే వర్గం)గా రూపొందించటం జరుగుతుంది. చట్టం ద్వారా ఒక

వ్యక్తి చేత లేక వ్యక్తుల చేత వేతనానికి పని చేయించుకోవడాన్ని లాభం గడించడాన్ని నిషేధించడం జరుగుతుంది.*

అయితే ఈ విప్లవం పూర్తయిన తరువాత, పెట్టుబడి దారులు సరికొత్తగా బ్రతికి లేచే ప్రమాదం మిగలదు. అప్పుడు ఈ కార్మిక నియంతృత్వం తనంతటతానై ఎండిపోయి రాలి పోతుంది (ఇది ఎలా సంభవిస్తుందో దైవానికే ఎరుక!). అలాగే ఓ క్రొత్త వ్యవస్థ దానంతట అదే దాని స్థానాన్ని ఆక్రమించు కుంటుంది (ఎలాగో, ఏమో!) ఈ వ్యవస్థలో పరిపాలన, బలాత్కారాలు లేకుండా జీవితంలోని విభాగాలన్నీ పరస్పరా మోదం, సలహా సంప్రదింపులు, సహకారాలతో ముందుకు సాగు తుంటాయి. ఈ రెండో పంథాకు పేరే "విప్లవ సోషలిజం" దీన్నే "బొల్షివిజం" అని కూడా అంటారు. దీన్నే "మార్క్సిజం" అని కూడా పిలుస్తారు. కాని నేడు ప్రపంచంలో అధికంగా "కమ్యూనిజం" అనే పేరే వినుతికెక్కింది

దాదాపు డెబ్బయి ఎనభయి ఏళ్ళ వరకు సోషలిజం అనే ఈ నూతన మార్గం తన అనేక శాఖలతో, తన విభిన్న రకాల ఆలోచనా రీతులతో యూరోపుతోను, దాని ప్రభావంలోని

*** ఈ సందర్భంలో ఒక విషయం గమనించాలి. కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారం ఒక టైలరు, లేక వంట పనివాడు ఒక్కడు స్వయంగా వేతనం తీసుకుని ఇతరుల బట్టలు కుట్టటం, లేక ఇతరుల వంట చేసిపెట్టడం చట్టబద్ధమే, కాని అతడు ఒక అబ్బాయికి వేతనం ఇచ్చి తన పనిలో అతని సహాయం పొందినట్లయితే తక్షణం "బూర్జువా" అయిపోతాడు. అతడి వ్యవహారమంతా తీవ్రమయిన అపరాధమవు తుంది. ఈ అపరాధానికి కనీసపు శిక్ష ఆస్తి జప్తు!**

దేశాల్లోనూ విస్తరించింది. ప్రారంభంలో ఇది కొందరు ఉన్మాదుల కొత్త సృష్టి మాత్రమే. దాని ప్రాతిపదికలు, దాని నిదర్శనాలు, దాని వాదనా ఫలితాలు అన్నీ పూర్తిగా నిరాధార మయినవి. అది కేవలం అగ్రహోదగ్రులయిన కార్మికుల్లోనే ప్రాముఖ్యత, ఆమోదాలు పొందసాగింది— (అదీ బుద్ధి జ్ఞానాల ఆధారంగా కాదు, మండే గుండెల ఆవేశం మూలంగా !). కాని పాశ్చాత్యుల ఆసక్తికరమయిన బలహీనతల్లో ఒకటేమంటే, ప్రతి కొత్తవాన్ని వారు ఇష్టపడతారు, ముఖ్యంగా ఆ కొత్తది అత్యంత వ్యర్థమయిందయితే, చెప్పేవారు కాస్త బరితెగించి, నిర్మొహమాటంగా చెప్పేవాడయితే, గొప్ప గొప్ప యథార్థాలనే ఖండించేవాడయితే, తన వాదనను కాస్త శాస్త్రీయ పంథాలో అందులో ఒక "సిస్టం" (పద్ధతి) గోచరించేలా సమకూర్చితే చాలు !*

ఈ ప్రత్యేకతలు ఈ "సైంటిఫిక్ సోషలిజం"లో అమితంగా అగుపిస్తాయి. అందువల్లనే మధ్య తరగతిలోని క్రింది వర్గం ప్రజల్లో చాలా మంది వివేకవంతులైనవారు. ఖుద్దుగా బూర్జువా వర్గం నుండి కొందరు పిచ్చోళ్ళు కొందరు "అమిత విజ్ఞులు" ఈ

* ఈ మాటలు ఏదో భౌగోళిక విద్వేషంతో పలకడం లేదు. ప్రాచ్య దేశాల్లో పుట్టిన పాశ్చాత్య బుద్ధి ఇంతకన్నా హీనంగా తయారయింది. పాశ్చాత్య మనస్తత్వం ఏదో కాస్త కొత్తదనమయినా చూసి దాన్ని ఇష్టపడుతుంది. ఒక పద్ధతిని, సైంటిఫిక్ విధానాన్నయినా కోరుకుంటుంది. కాని ఇక్కడయితే బానిస మనస్తత్వం పుట్టుకు వచ్చింది. దాన్ని ప్రభావితం చెయ్యడానికి కేవలం పాశ్చాత్య ప్రభువులు ఎవరయినా సెలవిచ్చిన మాటయితే సరిపోతుంది.

ద్ధాంతా పట్ల శ్రద్ధ చూపారు. దాని వివరణ, వ్యాఖ్యానాలు. ప్రచార ప్రసారాలకై పుస్తకాలు, పత్రికలు ముమ్మరంగా వెలువడ్డాయి. ప్రపంచమంతటా సోషలిస్టు సిద్ధాంతాలను అనుసరించే పార్టీలు సంఘటితమయ్యాయి. చివరికి మానవుల ఓ గొప్ప సంఖ్య ఈ సిద్ధాంతాల ప్రాతిపదికపై ఓ నాగరిక వ్యవస్థ సంస్థాపన సాధ్యమే అన్న భావం గట్టిగా నమ్మసాగింది.

## కమ్యూనిజం – దాని లాభనష్టాలు

ప్రగతిశీల సోషలిజం అన్నది ఇంతవరకు తన స్వరూపానికి ఓ నమూనా అంటూ ప్రపంచానికి అందజెయ్యలేకపోయింది. దాన్ని చూసి అయినా ఆ విధానం ప్రకారం వ్యక్తిగత పెట్టుబడిదారీ వ్యవస్థను ఏ రీతిలో సాముదాయిక వ్యవస్థగా రూపొందించడం జరుగుతుందో తెలుసుకునేవాళ్ళం. దాని పరిణామం ఎలా సంభవించేదో కూడా చూసేవాళ్ళం దాని నమూనా వ్యవస్థ లేదు. కాబట్టి మనం దాన్ని అలా వదిలేసి, విప్లవ సోషలిజం అంటే కమ్యూనిజం సాధించిన ఘనకార్యాలేవో పరిశీలిద్దాం. కమ్యూనిజం, 1914–18 వరకు జరిగిన మొదటి ప్రపంచ యుద్ధం ఆసరాగా తీసుకుని ఆ సందడిలో రష్యాలో వాస్తవంగానే ఓ విప్లవాన్ని లేవనెత్తింది. ఆ తర్వాత తన సిద్ధాంతాల ప్రకారం అది అక్కడ ఓ నాగరికతా వ్యవస్థను నెలకొలిపింది *

* కమ్యూనిజం, సోషలిజం– రెంటి మధ్య వ్యత్యాసం కేవలం ఆచరణా విధానంలోనే. ఉత్పత్తి సాధనాలను జాతీయం చేసి వెయ్యా

రష్యా కమ్యూనిజం గత చాలా ఏండ్లుగా తీవ్రమయిన వాదోపవాదాల్లో చర్చాగోష్ఠుల్లో చర్చనీయాంశంగా రూపొందింది. దాని లాభనష్టాల బేరీజు వెయ్యడంలో దాని సమర్థకులు, వ్యతిరేకులు ఉభయత్రా చాలా గింజులాట జరిగింది. దాని సమర్ధకులు గుడ్డిగా ఎన్నో మేళ్ళను కమ్యూనిజం ద్వారా లభించినట్లు ఆపాదించారు. వాస్తవానికి ఆ మేళ్ళు కమ్యూనిజం ద్వారా ప్రాప్తమయినవి కావు. సమర్ధవంతులైన, చురుకయిన వ్యక్తుల చేతుల్లోకి నిర్వహణ రావడం వల్ల ఉత్పన్నమయిన సత్ఫలితాలివి. మరో వైపు కమ్యూనిజం వ్యతిరేకులు ఎన్నో కీడుల్ని దానికి అంటగట్టారు. అవి నిజానికి కమ్యూనిజం వల్ల ఉత్పన్నమయినవి కావు దుర్మార్గులు, సంకుచిత స్వభావులైన వ్యక్తులు అధికారంలోకి రావడం వల్ల ఏర్పడిన ఫలితాలే.

## వాస్తవ దృక్పథం

కమ్యూనిస్టు రష్యా సమర్థకులు జార్ కాలంనాటి రష్యాలోని దారిద్ర్యాన్ని, వెనుకబడినతనాన్ని నేటి రష్యాలోని శాస్త్రీయమయిన, విజ్ఞానపరమయిన, వివేచనాత్మకమయిన, పారిశ్రామికమయిన నాగరిక సంబంధమయిన పరిస్థితితో పోల్చుతారు. తరువాత కూడిక, తీసివేతల లెక్కలు వేసి ఫలితంగా వచ్చే

అన్న సూత్రం మేరకు రెంటిలో సమిష్టిగా ఉన్నదే. అందువల్ల అమలు పరిచే విధానాన్ని వేరుచేసి ఉత్పత్తి సాధనాలను జాతీయం చేస్తే కలిగే లాభనష్టాలపై జరిగే చర్చ రెండు పంథాలను సమంగా వర్తిస్తుంది.

ప్రగతి ఫలాన్ని కమ్యూనిజం సమకూర్చిన శుభాల ఖాతాలో జమ కడతారు. ఇది సూత్రప్రాయంగా ఏ విధంగానూ సరయిన పద్ధతి కాదు. ముప్పయి, ముప్ఫయి రెండేళ్ళలో రష్యా సాధించిన ప్రగతిని అమెరికా, జపాన్, జర్మనీలు సాధించిన ఇలాంటి ముప్ఫయి రెండేళ్ళ ప్రగతితో పోల్చి చూసినట్లయితే ఆ ప్రగతి నిష్పత్తి బహుశా అధికంగానే ఉంటుంది. ఉదాహరణకు 1868లో జపాన్ దేశం విద్యా వ్యవస్థ దృష్ట్యా, పారిశ్రామికంగా ప్రకృతి వనరుల ఉపయోగంలో, ఉత్పత్తి సంపాదనల రీత్యా ఏ పరిస్థితిలో ఉండేది? 1904లో అది రష్యాను ఓడించినప్పుడు ఈ విషయాల్లో ఏ స్థితికి చేరిపోయింది? లేక 1870లో జర్మనీ పరిస్థితి ఏమిటి? 20వ శతాబ్ది ఆరంభానికి చేరేటప్పటికి, దాని పౌరులు శాస్త్రీయ పరిజ్ఞానం రీత్యా, మేధా సంపన్నత రీత్యా ఏ స్థాయికి ఎదిగారు? దాని ఆర్థిక వనరులు, వాటి ఉత్పత్తి దృష్ట్యా ఏ స్థితికి చేరాయి? ఒకవేళ ఈ ప్రగతుల్ని ఇంతే కాలంలో రష్యా గడించిన ప్రగతితో పోల్చి చూసినట్లయితే రష్యా ఖాతాలో పడేది, "ఏముందీ గర్వకారణం?!"

ఇంకా, ఒకవేళ ఓ ప్రత్యేక కాలంలో ఒక దేశం కొంత అసాధారణమయిన ప్రగతిని సాధిస్తే దానికి సంబంధించిన ప్రశంసలన్నీ ఆ దేశంలోని నాగరిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థకు ఆధారమయిన సిద్ధాంతాలకు అంటగట్టడం సమంజసమా? వాస్తవమేమంటే, బహుధా సామూహిక జీవిత రంగానికి సంబంధించిన వ్యవహారాలన్ని తప్పుడు సిద్ధాంతాలపై నడుస్తూ ఉంటాయి. అయినప్పటికీ నాయకుల వ్యక్తిగత సామర్థ్యం, వారి సహచరుల కార్యదక్షతలు మహోన్నతమయిన ఫలితాలను ఉత్పన్నింపజేస్తాయి.

ఇలాగే కమ్యూనిస్టు రష్యాలోని ఏ చెడుల్ని దాని వ్యతిరేకులు ప్రస్తావిస్తారో వాటిలో అధిక భాగం దాదాపు ఇదే పద్ధతిలో కమ్యూనిస్టేతర దౌర్జన్యపరులయిన వ్యక్తుల పరిపాలనలోనూ కానవస్తాయి. అలాంటప్పుడు మనం చెడుల్ని చెడు వ్యక్తుల జాబితాల నుండి తీసివేసి వారు అవలంబిస్తున్న నాగరిక ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన సిద్ధాంతాలకు అంటగట్టడంలో అర్థమేముంది ?

## లాభాలు

సంబంధంలేని విషయాలను వేరుచేసి మనం అసలు కమ్యూనిజాన్ని, అది సాధించిన ఘన కార్యాన్ని రష్యాలో జరిగిన ప్రయోగం దృష్ట్యా పరిశీలిస్తే లాభాల జాబితాలో దొరికేవి ఇవి :

1. వ్యక్తుల ఆధీనంలో నుండి భూమి. కర్మాగారాలు, వ్యాపారాలు తీసుకోవడం వల్ల ఒనగూడిన లాభమేమంటే. పూర్వం, వస్తువుల ఉత్పత్తి ధర, దాని బజారు ధరల మధ్య ఉన్న వ్యత్యాసం లేక లాభం జమీందారులు, పారిశ్రామికవేత్తలు, వ్యాపారస్తులు తీసుకునేవారు. ఇప్పుడు అది ప్రభుత్వ ఖజానాలోకి చేరసాగింది. ఈ లాభాన్ని సామూహిక సంక్షేమ కార్యాల్లో వినియోగించడం సాధ్యమయింది.

2. అన్ని దేశాల ఉత్పత్తి సాధనాలు ఒకే పరిపాలనా వ్యవస్థ ఆధీనంలోకి రావడంచేత ఓ ప్రణాళిక ప్రకారం వీటన్నింటినీ ఇతోధికంగా వృద్ధిపరచి అత్యధిక ప్రయోజనకరమైన రీతిలో వినియోగించేందుకు ప్రయత్నం చెయ్యడం, మరో వైపు

యావత్తు దేశ ప్రయోజనాలు ముందుంచుకుని వాటిని సాధించ టానికి సంఘటిత యత్నాలు అమలుజరపడం సాధ్యమయింది.

3 ఉత్పత్తి సాధనాలన్నింటినీ స్వాధీనం చేసుకుని ప్రభుత్వాం ఓ సమగ్ర ప్రణాళికా బద్ధంగా వాటిని వినియో గించడం మొదలెట్టినందు వల్ల, దేశంలోని యోగ్యులైన, సమర్థ వంతులయిన వ్యక్తులనందరినీ నియమగ్నులు చెయ్యడం కూడా సాధ్యమయింది, అలాగే ఓ నిర్దిష్ట పథకం ప్రకారం వారికి విద్యాశిక్షణలు గరపడంతోపాటు సామూహిక సంపాదనకై ఏ వృత్తుల కొరకు, ఏ సేవల కొరకు ఎందరు కావలసివస్తారో అంత మందినే ఆయా రంగాల్లో సుశిక్షితులుగా చెయ్యడం కూడా సాధ్యమయింది.

4. పైన మొదటి అంశంలో ప్రస్తావించిన వ్యావసాయిక, పారిశ్రామిక వాణిజ్య లాభాలు ప్రభుత్వ హస్తగతమయినప్పుడు ఈ లాభాల ఓ భాగాన్ని ప్రభుత్వం "సోషల్ ఇన్సూరెన్సు" (సామాజిక భీమా) ఏర్పాట్లలో వినియోగించగలిగింది. సోషల్ ఇన్సూరెన్సు అంటే, దేశంలో ఎవరయితే కష్టపడి పనిచెయ్య శక్యంకానివారున్నారో లేదా తాత్కాలికంగానయినా, శాశ్వతంగా నయినా ఎవరైతే పని చెయ్యలేకపోతారో లేదా వ్యాధి, ప్రసవం లాంటి ఇతర పరిస్థితుల కారణంగా ఎవరికైతే సహాయం అవసర మవుతుందో వారికి ఈ సమిష్టి నిధి నుండి సహాయం అందచెయ్యడం అన్నమాట.

## నష్టాలు

స్వేచ్ఛా విపణి వల్ల జనించిన అనేక రుగ్మతలు ఈ ఆపరేషన్ వల్ల బాగానే నయమయ్యాయి. కాని దీనిగ్గాను రష్యా చెల్లించవలసివచ్చిన ఖరీదెంత ? అలాగే వెనకటి రోగాల నివారణ కొరకు ఇతర రోగాలెన్ని కొనితెచ్చుకోవలసి వచ్చింది ? దీన్ని కూడా ఇప్పుడు పరిశీలిద్దాం.

1. వ్యక్తుల అధీనంలో నుండి భూమిని, పరిశ్రమల్ని ఇతర ఉత్పత్తి సాధనాలను లాక్కుని వీటన్నింటినీ సామూహిక ఆస్తిగా చెయ్యడం సాధారణమయిన విషయం కాదు— దీన్ని అందరూ సంతోషంగా, సర్వసమ్మతంగా ఆమోదించడం కష్టసాధ్యమయిన పని. ఏళ్ళ తరబడి నిరంతరంగా అతి భయంకర దౌర్జన్యాలు జరిపి దాన్ని పూర్తిచెయ్యవలసి వచ్చింది. ఎవరైనా ఇట్టే ఊహించుకోవచ్చు. లక్షలాది ప్రజల చిన్న పెద్ద ఆస్తిపాస్తుల్ని బలవంతంగా దోచుకోవడానికి సిద్ధపడితే వారు ఈ నిర్ణయాన్ని సునాయాసంగా స్వీకరించరు. ఈ కార్యం ఎప్పుడు ఎక్కడ జరిగినా ఎంతో రక్తపాతం ద్వారానే సాధ్యమవుతుంది. రష్యాలో ఈ పథకాన్ని అమలుజరపడానికి దాదాపు 19 లక్షల మందిని సంహరించవలసివచ్చిందని, 20 లక్షల మందికి వివిధ శిక్షలు విధించవలసివచ్చిందని, నలభయి లక్షల మంది దేశాన్ని వదలి ప్రపంచమంతటా చెట్టుకొకరు పుట్టకొకరుగా చెల్లాచెదరు కావలసి వచ్చిందని అంచనా వెయ్యటం జరిగింది ఒక్క ఉమ్మడి వ్యవసాయ పథకాన్ని అమలుజరపడం కొరకు సన్నకారు రైతులు, మధ్య తరగతి కమతగాళ్ళను (Kulaks) గుడ్డిగా

నాశనం చేసిన తీరును చూచి ఆవేశపరులైన రష్యా సమర్థకులు సయితం ఎలుగెత్తి రోదించారు

2. ప్రపంచంలో గర్తింపు పొందిన, మతపరమయిన, నైతికమయిన, శాసనబద్ధమయిన నియమాల రీత్యా ప్రజలకు తమ ఆస్తిపై న్యాయమయిన స్వామ్యం, అధికారం ఉన్నాయి. అలాంటివారిని, ఒకానొక కాల్పనిక విచిత్ర పథకాన్ని అమలు జరపడం కోసం, వారి ఆస్తుల నుండి దూరం చేసినట్లయితే అని వార్యంగా ఈ దృక్పథానికి వ్యతిరేకమయిన ధార్మిక, నైతిక నియమాలన్నింటినీ నిరాకరించవలసి వస్తుంది. అంతేకాదు, ఆస్తులతోపాటు ఈ నియమాలను నిర్మూలించడానికి కూడా శక్తి నంతా వినియోగించవలసి ఉంటుంది. పైగా అన్నిరకాల అత్యాచారాలు, దౌర్జన్యాలు, కాఠిన్యాలు, అబద్ధాలు, మోసాలు చేసి ఈ పథకాన్ని అమలుజరపడం కోసం సరికొత్త నైతిక దృక్పథాన్ని రూపొందించవలసి ఉంటుంది. అందులో దుర్మార్గం, దౌర్జన్యం, క్రూరత్వం, హృదయ పాషాణత్వం అన్నీ ధర్మమయినవిగా నిర్ణయించవలసి ఉంటుంది. అందువల్లనే కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు తమ ముందున్న విప్లవాన్ని నెలకొల్పడానికి దైవం, ధర్మంలాంటి వాటికి వ్యతిరేకంగా ప్రబల ప్రచారం సాగించారు. బూర్జువా వర్గంతోపాటు ముస్లిం, క్రైస్తవ మత వర్గాలను సయితం బహు కఠినంగా అణచివేశారు. కొత్త నైతిక దృక్పథాన్ని సృష్టించారు. అది లెనిన్ మాటల్లో చెప్పాలంటే ;

> "మేము ఏ దైవిక భావనకయినా అధారపడే ప్రతి నైతిక దృక్పథాన్ని నిరసిస్తున్నాము. లేక అది 'వర్గ విభజన' భావనకుఅతీతమయిన ఏ భావాల నుండి పుట్టేదయినా

మేము దాన్ని తిరస్కరిస్తున్నాము. మా దృష్టిలో నైతికత అన్నది పూర్తిగా కేవలం వర్గపోరాటానికి లోబడి ఉంది. పాత దోపిడీదారీ సామూహిక వ్యవస్థను నిర్మూలించడానికి, కార్మిక వర్గాలను ఐక్యపరచడానికి అవసరమయిన ప్రతి విషయం మా దృష్టిలో నైతికంగా ధర్మమయినదే. మా నైతికత ఏమిటంటే, మేము బాగా పటిష్టంగా సంఘటితమవ్వాలి. దోపిడి వర్గాలకు వ్యతిరేకంగా చైతన్యవంతంగా పోరాడాలి నైతికతకు సంబంధించిన శాశ్వత నియమాలూ కొన్ని ఉన్నాయనే విషయాన్ని మేమసలు ఒప్పుకోము. మేము ఈ వంచనా శిల్పాన్ని బట్టబయలు చేసి తీరుతాము. కమ్యూనిస్టు నైతికత ఒక్కటే: శ్రామిక నియంతృత్వ ప్రభుత్వాన్ని పటిష్టంగా సుస్థిరంగా నెలకొల్పడానికి నిరంతర పోరు సలపడం.

"ఈ కార్యంలో ఎన్ని ఎత్తులు, సకల వంచన మార్గాలు, సర్వ అక్రమమయిన ఉపాయాలు, సాకులు, సాధనాలు, అసత్యాలు— అన్నింటినీ ఉపయోగించటం అనివార్యం."

కమ్యూనిస్టు వ్యవస్థ సంస్థాపన కొరకు ఈ రెండో భారీ ఖరీదును చెల్లించింది రష్యా. అంటే కేవలం ఒక్క కోటి ప్రజల జీవితాలనే కాదు, వాటితోపాటు ధర్మం, విశ్వాసాలు, నైతికత, మానవత, మంచితనం ఇంకా ఈ విచిత్ర పథకాన్ని దౌర్జన్యంగా అమలు జరపడంలో అడ్డుపడిన ప్రతిదాన్నీ ధారబోయవలసి వచ్చింది.

3. మనం స్వయంగా మన దేశంలోనే వీక్షించాము. ఒక వైపు నైతిక వ్యవస్థలో కాస్త సడలింపు వచ్చి, మరో వైపు

అనేక నిత్యావసర వస్తువులు ప్రభుత్వ అధీనంలోకి వస్తే జరిగే దేమిటో అంతా మన సొంత అనుభవమే. అలాంటి పరిస్థితుల్లో లంచగొండితనం, అవినీతి, దోపిడి మూడు పువ్వులూ ఆరు కాయల్లా వృద్ధిచెందుతాయి. ప్రభుత్వ పర్మిట్, లైసెన్సు రేషన్ కార్డు, కోటాలపై ఆధారపడిన ఏ జీవితావసర వస్తువయినా దాని కోసం ప్రజలు పడరాని ఇక్కట్లు అనుభవించవలసి వస్తుంది. ప్రభుత్వాధికారులు మాత్రం నిత్య కళ్యాణం పచ్చ తోరణంగా వెలిగిపోతుంటారు,

ఇక మీరే ఊహించుకోండి, ఒక వైపేమో నైతిక విలువ లన్నింటినీ సమూలంగా తుడిచివెయ్యటం జరిగింది. 'ఏదైతే లాభదాయకమో అదే సత్యం, ధర్మం' అన్న నైతిక సూత్రాన్ని ప్రజల అంతర్యాల్లో నాటుకునేలా చెయ్యటం జరిగింది ; ఖుద్దుగా దేశ నాయకులు అతి క్రూరమయిన దుర్మార్గాలు ఆచరించి ఈ కొత్త నైతిక దృక్పథానికి తమ "ఉన్నత" ఆదర్శాన్ని నెలకొల్పారు; మరో వైపేమో, కేవలం కొన్ని నిత్యావసరాలు కాదు, దేశంలోని సకల ఆర్థిక సంపద, యావత్తు వనరులు, ప్రభుత్వ అధీనంలోకి తీసుకోబడ్డాయి— ఇలాంటి సందర్భంలో లంచగొండితనం, అవి నీతి, దోపిడి, ప్రజాపీడన లాంటివి ఎంత సర్వసామాన్యమయి పోతాయో ఎవరయినా ఇట్టే గ్రహించగలరు.

ఇది కేవలం ఊహ మట్టుకే కాదు. రష్యా ఉక్కు తెరల నుండి ప్రక్షాళన జరిగి అప్పుడప్పుడు బయటికి పొక్కే వార్తల్లో ఒకటేమంటే, అక్కడ ప్రభుత్వాధికారులు, వివిధ ఆర్థిక సంస్థల నిర్వాహకులు "అవినీతి" గడ్డు సమస్యను పుట్టించి, అక్కడి పాలకులకు తలనొప్పిగా తయారయ్యారన్నది. వాస్తవంగా ఇలా

జరగడం ఆశ్చర్యకరం కాదు. జరక్కపోవడమే ఆశ్చర్యకర మయ్యేది. ఒక వ్యవస్థను అవినీతి ఆధారంగా విచ్ఛిన్నం చెయ్యడమూ సాధ్యమే. మరో వ్యవస్థను అదే అవినీతి ఆధారంగా స్థాపించడం కూడా సాధ్యమే. కాని ఒక వ్యవస్థను అవినీతి ఆధారంగా నడిపించుకుపోవడం మాత్రం సాధారణ విషయం కాదు. బహు కష్ట సాధ్యం. ఓ వ్యవస్థను సక్రమంగా నడిపించాలంటే ఎట్టి పరిస్థితిలోనూ ఉత్తమ గుణగణాలు గల స్థిరమయిన స్వరూప స్వభావాలు గల వ్యక్తులు ఎంతయినా అవసరమే. వారందరినీ మలిచే వ్యవస్థను ముందే నిర్మూలించడం జరిగింది !

4. వ్యక్తిగత ఆస్తుల్ని అంతం చేసి సామూహిక ఆస్తుల సూత్రంపై దేశ ఆర్థిక వ్యవస్థను విజయవంతంగా నడపాలంటే, అన్నింటికంటే ముఖ్యావసరమేమంటే. ప్రజల్లో నుంచి స్వార్థం, స్వప్రయోజన కాంక్షను సమూలంగా తుడిచివెయ్యాలి. ఈ గుణాలకు బదులుగా, సామూహిక శ్రేయం కొరకు కృషి చేసే భావాన్ని వారిలో పెంపొందించాలి. అది వారి స్వప్రయోజన కాంక్షను అధిగమించి మనోమస్తిష్కాల్లో నాటుకుని ఆ భావమే వారి పనులకు మూలాంకురం, ప్రేరక శక్తి కాగలిగేలా మారాలి. అప్పుడే ఈ వ్యవస్థ సక్రమంగా పనిచెయ్యగలుగుతుంది.

మానవ నైజం, సహజ ప్రవృత్తులు, వారసత్వంగా వచ్చే భావాలు అన్నీ బూర్జువా తత్వశాస్త్రం మరియు సైన్సు చెప్పే బూటకాలు అని, ఇలాంటిదేదీ మానవునిలో అసలు లేదని, "మేము స్వప్రయోజనాభిలాషను, స్వార్థభావాలను మనుషుల అంతర్యాల నుండి వెలికితీసి వాతావరణంలోని మార్పు ద్వారా

సామూహిక భావన వారిలో జనింపజేస్తాము" అని కమ్యూనిస్టులు ప్రగల్భాలు పలికారు. కాని నిరాధారమయిన ఈ వాదాన్ని, ప్రగల్భాలను అమలుజరపడంలో కమ్యూనిస్టులు పూర్తిగా విఫల మయ్యారు అన్నది నిరూపితమయిపోయింది.

వారు తమ దేశంలోని సామాన్య పౌరుల్లో, తమ ఆర్థిక నాగరిక వ్యవస్థల నిర్వాహకుల్లో, కార్యకర్తల్లో నిజమైన సామూహిక శ్రేయభావనను పెంపొందించలేకపొయ్యారు, సాధారణంగా ఏ సమాజంలోనయినా సహజంగా ఉండే ఇలాంటి భావన కంటే గురిగింజ అంతయినా అధికంగా వారు తమ ప్రజల్లో పెంపొం దించలేకపొయ్యారన్నది కనబడుతూనే ఉంది. వారు తమ ప్రజల్లో నుండి స్వార్థాన్ని, స్వప్రయోజనాభిలాషను సమూలంగా తుడిచివెయ్యడం అలా ఉంచి కనీసం దాన్ని తగ్గించడంలోనైనా విజయం సాధించలేకపోయ్యారు. చివరికి వారు విసిగివేసారి తమ వైఫల్యాన్ని ఒప్పుకోవలసి వచ్చింది. పైగా ఆ స్వార్థాన్నే ప్రేరేపించి వారి ద్వారా పనులు చేయించుకోవలసివచ్చింది

ఇంతవరకయితే వారు బూర్జువా వ్యవస్థకు సమానంగానే ఉన్నారు. కాని వారిని బూర్జువా వ్యవస్థ కంటే హీనంగా చెడుకు లోనుచేసిన విషయం మరొకటి ఉంది. వారు, ప్రజల్లోని లాభార్జనా కాంక్షను సంతృప్తపరిచే వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యం ఇంకా ఇతర లాభసాటి కార్యాల సహజ మార్గాలను మూసివేశారు. కృత్రిమ ప్రచారం ద్వారా సాధారణమయిన, సమంజసమైన ఈ లాభార్జనా మార్గాలను అనవసరంగా చెడ్డవిగా చిత్రించారు దాని వల్ల ఈ భావమైతే అణగిపోయింది. కాని మనిషిలోని ఇతర అణగిపోయిన భావాల్లా ఈ భావం కూడా అప

మార్గం పట్టి తన పరిపూర్తి కొరకు తప్పుడు మార్గాలను సృజించు కుంది. అవి సమాజాన్ని లోలోనే గుల్ల చేసి దాని పునాదుల్ని కదలించివేస్తున్నాయి. కమ్యూనిస్టు సమాజంలో, అవినీతి, లంచం, విశ్వాసఘాతుకం, దొంగతనం, గల్లంతు చెయ్యడం లాంటి అనేక దుర్గుణాలు అత్యధికమవడానికి ఇదో పెద్ద కారణం.

అక్కడ నిషిద్ధమయి ఉన్నది ఒక్కటే. మనిషి ఇంకా అధికంగా సంపాదించడానికి తన సంపాదనను ఏ వ్యాపారం లోనూ పెట్టుబడిగా వినియోగించుకోరాదు, ఇదొక్కటి తప్ప ధనాన్ని ఖర్చు చేసే మార్గాలన్నీ ఇతర సమాజాల్లానే అక్కడా తెరచే ఉన్నాయి. ఒక వ్యక్తి తన తిండి, బట్టలు, ఇల్లు, వాహనాలు, ఫర్నిచరు ఇతర విలాస వస్తువుల కొరకు ఎంతైనా ఖర్చు చేసుకోగలడు. తన జీవన ప్రమాణాన్ని ఎంతయినా పెంచుకోగలడు. పాశ్చాత్య నాగరికతలో సర్వ సమ్మతమయిన భోగవిలాసాల విధానాలన్నింటినీ అవలంబించి ఆస్వాదించ గలడు. ఆ తరువాత మిగిలే ధనాన్ని కూడబెట్టుకోగలడు. కూడబెట్టిన ఈ ధనాన్ని తాను నేరుగా కాకపోయినా ప్రభుత్వం ద్వారా పెట్టుబడి పెట్టి దానిపై 8, 10 శాతం వడ్డీని పొందగలడు. మరణించేటప్పుడు కూడబెట్టిన ధనాన్ని తన వారసులకై వదలి వెళ్ళగలడు.

5. ఇంత రక్తపాతం, ఇన్ని ఎగుళ్ళు దిగుళ్ళు ఇంత భారీ ఎత్తున ధర్మం, నైతికత, మానవతల వినాశం ఏ లక్ష్యం కొరకు సహించారు ప్రజలు? వస్తువుల ఉత్పత్తి ఖర్చు— వాటి బజారు వెల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని అంటే 'లాభాన్ని' కేవలం జమీందారులు, పారిశ్రామికవేత్తలు, వ్యాపారులు కాజెయ్య,

కుండా, అది కేవలం కొందరు ప్రత్యేక వర్గాల జేబుల్లోకి పోకుండా సమాజం మొత్తానికి చెందేలా, అది సామూహిక ఖజానాలోకి చేరితే అందరిలో సమానంగా లేక కనీసం సమంజసంగానయినా పంపకం జరుగుతుందని కాంక్షించారు. వ్యక్తిగత ఆస్తిని అంతం చెయ్యడానికి అసలు కారణం ఇదే. ఇదే ఒకవేళ ప్రాప్తమయితే దాన్ని సామూహిక ఆస్తిని ప్రవేశపెట్టి నందుకు అసలు ప్రయోజనమని చెప్పవచ్చు. అయితే ఈ లక్ష్యం నెరవేరుతుందా ? కాస్త పరిశీలించి చూడండి. వ్యక్తిగత ఆస్తుల్ని అంతం చెయ్యడం వల్ల వ్యవసాయం, పరిశ్రమలు, వ్యాపారాల ద్వారా సామూహిక ఖజానాలోకి చేరుతున్న లాభాల పంపకం ఎలా జరుగుతుందో గమనించండి !

## తారతమ్యాలు యథాతథం

ప్రభుత్వ శాఖలన్నిటిలోను, ఆర్థిక వ్యవహారాల సంస్థ లన్నిటిలోనూ సాధారణ ఉద్యోగి మరియు ఉన్నత అధికారుల వేతనాల మధ్య వ్యత్యాసం ఇతర బూర్జువా సమాజాల్లానే ఉంది. ఒక వైపు సాధారణ కార్మికుని జీతం, అతని జీవన ప్రమాణం అమెరికా, ఇంగ్లాండులోని కార్మికుల కంటే చాలా తక్కువగా ఉంది. అయితే భారత, పాకిస్తాన్‌లో కంటే మాత్రం కాస్త హెచ్చుగా ఉంది. అదీ ఎంతో అధికం కాదు. మరో వైపేమో డైరెక్టర్లు, మేనేజర్లు, ప్రభుత్వ అధికారులు, సైనికాధికారులు, నటులు, నటీమణులు, రచయితలు, ఎడిటర్లు మొదలయినవారి ఆదాయాలు పెరుగుతూపోయి సంవత్సరానికి కొన్ని లక్షల రూబుళ్ళ వరకు చేరిపోయింది. అంటే భావమేమిటి? ఈ

వాణిజ్య, పారిశ్రామిక లాభాలన్నీ పూర్తిగా కాకపోయినా చాలా వరకు అసమానంగానే పంపకమవుతున్నాయి ఏ విధంగానైతే పూర్వం శ్రామిక వర్గం మరియు బూర్జువా ప్రజల మధ్య పంపిణీ జరిగేదో అదే విధంగా ఇక్కడ కూడా పై తరగతి, క్రింది తరగతి వాళ్ళ మధ్య అసమానమయిన రీతిలోనే ఈ లాభాల పంపిణీ జరుగుతోంది.

## అనవసరపు ఖర్చులు

ఇక కమ్యూనిస్టు పద్ధతాన్ని నెలకొల్పడానికి శ్రామిక వర్గం మరియు బూర్జువా వర్గానికి మధ్య ద్వేషం, వైషమ్యం, ప్రతీకారం లాంటి భావాల విశ్వజనీనమైన జ్వాలను రగుల్గొల్పడం జరిగింది. దానివల్ల ప్రపంచంలోని కమ్యూనిస్టేతర సమాజాలన్నీ రష్యాకు వ్యతిరేకంగా సమాయత్తమయ్యాయి. అందువల్ల రష్యా వ్యక్తిగత ఆస్తుల్ని అంతం చేసి, వాణిజ్య పారిశ్రామిక లాభాలను బూర్జువా వర్గానికి చేరకుండా చేసి దాని అధికతర భాగాన్ని యుద్ధ తయారీలకు ఖర్చు చెయ్యడం తప్పనిసరి అయింది.

ఈ రెండు పెద్ద పెద్ద పద్దుల్లో లాభాలన్నీ ఖర్చయిపోయిన తరువాత మిగిలినదేమయినా "శ్రామిక వర్గం" పొందగలిగితే అది "సోషల్ ఇన్సూరెన్స్" (సామాజిక భీమా) క్రింద ఖర్చయ్యేదే. మొత్తం లాభాన్ని పోల్చి చూస్తే దాని నిష్పత్తి ఎంత? మహా అయితే ఒకటి లేక రెండు శాతం.*

---

* సోషల్ ఇన్సూరెన్సు నిధికై రష్యాలో అవలంబించే విధానం ఏమిటంటే, ప్రతి సంస్థ తన కార్యకర్తల జీతాలకై ఖర్చు చేసే మొత్తంపై

ఇప్పుడు తలెత్తిన ముఖ్య ప్రశ్న ఏమంటే, ఇంతే ధనం లేక ఇంతకన్నా అధికమయిన ధనం సోషల్ ఇన్సూరెన్స్ కింద మరో విధానంలో, మరో వ్యవస్థలో దొరికే అవకాశము ఉంటే, ఇంత రక్తపాతం, పోరాటం, అత్యాచారం, దౌర్జన్యం, ధర్మం, నైతికతల బలిదానాల ద్వారా వ్యక్తిగత ఆస్తుల్ని అంతం చేసి అనవసరంగా సామూహిక ఆస్తుల ఓ కృత్రిమమయిన వ్యవస్థను మానవ మనుగడపై రుద్దే అవసరమేమొచ్చింది?

6. సామూహిక ఆస్తి, సామూహిక నిర్వహణ, సామూహిక ప్రణాళికా రూపకల్పనల్ని ప్రవేశపెట్టడానికి, ధన ప్రాణాల, నీతినియమాల, మతం మానవతల సర్వ వినాశనానికి రష్యా ఒడిగట్టవలసి వచ్చింది. అది కేవలం ఈ కొత్త ప్రయోగం లోని తొలి దశయే. ఈ తొలి దశకే ప్రతిమూల్యం చెల్లించవలసి వచ్చింది. ఇప్పుడు దాన్ని అమలు జరిపిన తరువాత నిత్య జీవితంలో అది రష్యా ప్రజలకు అనుగ్రహిస్తున్నదేమిటి? దాన్ని వారి నుండి పరిగ్రహిస్తున్నదేమిటి? దాన్ని కూడా కాస్త సమీక్షించాలి, అది వారికి ఇచ్చేది ఇవి :

ఒకటి, ప్రతి వ్యక్తి రెండు పూటలా కూడు, వళ్ళు కప్పు కోడానికి గుడ్డ తలదాచుకోడానికి కొంప పొందే ఏర్పాటు జరిగింది.

**పది శాతం నుండి 20 శాతం వరకు ఓ భాగం. అది ప్రత్యేక నియమం ప్రకారం సోషల్ ఇన్సూరెన్సు స్కీములో జమచేస్తూ ఉంటుంది. ఈ విధంగా సగటున దేశంలోని జీతభత్యాల మొత్తంలో దాదాపు 14 శాతం కార్యకర్తల శ్రేయానికి వినియోగమవుతుంది ఇది మొత్తం ఆర్థిక లాభానికి ఒకటి లేక రెండు శాతానికి మించదు.**

రెండు, మనిషికి ఏదైనా గడ్డు కాలం దాపురిస్తే అప్పుడు ఆదుకోడానికి సామూహికమయిన ఏర్పాటు కూడా జరిగింది.

ఈ కొత్త వ్యవస్థ ఆ దేశ ప్రజలకు ప్రసాదించింది అసలు ఈ రెండు లాభాలే. అయితే ఆ ప్రజల నుండి అది తీసుకున్న దేమిటో కాస్త పరిశీలించండి.

## బలమైన నియంతృత్వం

వ్యక్తిగత ఆస్తికి బదులు సామూహిక ఆస్తికి సంబంధించిన వ్యవస్థను స్థాపించాలంటే, ఈ సిద్ధాంతానికి ఆధారంగా వెలసిన పార్టీ అంటే కమ్యూనిస్టు పార్టీయే ఈ పనిని చేపట్టాలి. స్వయంగా ఈ పార్టీ దృక్పథంతో పాటు ఈ పనిని చెయ్యడానికి అవసరమైన విధానం కూడా ఒక్కటే: ఒక బలవత్తరమయిన నియంతృత్వ వ్యవస్థ నెలకొనడం అది తన శక్తినంతా వినియోగించి వ్యక్తిగత ఆస్తి వ్యవస్థను రూపుమాపాలి. ఇంకా బలాన్ని వినియోగించి కొత్త వ్యవస్థను నెలకొల్పాలి. తదనుగుణంగానే ఓ నియంతృత్వం నెలకొన్నది. దానికి శ్రామిక వర్గ నియంతృత్వం అని నామకరణం చేశారు. కాని రష్యాలో కార్మికులు, కర్షకులు, ఇంకా విభిన్న జీవన రంగాలలో పనిచేసే శ్రామికులు అందరూ కమ్యూనిస్టు పార్టీలో చేరిలేరన్న విషయం అందరికీ తెలిసినదే. బహుశా ఈ వర్గంలోని 5 శాతం పౌరులయినా ఈ పార్టీ సభ్యులు కారేమో. అందువల్ల ఇది నామకః శ్రామికుల నియంతృత్వమయినా వాస్తవానికి శ్రామికులపై కమ్యూనిస్టు పార్టీ యొక్క నియంతృత్వపు పరిపాలన అనే చెప్పాలి.

ఈ నియంతృత్వం కూడా తేలికయింది కాదు. సామూహిక ఆస్తి అంటే భావమేమిటి? దేశంలోని జమీందారులందరూ అంతమయ్యారు. ఇప్పుడు ఒకే ఒక సాటిలేని జమీందారు దేశంలోని భూమి మొత్తానికి స్వామి అయ్యాడు. పారిశ్రామిక వేత్తలందరూ, వ్యాపారస్తులందరు, గుత్తాదారులందరు అంతమై పొయ్యారు. వీరందరికి బదులుగా అన్ని రకాల ఉత్పత్తి సాధనాలన్నింటిపై అధిపత్యం గల ఒక బడా పెట్టుబడిదారు వచ్చి వారి స్థానాన తిష్ఠవేశాడు. ఆ పెట్టుబడిదారుకే రాజకీయ శక్తి కూడా హస్తగతమయి ఉంది. ఇదీ కమ్యూనిస్టు పార్టీ నియంతృత్వం.

## వ్యతిరేకత అసాధ్యం

ఇప్పుడు రష్యాలో ఒకవేళ ఈ ఆర్థిక, నాగరిక, రాజకీయ శక్తినంతా వినియోగించేవారంతా జనసామాన్యం ఓట్లతోనే ఎన్నికై రావడం మీకు కనిపిస్తూ ఉందంటే వాస్తవానికి ప్రజాస్వామ్యమంటే ఇదేనా? కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకంగా ఓట్లు అర్థించడానికి రష్యా మొత్తంలో ఎవరికి దమ్ములున్నాయి? ఎవరయినా సాహసం చేస్తే అతడు రష్యా భూతలంలో ఏం తింటాడు? ఎక్కడి నుండి తింటాడు? పిలుపు ఇవ్వదలచుకుంటే ఏ ప్రెస్ ద్వారా ఇస్తాడు? తన మాటను వినిపించడానికి, దేశంలో పర్యటించాలంటే ఏ వాహనాలను వాడతాడు? సరే, ఇదంతా చేసే ముందు అతడు తన జీవన మృత్యువుల మధ్య దూరాన్ని దాటడానికి ఎంత కాలం పడుతుంది?

వాస్తవమేమంటే సామూహిక ఆస్తి ప్రాతిపదికగా ఏర్పడే వ్యవస్థలో ప్రభుత్వం వద్ద ప్రోగయ్యే శక్తి మానవ చరిత్రలోనే

అనుపమమయింది. ఇంతటి శక్తి ఏ చంగీజ్ ఖాన్‌కుగాని, ఏ హలాకూ ఖాన్‌కుగాని. మరే జార్ ప్రభువులకుగాని, ఇంకా ఏ సీజర్‌కుగాని ప్రాప్తం కాలేదు ఏ వర్గం అయితే ఒకసారి ఈ శక్తిని వశపరచుకుంటుందో దానికి వ్యతిరేకంగా దేశ ప్రజలు పూర్తిగా అశక్తులయిపోతారు. వేరే ఏ విధమయిన ప్రభుత్వమయినా రుగ్మతకు గురైతే దాన్ని మార్చివెయ్యడం అంత కష్టం కాదు. కాని కమ్యూనిస్టు ప్రభుత్వం ఈ అవస్థకు గురయితే దాన్ని మార్చడం సులభసాధ్యం కాదు.

ఈ ప్రభుత్వ వ్యవస్థలో పాలక పక్షం, దేశం మొత్తానికిగాను ఏర్పరిచే ప్రణాళిక (Plan)ను విజయవంతంగా నడవడానికి పత్రికల్ని, రేడియోను, సినిమాను, పాఠశాలల్ని, పరిపాలనాయంత్రాంగాన్ని దేశంలోని ఆర్థిక వ్యవస్థను ఓ ప్రత్యేక పథకం ప్రకారం వినియోగిస్తుంది. ఈ ప్రణాళిక దిగ్విజయమవ్వాలంటే కేంద్రంలో కూర్చుని ప్రణాళిక రూపకల్పన చేసే "మేధావులే" మొత్తం దేశంలో ఆలోచించేవారుగా, స్థిర అభిప్రాయాలుగల వారుగా, నిర్ణయాలు గైకొనేవారుగా ఉండి తీరాలి. ఇది అనివార్యం. మిగతా దేశమంతా కేవలం అమలుజరిపే కాళ్ళు చేతులుగా ఉండాలి, వీరు "ఆజ్ఞాపాలన"లో ఎలాంటి అభ్యంతరాలు, ఆక్షేపణలు, సందేహాలు, సంశయాలు వెలిబుచ్చకుండా ఉండాలి. విమర్శించడం, తప్పులెన్నడం, వ్యాఖ్యానించడం లాంటి అలవాట్లు ఉన్నవారికి జైలు, ఉరికంబం తప్ప మరెక్కడా చోటుండదు. ఇలాంటి జోక్యం కల్పించుకునే వారిని దేశం నుండి బహిష్కరించడం అన్నది ఎంతో మినహాయింపు, రాయితీతో కూడుకున్న విధానం.

ఈ కారణంగానే, రష్యాలో, స్వయంగా కమ్యూనిస్టు పార్టీలోని గొప్ప గొప్ప కార్యకర్తల్ని, నాయకుల్ని మరణం, యావజ్జీవ కారాగారం. దేశ బహిష్కరణ లాంటి శిక్షలు విధించబడ్డాయి. ఈ నాయకులు సామాన్యులు కారు. వీరి అవిరళ పరిశ్రమ వల్లనే. వీరి శక్తిసామర్థ్యాల కారణంగానే కమ్యూనిస్టు విప్లవం విజయవంతం కాగలిగింది. ఈ శిక్షలకు కారణం, వీరు పాలక వర్గంతో అభిప్రాయభేదాన్ని వ్యక్తపరిచే సాహసం చేశారు. కమ్యూనిస్టు నైతికతలో మరో గమ్మత్తు కూడా జరుగుతుంది. అభిప్రాయభేదం వెలిబుచ్చిన నేరానికి ఎవరెవరిని నిర్బంధిస్తారో వారందరిపై రకరకాల భయంకరమయిన ఆరోపణలు అసంఖ్యాకంగా మోపేస్తారు. కమ్యూనిస్టు న్యాయస్థానాల వింతయిన మహత్యం ఏమంటే ఆ న్యాయస్థానాల్లో పాలక పక్షం ఎవరెవరిని దోషులుగా నిలబెడుతుందో వారంతా ప్రాసిక్యూటర్ కోరిన విధంగా తమ నేరాల పట్టికను తామే స్వయంగా అనర్గళంగా వినిపిస్తారు. అదీ, వినీ వినపడని విధంగా, అర్థాంగీకారంగా ఏమీ కాదు. ఎంతో ఘనంగా, మరెంతో జోరుగా నేరాలను ఒప్పుకుంటారు. తాము పెద్ద దేశ ద్రోహులని, పెట్టుబడిదారుల ఏజెంటులని, రష్యా పక్కలో బల్లాలని ఒప్పుకుంటారు!

## దిన దిన గండం ...

ఈ వ్యవస్థ వ్యక్తిగత ఆస్తిని, ధార్మిక వర్గాలను అణచి బలవంతంగా స్థాపించబడింది, పైగా ఎవరి భావాలు, ఉద్రేకాలు, హక్కులను చంపి వాటి గోరీలపై ఈ సౌధం నిర్మించబడిందో ఆ ప్రజలు ఇంకా ప్రపంచం నుండి స్వయంగా

రష్యా నుండి అంతమయిపోలేదు. ఈ కారణాల వల్ల రష్యాలో "తిరుగు విప్లవం" సంభవించే ప్రమాదం అనునిత్యం కమ్యూనిస్టు పార్టీ నియంతలను వెంటాడుతూనే ఉంటుంది. అదీకాక కమ్యూనిస్టు మహనీయులకు బాగా తెలుసు— వారు ఎంత తిరస్కరించినా, మానవ నైజం అన్నదొకటి ఉందని. అది వ్యక్తిగత లాభార్జన వాంఛను కలిగి ఉందని. తిరిగి వ్యక్తిగత ఆస్తి ఆధారంగా ఏర్పడే వ్యవస్థ నెలకొనాలని అది నిత్యం దృఢంగా కోరుతుంటుందని!

ఈ కారణాల వల్లనే కమ్యూనిస్టు పార్టీ ఖుద్దుగా తన సొంత వ్యవస్థకు అప్పుడప్పుడు "విరేచనాల" మందు ఇస్తూ ఉంటుంది. దీని ద్వారా, పార్టీలో ఎవరిలోనయినా "తిరోన్ముఖ" వాదం వాసన ఏ కాస్త వచ్చినా వారి ప్రక్షాళన జరుగుతూ ఉంటుంది.*

మరో వైపు పార్టీ ప్రభుత్వం దేశమంతటా తిరుగు విప్లవం ప్రమాదాలను, అవకాశాలను, చివరికి అనుమానాలను సయితం నిర్మూలించడానికి ప్రతి నిత్యం సిద్ధంగా ఉంటుంది. ప్రభుత్వ

*** ఈ ప్రక్షాళన క్రియ ఇంత వరకు కమ్యూనిస్టు పార్టీ లక్షలాది సభ్యులపై జరిగింది. రష్యాలో ప్రక్షాళన అంటే, కేవలం పార్టీ ఉద్దేశాలకు సరిపడని వ్యక్తిని పార్టీ నుండి బహిష్కరించడమే కాదు. వాస్తవానికి ఈ బహిష్కరణ తరువాత గూఢాచార పోలీసుల యాతనా గృహాల (Torture Chambers) నుండి తప్పించుకుని బయటపడిన అదృష్టవంతుడు ఒక్కడూ లేడనే చెప్పవచ్చు. ఈ యాతనా గృహాల నుండి బయటి ద్వారం సామాన్యంగా స్మశానానికో లేక మానవ దొడ్డి (Concentration camps)కో గొనిపోతుంది. అక్కడ మనిషి సజీవంగా నరక బాధల్ని చవిచూస్తాడు.**

గూఢచారి వ్యవస్థను ఎంతో విస్తృతపరచి ఉంచింది. దాని కార్య కర్తలు ప్రతి సంస్థలోను, ప్రతి ఇంటిలోను, నలుగురు సమావేశమయిన ప్రతి చోటా "తిరోగమనవాదుల్ని" వాసన చూస్తూ తిరుగుతుంటారు. ఈ గూఢచారి మహేంద్రజాలం భార్యాభర్తల మధ్యన కూడా అనుమానాల గోడల్ని నిలిపింది. చివరికి తల్లిదండ్రులకు వ్యతిరేకంగా సంతానం చేత సమాచారం సేకరించడానికి వెనుకాడలేదు.

రష్యా పోలీసు మరియు సి. ఐ. డి. అభిప్రాయంలో, 'ముందు జాగ్రత్త' చర్యల్లో ఏదయినా పొరపాటు జరిగి కొన్ని వందల లేక కొన్ని వేల మంది నిర్దోషులు పట్టుబడి చంపబడినా ఫరవాలేదు కాని, కొందరు ద్రోహులు తప్పిపోవడం, వాళ్ళ ద్వారా తిరుగు విప్లవం విజృంభించడంకన్నా ఇదే మేలు. అందువల్లనే వారు ప్రతి ఫ్యాక్టరీలో, ప్రతి గనిలో, ప్రతి కార్యాలయంలో, ప్రతి సంస్థలో పరికించి చూస్తూ ఉంటారు. ఏ కార్మికుడయినా, మరే కార్యకర్త అయినా దేశంలో, స్వయంగా తాను పనిచేస్తున్న సంస్థలో జరిగే నిర్వహణ పట్ల పెదాలు విరవడమయినా, అసంతృప్తి వెలిబుచ్చడమైనా చేస్తాడేమోనని పరీక్షగా గమనిస్తూ ఉంటారు. అలాంటి పని చెయ్యటమలా ఉంచి, అలాంటి భావాల గాలి కూడా ఎవరికైనా సోకినట్లు అనుమానం కలిగినా అతన్ని తక్షణం నిర్బంధించడం జరుగుతుంది.

ఇది అనుదినం జరిగే మామూలు పనే కాబట్టి, రాత్రికి ఎవరయినా కార్మికుడు లేదా ఉద్యోగి ఇంటికి చేరకపోతే తన భర్త పట్టుబడ్డాడనే నిర్ణయానికి వస్తుంది అతని భార్య. రెండో రోజు నుండి ఆమె స్వయంగా అతని అవసర వస్తువులన్నీ తీసు-

వెళ్ళి పోలీస్ స్టేషన్‌లో చేరవెయ్యనారంభిస్తుంది. అక్కడ పోలీసువాళ్ళు వాటిని తీసుకుంటే ఆమె అనుమానం నిజమయిందనడానికి అది ఆధారమన్న మాట. ఆమె ఏదయినా అడిగితే ఆ కార్యాలయం నుండి ఏ బదులూ దొరకదు. ఒక రోజు అకస్మాత్తుగా ఆమె పంపిన పార్సిలు వాపసు వస్తుంది ఇది దేనికి సూచన? ఆమె భర్త ఇక లేడని అతడు "లెనిన్‌కు ప్రీతిపాత్రుడై అతని సన్నిధిన చేరాడ"ని దానికి అర్థం. ఇక ఆ సాధ్వీమణి స్వయంగా ఆ పర్యవసానాన్ని ఎదుర్కొనదలచకపోతే ఆమె చెయ్యవలసింది ఒక్కటే, మంచి "కామ్రేడ్ మహిళ"లా ఈ విషయం ప్రస్తావనే కాదు దాని వాసన కూడా తన నోటి ద్వారా బయటికి రాకుండా ఆమె జాగ్రత్తపడాలి. ఆ తరువాత "తిరోగమన వైఖరి"కి అతీతుడయిన మరో భర్తను ఎన్నుకోవాలి

ఇదీ— 'రెండు పూటల కూడు, అవసరమేర్పడినప్పుడు సహాయం' పొందడానికి కమ్యూనిస్టు రష్యా పౌరుడు చెల్లించవలసి వస్తున్న ప్రతిమూల్యం. ఈ ప్రతిమూల్యానికి ఈ బేరం నిజంగా చౌకేనా? పస్తులతో సతమతమయ్యే ఓ వ్యక్తి పలుమార్లు ఆకలి బాధను తట్టుకోలేక. ఆకలికి పరాధీనుడయి ఈ కష్టభరితమయిన స్వేచ్ఛా జీవితంకన్నా జైలే మేలని తలపోయడం జరుగుతుంది. ఎందుకంటే అక్కడ కనీసం రెండు పూటలా కూడు, వళ్ళు కప్పుకోడానికి గుడ్డ తలదాచుకోడానికి కాస్తంత జాగ దొరుకుతాయి— ఇది కొంత సహజమే, సందేహం లేదు. కాని మానవాళికంతటికీ వాస్తవంగా కూడూ, స్వేచ్ఛ రెండూ ఒకేసారి లభించకుండా పోయేటంతటి సమస్య ఉత్పన్నమయిందా? ఇక కూడు దొరికే ఒకే మార్గం మిగిలిపోయిందా— భూలోకమంతా ఒక జైలయి

కొందరు కామ్రేడులు దాని జైలరులుగా, వార్డరులుగా మారడం తప్ప మరో మార్గం లేదా?*

# ప్రతిచర్య

రష్యాలో కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించడానికి పెద్ద ఎత్తున చేసిన భయంకర అత్యాచారాల కారణంగా, తరువాత ఆ విప్లవం విజయవంతమై ప్రపంచ దేశాలన్నింటిలో వర్గ పోరాటపు అగ్నిలో ఆజ్యం పోయడం వల్ల కమ్యూనిస్టేతర దేశాలన్నింటిలోని మేధావులు ఆలోచించడానికి సన్నద్ధులయ్యారు. స్వేచ్ఛా విపణి సూత్రాలు, విధానాలలో ఏ విధమయిన మార్పులు చేస్తే శ్రామిక వర్గం ఫిర్యాదులు దూరమవుతాయో తద్వారా వాళ్ళ దేశాలను కమ్యూనిస్టు విప్లవాల ప్రమాదాలకు గురికాకుండా ఏ విధంగా రక్షించుకోవాలో అనే విషయాలను ఆలోచించసాగారు.

కొత్త పెట్టుబడిదారీ వ్యవస్థ అమలులోకి వచ్చినప్పటి నుంచే స్వేచ్ఛా విపణి చెడులు వ్యక్తమవసాగాయి. అప్పటి నుంచే దానిపై విమర్శలు రాసాగాయి తదనుగుణంగా అందులో

---

*** రచయిత 1948లో కమ్యూనిజం వల్ల ఏర్పడే మనస్తత్వాన్ని ఎంత చక్కగా అంచనావేశారో నేడు(1990) రష్యా, తూర్పు యూరపు దేశాల్లో వస్తున్న మార్పుల్ని వీక్షిస్తున్న మనం గుర్తించగలుగుతున్నాము. (అను)**

కొన్ని స్వల్పమయిన మార్పులతో పాటు పై మెరుగులు దిద్దే పని కూడా కొంత జరిగింది. కాని ఆ వ్యవస్థలోనే మార్పులు చేర్పులు, సవరణలు సంస్కరణలు చేసే అవసరం, దాని నిజ చైతన్యం ఆ తరువాతే కలిగాయి. రష్యాలో కమ్యూనిస్టు వ్యవస్థపై అమలు దాని ప్రభావాలు, దాని ఫలితాలను చూచినప్పుడే ఈ చైతన్యం కలిగింది. ఈ ప్రతిచర్య పెట్టుబడిదారీ వ్యవస్థకు సంబంధించిన రెండు బృహత్తర ప్రాంతాల్లో రెండు విభిన్న రూపాలు ధరించింది

ఏ జాతుల జీవన వ్యవస్థ అయితే తొలి ప్రపంచ యుద్ధం కారణంగా బహు హీనంగా విచ్ఛిన్నమయిందో, మరేవయితే కమ్యూనిజం రేపిన వర్గ పోరాటపు మంటల్లో పూర్తిగా దహనమై పోయే ప్రమాదానికి గురి అయ్యాయో, మరే దేశాల్లో ప్రజాస్వామ్యపు పునాదులు పటిష్ఠంగా లేవో అలాంటి దేశాల్లో ఫాసిజం, నాజీజం చోటు చేసుకుంది

ఏ జాతుల్లోనయితే ప్రజాస్వామ్యం పటిష్ఠంగా ఉండిందో, మరెవరి జీవన వ్యవస్థపై తొలి ప్రపంచ సంగ్రామం ఎక్కువగా ప్రభావం చూపలేదో వారు తమ పురాతన ఉదార స్వభావంతో కూడుకున్న ప్రజాస్వామిక పెట్టుబడిదారీని, దాని సైద్ధాంతిక పునాదుల పైనే స్థిరపరచి కేవలం దాని "స్వేచ్ఛా" తత్వంలో సవరణలు తెచ్చి దాని చెడులు దూరమయ్యేలా ప్రయత్నం జరిపారు.

## ఫాసిజం, నాజీజం

కమ్యూనిస్టులు సామాన్యంగా ఇటలీలోని ఫాసిజాన్ని, జర్మనిలోని నాజీజాన్ని— ఈ రెండు ఉద్యమాలను పెట్టుబడి

దారీ వ్యవస్థ అవలంబించిన తిరోగమనం అని చిత్రించడానికి ప్రయత్నిస్తారు. ఇంకా, బూర్జువా పెట్టుబడిదారులు తమ ఆట సాగకపోయేసరికి హిట్లర్‌ను, ముసోలినీని నిలబెట్టారని ఆరోగిస్తారు. కాని ఇది యథార్థం కాదు. వాస్తవమేమంటే వీరు ఒక వర్గానికో లేక ఓ ప్రత్యేక ప్రయోజనాలకో దుష్ట సంకల్పం గల ఏజెంట్లు కాదు. మార్క్స్, లెనిన్ లాంటివారే. వారిలానే చిత్తశుద్ధి కలవారు, వారిలానే వివేచనాపరులు, వారిలానే వక్ర బుద్ధులు కూడా. వారు గమనించిందేమంటే, ఒక వైపు యుద్ధం వేసిన గట్టి దెబ్బ కారణంగా వారి జాతి నిర్వీర్యమయిపోయింది. శతాబ్దాల గర్వకారణమయిన ప్రాభవమంతా మట్టిలో కలసిపోతోంది. రెండో వైపు స్వేచ్ఛా విపణిలోని అంతర్గత చెడులు. కమ్యూనిజం బాహ్యంలో తెచ్చిన ప్రమాదాలు కలసి జాతిలోని విభిన్న వర్గాలను పరస్పరం సంఘర్షణకు గురిచేశాయి. అది అత్యంత తీవ్రంగా, హింసాత్మకంగా. విధ్వంసకరంగా పరిణమించింది. అందువల్ల వారు ఈ వర్గ ప్రయోజనాల అంతర్గత సంఘర్షణల్ని దూరం చేసి తమ జాతీయ సమైక్యతను ముక్కలు చెక్కలు కాకుండా కాపాడటానికి, తమ జాతి ఆర్థిక. నాగరిక, రాజకీయ శక్తిని పటిష్టం చేసి దాని వైభవ ప్రాభవాలను సరికొత్తగా ప్రపంచ స్థాయిలో నిలుపుకోడానికి మార్గాలు ఆలోచించసాగారు. కాని వారు, వారి సమర్థకులు, వారి అనుయాయులు అందరూ, మనం చరిత్రలో నిరంతరంగా చూస్తూ ఉన్న పాశ్చాత్య ఆలోచనా తీరులోని దౌర్బల్యాలన్నింటికి వారసులు. వీరు కూడా తమ పూర్వపు ఆలోచనాపరులు, తత్వవేత్తల మాదిరిగా కొన్ని యదార్థాలను ఆధారంగా తీసుకుని వాటికి అనేక

అతిశయాలను జోడించి కొన్ని యదార్థాలను త్రోసిపుచ్చి, వాటి స్థానాన కొన్ని పెడర్థాలను కల్పించి ఈ మిశ్రమంతో ఓ సమతూకం లేని సరికొత్త జీవన వ్యవస్థను రూపొందించారు.

అయితే ఈ మిశ్రమం ఎలా తయారయిందో అందులో సవ్యమయినది, అపసవ్యమయినది ఏ నిష్పత్తిలో చేర్చబడ్డాయో వాటి లాభనష్టాల బేరీజు ఎలా ఉండిందో చూడవలసి ఉంటుంది. ఇంతకు రెండో ప్రపంచ యుద్ధంలో ఈ రెండు కవల సోదరులు చూడటానికి అంతమయిపోయినా ఇవి వ్యాపింపజేసిన అనేక దుర్గుణాలు పేరు మార్చుకుని విభిన్న దేశాల్లో ఇప్పటికీ తిష్ఠవేసి ఉన్నాయి. స్వయంగా మన దేశం కూడా ఈ పీడల నుండి రక్షణ పొందలేదు. అందువల్ల ఫాసిజం, నాజీజంలోని మంచి అంశాలు, చెడు అంశాలేవేవో గుర్తించటం, యుద్ధానికి పూర్వం ఎంత అవసరమో ఇప్పుడూ అంతే అవసరం.

## ప్రయోజనకరమయిన పని

ఒక సమాజంలోని, ఒక జాతిలోని భూస్వాములు, పెట్టుబడిదారుల వర్గం, శ్రామిక వర్గం మధ్యన ఉండే సరయిన సహజమయిన సంబంధం ద్వేషం, వైషమ్యం, పోరాటాలే అన్న కమ్యూనిస్టుల అభిప్రాయాన్ని ఖండించడం వరకు ఫాసిస్టులు, నాజీలు సక్రమంగానే వ్యవహరించారు. వారి ఈ భావం కూడా నూటికి నూరు పాళ్ళు సరయినదే— "అసలు ముఖ్యమయింది వర్గం కాదు, సమాజం లేక జాతియే ముఖ్యమయింది, దాని విభిన్న వర్గాలు, విభిన్న శాఖలు తమ ఈ సముదాయం కొరకు విభిన్న సేవలు చేస్తూ ఉంటాయి. వాటి మధ్యన నెలకొనే నిజ

మయిన సంబంధం విరోధం పోరాటాల. ఘర్షణలది కాదు సానుకూలత, సహకారం, సహచర్యంతో కూడుకున్నది. వీరి బాధ్యత ఏమంటే అందరూ కలసి అందరి కొరకు అవసర వస్తువుల ఉత్పత్తి చెయ్యాలి. సామూహిక ఉత్పత్తిని పెంచి జాతీయ సంపత్తిని శక్తిని పెంపొందించాలి. ఈ సానుకూలత, సహకారాల్లో ఏదైనా లోటు, లేక ఏదైనా అవాంతరం ఏర్పడితే దాన్ని దూరం చెయ్యాలి, విభేదాలు, వివాదాలు ఉత్పన్నమైతే దాన్ని దూరం చేసుకోవాలి. ఇవి పెరగటమూ, ఒకే సమాజానికి చెందిన అంగాలు పరస్పర వినాశానికి పూనుకోవడం జరకూడదు."

సామూహిక ప్రయోజనం కొరకు వ్యక్తిగత ఆస్తి. వ్యక్తిగత స్వలాభాపేక్ష స్వయంగా హానికరమని, అది అంతమవ్వాలని చెప్పే కమ్యూనిస్టుల దృక్పథాన్ని వారు రద్దుపరచడం కూడా సమంజసమే. దానికి భిన్నంగా ఈ రెండు విషయాలు కూడా స్వయంగా సామూహిక ప్రయోజనానికే లాభకరం, అవసరం అని. అయితే ఇవి స్వేచ్ఛా విపణిలా హద్దుపద్దు లేకుండా ఉండరాదని, కొన్ని పరిమితులతో పరిమితం అవడం అవసరమని చెప్పినవారి అభిప్రాయం కూడా సరయినదే: వారు చెప్పిందేమంటే, "వ్యక్తులు తమ ప్రయోజనాల కొరకు శ్రమించడానికి హక్కు కలిగి ఉన్న విషయం నిజమే అయినా దాని ప్రయోగం సామూహిక ప్రయోజనానికి లోబడి దానికనుగుణంగా ఉండవలసిందే. కాని దానికి భిన్నంగా కాదు. ప్రధాన ఆర్థిక వ్యవస్థ, ఖనిజాలు, నౌకా నిర్మాణం, నౌకాయానం, యుద్ధ సామగ్రి, పరిశ్రమ, ఇంకా ఇలాంటి భారీ వాణిజ్యాలు వ్యక్తిగత ఆస్తిలో

ఉండరాదు. అలాగే సామూహిక ప్రయోజనాలను వ్యక్తిగత ప్రయోజనాలకై బలిగొనే వాణిజ్య వ్యవస్థల్ని సయితం అంతం చెయ్యవలసిందే. వ్యాపారంలో మంచి లాటరీ విధానాన్ని పూర్తిగా తొలగించాలి. అప్పు ఇచ్చి పుచ్చుకోవడాల్లో నుంచి వడ్డీని దూరం చెయ్యాలి. వాణిజ్యం, కేవలం ఒక్క వర్గం ప్రయోజనాలతోకాక దానితో సంబంధం కలిగి ఉన్న అన్ని వర్గాల ప్రయోజనాలకు అనువయిన నియమ నిబంధనలకు కట్టుబడి ఉండాలి. ఆ తరువాత ఒక ఫ్యాక్టరీ యజమాని సరయిన ధరలు నిర్ణయించి, మంచి సరకు ఉత్పత్తి చేసి, తన కార్మికుల సుఖ సంతోషాల నభిలషిస్తూ తన పరిశ్రమను వృద్ధిపరచడానికి ప్రయత్నిస్తే ఇంకా తన ఈ సేవకు ప్రతిఫలంగా న్యాయసమ్మతమయిన పరిమితుల్లో ఉండి లాభసముపార్జన చేస్తే అర్థరహితంగా అతన్ని సంఘ విద్రోహిగా నిర్ణయించడానికి అతడు చేసిన అపరాధం ఏమిటి ?"

వారు, ప్రభుత్వం కేవలం పోలీసు న్యాయశాఖల బాధ్యతల్ని మాత్రమే నిర్వహించి ఆర్థిక జీవన కార్యకలాపాలతో నిమిత్తం లేకుండా ఉండాలనే తమ ఉదార స్వభావానికి సంబంధించిన సిద్ధాంతాన్ని కూడా వదలుకున్నారు. దాన్ని కాదని వారు ప్రతిపాదించిందేమంటే, జాతీయ సంపదకు సంబంధించిన విభిన్న వర్గాల మధ్య సామరస్యం, సానుకూలత, సహకారం పెంపొందించడం, వివాదం, ఘర్షణల కారణాలను దూరం చెయ్యడం కూడా జాతీయ ప్రభుత్వం బాధ్యతలే. వారు ఒక వైపు సమ్మెల్ని మరో వైపు లాకౌట్లను చట్టరీత్యా నిషేధించారు. కార్మికులు, యజమానుల సమిష్టి సంఘాలు రూపొందించారు. వారి మధ్య

హక్కుల్ని, బాధ్యతల్ని న్యాయబద్ధంగా నిర్ణయించడానికి కృషి చేశారు. వారి వివాదాల పరిష్కారానికి పరస్పర చర్చలు, సంభాషణలు, పంచాయతీలు, చివరికి న్యాయస్థానాల వరకు ఒక క్రమబద్ధమయిన వ్యవస్థను నెలకొల్పారు.

వారు పెట్టుబడిదారీ వ్యవస్థలోని ఓ చెడును దూరం చెయ్యడానికి ప్రయత్నించారు. అందులో ఏ కారణం వల్లనయినా పని చెయ్యలేకపోయినవారు లేక ఉద్యోగం కోల్పోయినవారి సంరక్షణ భారం ఎవరూ తీసుకునేవారు కారు. ఈ విధంగా నిరాధారులయినవారిని దిక్కులేకుండా వదలడం వల్ల కలిగే నష్టాలను నాజీలు, ఫాసిస్టులు గుర్తించారు. తత్ఫలితంగా పెద్ద ఎత్తున సోషల్ ఇన్సూరెన్స్ ఏర్పాటు చేశారు. తద్వారా అనారోగ్యం, వృద్ధాప్యం, నిరుద్యోగం, దుర్ఘటనలు ఎదురయినప్పుడు కార్మికులకు సహాయం అందజేసేవారు. ఇంకా, తల్లి పాపల సంరక్షణ, శిశు సంక్షేమం, వికలాంగుల సంరక్షణ, యుద్ధంలో అవయవాలు కోల్పోయి పనిచెయ్యని స్థితికి గురైనవారి సహాయం, అనాథలైన వృద్ధుల సంరక్షణ, ఇంకా ఇలాంటివే అనేక మంచి కార్యాల కొరకు మహోన్నతమయిన సంస్థల్ని నెలకొలిపారు. యుద్ధానికి పూర్వం జర్మనీలో నెలకొల్పబడ్డ ఇలాంటి ఓ సంస్థ దాదాపు 50 లక్షల మందిని పోషించింది.

వారు స్వేచ్ఛా విపణిలోని లోపాన్ని దూరం చెయ్యడం పట్ల కూడా శ్రద్ధ వహించారు. స్వేచ్ఛా విపణిలో ఆర్థిక వ్యవహారాలన్నీ ఎలాంటి పథకం, ప్రణాళికలు సామరస్యం లేకుండానే నడిచేవి. దీనివల్ల ఆర్థిక వనరులన్నీ సరిగ్గా వినియోగించబడేవి కావు. వినియోగింపబడినవాటిలో కూడా సమతూకం. అంటూ

ఉండదు. ఈ చెడుగును దూరం చెయ్యడానికి వారు జాతీయ ఆర్థిక వ్యవస్థకై మార్గదర్శకత్వం వహించడం, క్రమబద్ధపరచడం, సమన్వయం కుదుర్చడం లాంటి కార్యాలను రాజ్య పరిధిలోకి తీసుకున్నారు. ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన అన్ని రంగాలకు సంఘాలు నియమించారు. ఒక నియమం ప్రకారం, సంఘటితంగా ఉత్పత్తి సాధనాలను, సామర్థ్యాలను వినియోగించేందుకు ప్రయత్నించారు. ఈ విధంగా వారు నిరుద్యోగాన్ని నిర్మూలించారు.* ఉత్పత్తిని ఊహాతీతంగా పెంచారు. విభిన్న రంగాల్లో సమంగా ప్రగతిని సాధించారు.

## అవివేకపు చేష్టలు, నష్టాలు

పై పంక్తుల్లో ఫాసిజం, నాజీజం ప్రసాదించిన మేళ్ళను పరిశీలించాము. కాని ఈ మేళ్ళను పొందడానికి ఇటలీ మరియు జర్మనీలు ఎంత వెలువను చెల్లించవలసివచ్చింది ?

నాజీ, ఫాసిస్టు మహానుభావులు వర్గవైషమ్యాల వల్ల జనించే విభేదాల ప్రభావాలను నివారించేందుకు జాతీయతత్వపు మత్తుమందును, జాత్యహంకారపు ఉన్మాదాన్ని, ఇతర జాతులకు ప్రతికూలంగా విద్వేషం, కోపావేశాల జ్వాలల్ని, రాజ్య విస్తీర్ణాకాంక్షను, ప్రపంచాన్ని ఏలే అభిలాషను రగుల్గొలిపారు. దాని

---

* 1933లో నాజీ పార్టీ అధికారాన్ని చేపట్టినప్పుడు జర్మనీలో దాదాపు 80 లక్షల నిరుద్యోగులుండేవారు. కాని కొన్నేళ్ళ తరువాత జర్మనీలో ఉద్యోగావకాశాలు మెండుగా ఏర్పడ్డాయి. కార్యకర్తలు కొరవడ్డారు.

ఫలితం ఏ జాతి ఎడల కూడా మంచిగా పరిణమించలేదు. జాతుల సరయిన ప్రగతి, వృద్ధివికాసాలు జరగాలంటే నిర్మాణాత్మకమయిన నైతికత ద్వారా, ఉత్తమ ధ్యేయం ద్వారానే సాధ్యం. దీన్ని కాదని, జాతి సమగ్రతా ప్రగతులకుగాను ద్వేషాన్ని, ప్రమాదపు ప్రకటనల్ని, వైషమ్యపు జ్వాలల్ని శాశ్వత సాధనాలుగా వాడుకునే నాయకులు తమ జాతి స్వభావాన్ని పెడమార్గాన పడేస్తారు. ఈ మార్గాల ద్వారా పైకి వచ్చిన జాతి ఎప్పుడో ఓ రోజున మహా ఘోరంగా దెబ్బ తిని పడిపోవడం తథ్యం.

వారు తమ జాతి మేలును కోరి ఏర్పరచిన ఆర్థిక, నాగరిక సముద్ధరణా కార్యక్రమాన్ని మామూలుగా సాదా పద్ధతిలో అమలుజరపక ఎంతో వ్యర్థమయిన ఓ సామూహిక రాజకీయ తత్వం రూపకల్పన చేశారు. అవి ఎన్నో అతిశయోక్తుల, ఆచరణాత్మకంగా తెలివితక్కువ పనుల సమ్మేళనం. వారు, "సంఘంతో కలిసి ఉంటేనే వ్యక్తి, ఒంటరిగా అతడేమీ కాడు" అన్న భూమికను ముందు నిర్మించుకున్నారు. దానిపై, సంఘంతో కలసి ఉండని వ్యక్తి లేదా ఈ "కలువు"ను నెలకొల్పడంలో అవాంతరాలు సృష్టించే వ్యక్తి వాస్తవానికి 'ఏమీ' కాకుండా ఉండాలనే నిర్ణయానికి వచ్చారు. ఆ తరువాత వాళ్ళ హేతువు స్రవంతి ఇలా ప్రవహించింది. సంఘంతో కలసి ఉండటం అన్నదానికి ప్రతీక జాతీయ రాజ్యం. జాతీయ రాజ్యం స్థిరంగా పటిష్ఠంగా ఉండడమన్నది జాతి సమగ్రత. జాతి ప్రగతుల ఈ కార్యక్రమాన్ని చేపట్టిన పార్టీపై ఆధారపడి ఉంది. అందువల్ల "జర్మనీ వాడవయితే నాజీ పార్టీలోకి రా" ఇంకా, "ఇటాలియను

వైతే ఫాసిస్టు అయిపో" అనే నినాదం ఇచ్చారు. ఈ విధంగా జాతి, రాజ్యం, ప్రభుత్వం, అధికారపక్షం అన్నీ ఒక్కటే అనే స్ఫురణ కలిగేలా చేశారు. అధికారపక్షంతో ఏ విషయంలో నయినా భేదాభిప్రాయం వెలిబుచ్చేందుకు సాహసించిన ప్రతి వ్యక్తిని జాతికి, జాతీయ రాజ్యానికి శత్రువుగా చిత్రించడం జరిగింది. విమర్శను, చర్చను, అభిప్రాయ స్వేచ్ఛను ప్రమాదకరమయినవిగా నిర్ణయించడం జరిగింది. ఒక్క పార్టీ తప్ప దేశంలో మరో పార్టీ మనుగడను సహించలేదు. ఎన్నికలు ఓ ప్రహసనంగా మారాయి. జాతి అంతర్యాన్ని అదుపులోకి తీసుకోవాలని ప్రజల చెవుల్లో ఒక్క మాట తప్ప మరో శబ్దం కూడా చొరబడకుండా చెయ్యడానికి, పత్రికలు, రేడియో, పాఠశాలలు, కళలు, సాహిత్యం, నాటక రంగం అన్నిటినీ పాలక పక్షం ఆధీనంలో తీసుకుంది. అంతేకాదు, ఈ పార్టీ అభిప్రాయాలు తప్ప మరో అభిప్రాయం కూడా ప్రజల మస్తిష్కంలో మొలకెత్తకుండా అన్ని యుక్తులూ పన్నారు. దానితోపాటు, ఒక వేళ కొన్ని తెలివి తక్కువ మస్తిష్కాల్లో "జాతి దైవాల" అభిప్రాయాలకు భిన్నమయినవి ఉదయించినా వాళ్ళ మస్తిష్కాల్లోనే వాటి ఖనన క్రియ జరిగేలా లేకపోతే వాళ్ళ మస్తిష్కాలే భూమిలో పాతుకుపోయేలా ఏర్పాట్లు చేశారు.

ఎంతో సమంజసమయిందిగా కనిపించే సిద్ధాంతాన్ని వారు ప్రవేశపెట్టారు. అంటే, జాతి జీవనంలో ఓ కేంద్రీయ పథకం లేకపోవడం వల్ల అరాచకం, దుర్వ్యవస్థ పరస్పర సంఘర్షణలు ఉత్పన్నమవుతాయి. మొత్తం మీద శక్తి, వనరులు పెద్ద పరిమాణంలో వృథా కూడా అవుతాయి. అందువల్ల జాతి జీవనం

పూర్తిగా క్రమబద్ధం కావాలి. ఒక్క కేంద్ర అధికారం క్రింద, ఒక కేంద్ర శక్తి నిర్ణయించిన పథకం ప్రకారం వ్యక్తులందరు ఒక యంత్రంలోని పరికరాల్లా క్రమబద్ధంగా పనిచెయ్యాలి. త్వరిత గతిన ఉత్పాదనను పెంచడానికి, ప్రగతిని సాధించడానికి, సుఖ శ్రేయాలను పొందడానికి ఇదే మార్గమని వారు భావించారు. తదనుగుణంగా, ఈ సిద్ధాంతం ప్రకారమే వారు యావత్తు జాతి జీవనాన్ని, దాని ఆర్థిక, నాగరిక, ధార్మిక, సాంస్కృతిక, రాజకీయ రంగాలన్నిటితోపాటు ఒక పటిష్ఠమైన నిబంధనలో పకడ్బందీగా కట్టిపడేశారు. ఒక నిర్దిష్టమయిన పథకం ప్రకారం నడపసాగారు. వారు ప్రతిపాదించిన జీవన వ్యవస్థలో ప్రతీదీ నిర్ణయమై ఉంది—ప్రతి వ్యక్తికి, ప్రతి సంస్థకు విధులు నిర్ణయమయి ఉన్నాయి. వేతనాలు, ధరలు కూడా నిర్ణయమయినవే. అందరి హక్కులు, విధులు నిర్ణయమయినవే. శక్తిసామర్థ్యాల ప్రయోగం నిర్ణయమయిందే. పెట్టుబడి, వనరులు, సాధనాల ఉపయోగం, చివరికి భావాలు. అభిప్రాయాలు, ఉద్రేకాలు, ప్రవృత్తుల మార్గాలు కూడా నిర్ణీతమయినవే. వీటన్నిటినీ సాధించడానికి ఎన్నో ఏండ్ల కార్యక్రమాలు కూడా నిర్ణయమయి ఉన్నాయి.

ఇక కేవలం జాతి మేలును కోరి, ఇన్ని కష్టాలకోర్చి, ఇంతగా శ్రమపడి, ఇంతగా తల బద్దలు చేసుకుని జాతీయ జీవనాన్నంతా ఇంత పెద్ద ఎత్తున క్రమబద్ధం చేసినవారు—ఎవరయినా ఒక వ్యక్తి లేచి వారిపై విమర్శల వర్షం కురిపించి ప్రజల మస్తిష్కాలలో అరాచకం సృష్టించడాన్ని ఎలా సహిస్తారు? పనుల్లో నిమగ్నమయి ఉండవలసిన వారిని చర్చల్లో ముంచి వేయడాన్ని, ఇంత శ్రమతో నిర్మించిన పథకం పట్ల సామాన్య

క్షేత్రాల్లో అపనమ్మకాన్ని సృష్టించడాన్ని వారెలా ఒప్పుకుంటారు?? అందువల్ల 'ప్రణాళికాబద్ధమయిన' జీవితంలో అంతర్లీనమై ఉన్న హేతువే ఇది దీని ప్రకారం వారు విమర్శను, అభిప్రాయ విభేదాన్ని సహించడానికి సిద్ధంగా లేకపోయ్యారు. మాట్లాడే వారెవరైనా మా కార్యక్రమాన్ని సమర్థిస్తూనే పలకాలని లేకపోతే నోరు మూసుకోవడం మేలని వారు పట్టుపట్టారు. క్రమబద్ధత జరిగితే అది నోటికీ, అభిప్రాయానికి కూడా వర్తిస్తుంది అని వాదించారు. అభిప్రాయభేదం లేదు, చర్చల్లేవు, విమర్శ లేదు, నిలదీసి అడగటానికయినా, ప్రశ్నించడానికయినా వీల్లేదు. అంతే కాదు, కొన్ని ప్రత్యేక మస్తిష్కాలు తప్ప జాతి మస్తిష్కాలన్నీ ఆలోచించడం కూడ మానుకోవలసిందే!

ఇక్కడ మళ్ళీ అదే ప్రశ్న ఎదురవుతుంది. నాజీ ఫాసిస్టు విధానాలు ప్రసాదించే మేళ్ళ కొరకు ఇంత పెద్ద ప్రతి మూల్యం చెల్లించడం సబబా? జాతి మొత్తంలో కొందరు మనుషులే 'మానవులు' తతిమ్మా అంతా జంతువులవడం, ఇంకా ఒక యంత్రంలోని నిర్జీవమయిన పరికరాలుగా మారడం ఎంత వరకు సమంజసం? ఈ మూల్యం చెల్లిస్తేనే అందరికీ మేత నక్రమంగా లభించే గ్యారంటీ!

## పెట్టుబడిదారీ వ్యవస్థలో సంస్కరణలు

ఏ దేశాల్లోనయితే విశాల భావం, ఉదార స్వభావంతో కూడుకున్న ప్రజాస్వామ్యపు పునాదులు పటిష్టమయి ఉన్నాయో ఆ దేశంవారు పెట్టుబడిదారీ వ్యవస్థను దాని అసలు పునాదులపై

స్థిరంగా నిలబెడుతూ ఆ వ్యవస్థలో ఎలాంటి సంస్కరణలు చేశారో ఇంకా దాని ఫలితాలు ఎలా రూపుదాల్చాయో ఇప్పుడు పరిశీలించడం అవసరం.

మేము ఇంతకుముందే సూచించినట్లు, పద్దెనిమిదో శతాబ్దంలో బూర్జువా వర్గం ప్రజలు ఒక వైపు తమ ఆర్థిక ప్రయోజనాల కొరకు స్వేచ్ఛా విపణి సిద్ధాంతాన్ని ప్రవేశపెడుతూ మరో వైపు తమ రాజకీయ ప్రయోజనాల కొరకు ప్రజాస్వామ్యం, సర్వ సమానత్వం, ప్రజా పరిపాలన లాంటి నినాదాలనిస్తూపోయారు. అభిప్రాయ ప్రకటనా స్వేచ్ఛ అంతరాత్మ ననుసరించే స్వేచ్ఛ, రచనలు చేసే ఉపన్యాసాలు చేసే స్వేచ్ఛ సంఘాలు సమావేశాలు నెలకొలుపుకునే స్వేచ్ఛలు గల హక్కుల్ని కోరసాగారు. పైపెచ్చు ఒకవేళ భరించరాని వత్తిడి తెస్తే ప్రజలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసే హక్కు కూడా కావాలని కోరడం ప్రారంభించారు. ప్రారంభంలో వీరు ఈ కోరికల్ని కోరినప్పుడు వీరి దృష్టిలో రాజ కుటుంబాలు, జమీందారులు, చర్చి అధినేతలు ఉండేవారు. తమ ఎదుట వీరిని చూచి తాము మాత్రమే వీరికి ఎదురుగా ఉన్నట్టు భావించారు. అందువల్ల వారు ఏ 'స్వేచ్ఛా వ్యక్తిత్వం' ఆధారంగానయితే ఆర్థిక వ్యవస్థ నిర్మాణాన్ని ఏ ప్రజాస్వామ్యంపై, ఏ నాగరిక సమానత్వ భావాలపై నిర్మిస్తున్నారో అవి రెండూ పరస్పరం ఒకదానికొకటి ప్రతికూలంగా తయారు కాగలవని, ఒకదానితో మరొకటి పరస్పరం ఘర్షించుకోగలవని వారు ఊహించలేకపోయారు.

## ఓటు హక్కు – ప్రజాస్వామ్యం

వీరి కృషి ఫలంగా కొత్త ప్రజాస్వామిక వ్యవస్థ వివిధ

దేశాల్లో నెలకొనడం మొదలైంది. పర్యవసానంగా ఓటు హక్కు, భూస్వాముల నుండి విస్తృతమయి వ్యాపారస్తులు, పారిశ్రామిక నిపుణులు, షావుకార్ల వరకు చేరింది. ఆ తరువాత ఏ తర్కం ఆధారంగానైనా సరే ఆ హక్కును కార్మికులు, కర్షకులు, శ్రమ జీవుల వరకు చేరకుండా ఆపడం ఎవరి తరమూ కాలేదు. బూర్జువా మహనీయులు దాన్ని ఆపాలని చాలా ప్రయత్నాలు చేశారు. కాని స్వయంగా వారు ప్రతిపాదించిన తర్కమే వారికి ప్రతికూలంగా ప్రయోగించబడింది. చివరికి, వారి హక్కును భూస్వాములు ఎలా అంగీకరించారో అలాగే క్రమక్రమంగా వారూ సామాన్య ప్రజల ఓటు హక్కును అంగీకరించవలసి వచ్చింది. ఆ తరువాత యజమానులకయితే సంఘాలు, సంస్థలు స్థాపించుకోవడం న్యాయసమ్మతమే కాని, కార్మికులకు అది వర్తించదనే వాదనను సమంజసమయినదని, ఏ విధమయిన తర్కం ఉపయోగించయినా నిరూపించడం అసాధ్యమయిపోయింది. అలాగే యజమానులకయితే తమ సంఘటిత శక్తి ద్వారా తమ షరతుల్ని కార్మికులపై జారీ చెయ్యడం సాధ్యమే కాని, కార్మికులు తమ సంఘటిత శక్తి ద్వారా తమ షరతుల్ని ఒప్పించడం సాధ్యం కాదు అనే భావం కూడా నిలువలేకపోయింది.

ఈ విధంగా క్రమక్రమంగా, కార్మికులు, ఉద్యోగులు సయితం తమ సంఘాలు నెలకొల్పుకోవడానికి అధికారం కలిగి ఉన్నారని ఒప్పుకోవటం జరిగింది వారు ఒక్కరొక్కరుగా కాక తమ సాముహిక శక్తి ద్వారా జీతభత్యాలను, పని నియమాలను గురించి బేరసారాలు జరిపించుకునే వీలు కల్పించడం జరిగింది. వారు తమ ఫిర్యాదుల నివారణ కొరకు సమ్మెలు చెయ్యడం,

సమ్మెలు విజయవంతం కావడానికి కాపలా కాయడం లాంటి వాటికి కూడా అవకాశాలు ఇవ్వటం జరిగింది.

## ప్రభుత్వ ఆచరణ పరిధి

19వ శతాబ్ది ముగియటంతోపాటు, రాజ్యం కేవలం వ్యక్తిగత స్వేచ్ఛల్ని కాపాడటానికే బాధ్యత కలిగి ఉందని, జాతీయ జీవనంలో క్రియాత్మకంగా కర్తవ్య నిర్వహణ ఏదయినా దాని బాధ్యతల్లో లేదని చెప్పే రాజకీయ దృక్పథం కూడా అంతమయి పోయింది. ఇప్పుడు దానికి బదులుగా ప్రచారం పొంది జాగృతమయిన భావన ఏమంటే, ఓ ప్రజాస్వామిక రాజ్యమైతే స్వయంగా దేశ ప్రజల సమిష్టి అభిప్రాయాన్ని ప్రతిబింబిస్తుంది. ప్రజలు తమ రాజకీయ శక్తినే ప్రభుత్వ రూపంలో కేంద్రీకృతం, సంఘటితం చేస్తారు. అలాంటప్పుడు పురాతన రాచరికపు పరిపాలనలో మాదిరిగా ఇప్పుడు ప్రజాస్వామిక ప్రభుత్వ పరిధిని సయితం పరిమితం చెయ్యాలని పట్టుపట్టవలసిన అవసరం ఏమిటి ? ప్రజాస్వామిక ప్రభుత్వపు బాధ్యతలు కేవలం విలోమమైనవి మాత్రమే కాకూడదు. దీనికి బదులుగా అది అనులోమంగా కూడా సామూహిక ప్రయోజనం కొరకు కృషి చెయ్యాలి. ఒకవేళ సమాజంలో అన్యాయాలు జరుగుతూ ఉంటే, చట్టాలు చేసి, ఇంకా పరిపాలనా యంత్రాంగం ద్వారా జోక్యం కలుగజేసుకుని రెండు విధాలా దాన్ని అరికట్టాలి.

## గత్యంతరంలేక ...

పరిస్థితులు ఇలా రూపుదాల్చిన సమయానికి మొదటి ప్రపంచ యుద్ధం ఆసన్నమైంది, తరువాత రష్యాలో కమ్యూనిస్టు

ప్లవం వచ్చి బూర్జువా వర్గంలోనివారి పిల్లల్ని. మహిళల్ని నయితం గానుగలో త్రిప్పి పిప్పి చేసివేసింది. ఆ తరువాత జర్మనీలో, ఇటలీలో దాని ప్రతిచర్య ఫాసిజం, నాజీజం రూపంలో ప్రత్యక్షమయింది. అది బూర్జువా వర్గాన్ని, శ్రామిక వర్గాన్ని అందరినీ ఓ కఠినమయిన నిరంకుశ వ్యవస్థలో కట్టి పడేసింది. ఈ సంఘటనల కారణంగా పెట్టుబడిదారి వ్యవస్థ చాలా "విశాల దృక్పథం" గలదిగా రూపుదాల్చింది. అది కొంతవరకు ప్రబలుతున్న ప్రజాశక్తి వత్తిడి వల్లనూ, కొంత తన సొంత ఇష్టం చేతనూ పురాతన స్వేచ్ఛా విపణి వ్యవస్థలో దిగువ సవరణల్ని స్వీకరించసాగింది :—

## సంస్కరణలు

1. ప్రతి సంపాదనా రంగంలో కార్మికుల, ఉద్యోగుల తరఫున సంప్రదించే అధికారం గల సంఘాలకు అధికారికంగా గుర్తింపు లభించింది. దీనితోపాటు, కార్మికులు, ఉద్యోగులు సంఘాలు తమ కోర్కెలను సాధించడానికి. వాటి కోసం వత్తిడి తేవడానికి కొన్ని పరిమితుల మేరకు, సాంప్రదాయకంగా లేదా చట్టబద్ధంగా కొన్ని ఉపాయాలను చేపట్టడం న్యాయసమ్మత మయినవిగా అంగీకరించడం జరిగింది. ఈ విధంగా పెట్టుబడి, శ్రామిక వర్గాల మధ్య సంఘర్షణ అంతం కాకపోయినా ఇప్పుడు శ్రామికుడు పెట్టుబడిదారుల సమక్షంలో స్వేచ్ఛావిపణి కాలంలో మాదిరిగా పూర్తిగా శక్తి విహీనంగా మాత్రం లేడు.

2. వేతనాల్లో పెంపుదల, పనిచేసే కాలంలో తరుగుదల, పనిచేసే పరిస్థితుల్లో రాయితీలు, పిల్లలు, మహిళల చేత పని

చేయించడం పట్ల నిషేధాలు, కార్మికుల ఆయురారోగ్యాల పట్ల మునుపటికన్నా శ్రద్ధ, కార్మికుని ఇల్లు పరిసరాలను మునుపటి కన్నా మెరుగుపరచడానికి కృషి, అంగ వైకల్యం కలిగినప్పుడు దానికి ఎంతో కొంత పరిహారం, ఇంకా సోషల్ ఇన్సూరెన్సుకు సంబంధించిన కొన్ని పథకాలపై అమలు— ఇదంతా కావలసినంతగా జరగకపోయినా ఇప్పుడు కార్మికులు, క్రింది తరగతి ఉద్యోగుల పరిస్థితి మునుపటిలా మరీ అధ్వాన్నంగా నయితే లేదు.

3 ప్రభుత్వం, కార్మికులకూ, పెట్టుబడిదారులకూ మధ్య మధ్యవర్తిత్వం వహించాలన్న విషయానికి సర్వాంగీకారం లభించింది. ఈ ఉభయ వర్గాల మధ్య పరస్పర ఘర్షణను దూరం చెయ్యడానికి వాళ్ళ వివాదాల పరిష్కారానికి విభిన్న చట్టపరమైన మార్గాలు కూడా నిర్ణయించడం జరిగింది. ఈ విషయం ఇంకా, ప్రతి ఆర్థిక రంగంలోనూ శ్రామికులూ యజమానుల మధ్య హక్కులూ విధుల న్యాయవంతమయిన నిర్ణయం చెయ్యగలిగేంతగా బలపడలేకపోయినా, ఆర్థిక వివాదాలలో న్యాయ నిర్ణయాలు చేసే బాధ్యతను కూడా పూర్తిగా ప్రభుత్వం తన అధీనంలో తీసుకోలేకపోయినా, సూత్రప్రాయంగా ప్రభుత్వం ఈ బాధ్యత నిర్వహించాలన్న విషయాన్ని మాత్రం గుర్తించడం జరిగింది.

4. వ్యక్తిగత లాభసముపార్జనపై అంక్షలు వెయ్యాలని, ఈ లాభసముపార్జన సామూహిక ప్రయోజనాలకు హానికరంగా మారకుండా చూడాలని, ఇలాంటి అంక్షలు విధించడం ప్రభుత్వ విధుల్లోని విషయమే అని కూడా సూత్రప్రాయంగా అంగీకరించడం జరిగింది,

5. వ్యక్తిగత వాణిజ్యానికి వీలుపడని వ్యవహారాలను లేదా వ్యక్తుల చేతుల్లో పెట్టడం సామూహిక ప్రయోజనాలకు వ్యతిరేకమని భావించిన ఆర్థిక వ్యవహారాలను కొన్నింటిని ప్రభుత్వం స్వయంగా నిర్వహించాలని నిర్ణయించింది. ఉదాహరణకు తంతి-తపాల, రవాణా సౌకర్యాల ఏర్పాట్లు. రోడ్లు రహదారుల నిర్మాణం, వాటి సంరక్షణ, అడవుల్ని పెంచడం వాటి ఏర్పాట్లు, నీటిపారుదల సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి పంపిణీ ద్రవ్యంపై అదుపు ఇత్యాదివాటితో పాటు కొన్ని ప్రభుత్వాలు ఖనిజ సంపదను సైతం తమ అధీనంలో తీసుకున్నాయి. ఇంకా కొన్ని భారీ పరిశ్రమల్ని సయితం తమ నిర్వహణలో నడపసాగాయి.

6. స్వల్పమయిన ఆదాయం గల ఉద్యోగులు, కార్మికుల కొరకు ప్రత్యేక అవకాశాలు కల్పించబడ్డాయి. వాటి కనుగుణంగా వారు ఎంతో కొంత సొమ్ము పొదుపు చేసి వాణిజ్య, పారిశ్రామిక కంపెనీల చిన్న చిన్న వాటాలు కొనుక్కోగలరు. కొన్ని చోట్ల ప్రత్యేకమయిన నియమాల ప్రకారం, ఉద్యోగుల, కార్మికుల వేతనాల ఓ భాగం వారికి నగదు రూపేణా లభిస్తూ ఉంటుంది. మరో భాగం వారి తరఫున కంపెనీ పెట్టుబడిలో చేరుతూ ఉంటుంది. ఈ విధంగా శ్రామికులు అనేక మంది తాము పని చేసే కంపెనీ లేదా కార్పొరేషన్‌లో భాగస్వాములు కూడా కాగలరు. ఈ విధంగా కొన్ని ప్రఖ్యాత ఫ్యాక్టరీల్లో 80 శాతం, 90 శాతం కార్మికులు. ఉద్యోగులు యాజమాన్యంలో భాగస్వాములయ్యారు. స్కీముల ప్రకారం వాటాలు కొనుక్కునే సౌలభ్యం ఉండటం మూలాన ఫ్యాక్టరీల్లో వారి భాగస్వామ్యం నిష్పత్తి పెరుగుతూనేపోతోంది.

# పెట్టుబడిదారీ వ్యవస్థలో మిగిలిపోయిన దోషాలు

ఇన్ని మార్పులు, చేర్పులు, సంస్కరణలు జరిగినా పెట్టుబడిదారీ వ్యవస్థలోని మౌలికమయిన లోపాలు యథాతథంగా ఉండిపోయాయి.

ఇంతవరకు నిరుద్యోగం పూర్తిగా రూపుమాపబడలేదు. ఇంకా, యుద్ధ కాలం మినహాయించి మిగతా అన్ని పరిస్థితుల్లో ఈ జాడ్యం శాశ్వతంగా పెట్టుబడిదారీ వ్యవస్థ క్రింద సమాజాన్ని పట్టి పీడిస్తూనే ఉంటుంది. పరిశ్రమలు, సంపాదన తార స్థాయికి చేరి ఉన్న అమెరికా లాంటి దేశంలో యుద్ధ కాలపు పనులు తగ్గగానే 32 లక్షల కంటె అధికంగా ప్రజలు నిరుద్యోగులయ్యారు. 1949 ఏప్రిల్, మే నెలల్లో వారి సంఖ్య పెరిగి 35 లక్షలకు మించింది. జూన్‌లో 40 లక్షలకు చేరుకుంది. వాణిజ్యం పరిశ్రమలు జోరుగా సాగుతున్న కాలమయినా మందగించిన కాలమయినా నిరుద్యోగం దాదాపు అన్ని పరిస్థితుల్లోనూ పెట్టుబడిదారీ వ్యవస్థతో అవినాభావ సంబంధం కలిగి ఉంటుంది.

మేము ముందు సూచించిన వింతయిన చిక్కు ప్రశ్న యథాతథంగా అపరిష్కృతంగానే పడి ఉంది. కోటానుకోట్ల ప్రజలు నిత్య జీవితావసరాలను, విలాస వస్తువులను కోరే వారున్నారు. అసంఖ్యాకమయిన ప్రకృతి వనరులున్నాయి. వీటిని వినియోగించి ఇంకా అవసర పదార్థాలు తయారుచేసుకోవచ్చు. పనుల్లో పెట్టటానికి లక్షలాది మనుషులున్నారు. కాని మరో వైపున పెట్టుబడిదారీ వ్యవస్థ కారణంగా ప్రపంచ అవసరాలు వినియోగపు అంచనాలకు చాలా తక్కువగా తయారుచేసే సరకు

కూడా బజారులో మిగిలిపోతోంది. ఎందుకంటే, ప్రజల వద్ద దాన్ని కొనేందుకు డబ్బు లేదు. ఇక కొద్ది సరుకే అమ్ముడు పోకపోతే ఇంకా మనుషుల్ని పనిలో నిమగ్నం చేసి ప్రకృతి వనరుల్ని వినియోగించే ధైర్యం ఎలా కలుగుతుంది? అయితే మనుషులకు పని కల్పించకనేపోతే వారిలో కొనగలిగే శక్తి పెరిగే మరే అవకాశమే లేదు.

ఇంతేకాదు, ఇంతవరకు పెట్టుబడిదారీ వ్యవస్థలోని మరో కీడు కూడా అలాగే ఉంది. ప్రతి ఏటా పెద్ద ఎత్తున తయారైన సరకు, ఉత్పత్తి అయిన ధాన్యం, ఫలాలు ఇతర సరకు బజారులోకి తేవడానికి బదులు కావాలని నాశనం చేయటం జరుగుతోంది. వాస్తవంగా కోట్లాది ప్రజలకు అవి అవసరమయి ఉంటాయి. వాటిని మార్కెట్టులోకి తెచ్చి వాటి ధరను తగ్గించి తగ్గు ధరలకు అవసరమున్న ప్రజలకు అమ్మడంకన్నా వాటిని నాశనం చెయ్యడం, ఇలా నాశనం చెయ్యడానికి లక్షలాది రూపాయలు వెచ్చించడం మంచిదని భావిస్తాడు పెట్టుబడిదారు.

పెట్టుబడిదారీ వ్యవస్థలోని మరో దుర్గుణం కూడా ఇంకా తన స్థానంలో అలాగే మిగిలిపోయింది. పని చెయ్యగలిగినా నిరుద్యోగులయినవారు, ఇంకా పనిచేసే యోగ్యత లేకపోయినవారు, లేక శాశ్వతంగానో, తాత్కాలికంగానో అంగవైకల్యం పొంది పనిచెయ్యలేకపోయినవారు, లక్షలాది, కోట్లాది ప్రజలను పోషించేందుకు, ఆదుకునేందుకు ఎవ్వరూ— ప్రభుత్వమయినా, సమాజమైనా, ధనిక వర్గమైనా తాము బాధ్యులమని భావించరు. ఇప్పుడు కూడా జేబులో డబ్బు ఉన్న వ్యాధిగ్రస్తుడే చికిత్సకు అర్హుడు. తండ్రి ఇన్సూరెన్సు పాలసీ వదలి వెళ్ళిన అనాథలే

ఇప్పుడూ విద్యాసముపార్జనకు అర్హులు. ఇప్పుడు కూడా ప్రమాదా లకు గురయి తట్టుకోవాలంటే మునుపు మంచిగా బ్రతికిన వ్యక్తి ఆ కాలంలో తన గడ్డు రోజుల కోసం ఏదయినా పొదుపు చేసు కుంటేనే అది సాధ్యం. అంటే ఇప్పటికీ, బాధాగ్రస్తుడు, అగత్య పరుడు, అనాధ వ్యక్తి ఎవరి బాధ్యతల్లోనూ లేడు— ఎవరికైనా ఎప్పుడయినా యాదృచ్ఛికంగా ఏదయినా సహాయం లభించడ మన్నది వేరే విషయం.

పెట్టుబడిదారీ వ్యవస్థలోని మరో లోపం కూడా ఇంకా దూరం కాలేదు. కృత్రిమంగా ధరలు పెంచటం జరుగుతుంది. క్రమబద్ధంగా పథకాలు తయారుచేసి కొన్ని వస్తువుల కరవును సృష్టించడమూ జరుగుతుంది. మార్కెట్టు నుండి వస్తువులు మటుమాయమవడం, వాణిజ్య జూదం లాంటి అనేక విధాలుగా విపణి నైజాన్ని రేయింబవళ్ళు తారుమారు చెయ్యడం నేటికీ జరుగుతూ ఉంటుంది. ఎవరయినా ఓ పెద్ద పెట్టుబడిని సంపా యించ గలిగితే తమ స్వప్రయోజనం కొరకు వారు ఇష్టమయిన సరుకును ఇష్టమయిన పరిమాణంలో తయారుచేసుకోడానికి, అది సమాజం కొరకు అవసరమయినా కాకపోయినా, అది సమాజానికి హానికరమే అయినా, సమాజంపై దాన్ని బలవంతంగా రుద్దేందుకు ఏ ప్రయత్నమయినా చెయ్యడానికి ఇప్పటికీ ప్రజలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్నాయి. సమాజంలో అతి ముఖ్యావసరాలయితే అసలు కానరావు కాని, విలాస వస్తువులపై, మనోవాంఛల క్రీడా కలాపాల సామగ్రిపై కలిగి ఉన్న వారి ఒయ్యారాల హంగులపై పరిశ్రమ, పెట్టుబడులు హద్దులు మీరి వ్యయమవుతున్నాయి. ఇప్పటికీ, పరిశ్రమ వాణిజ్యాల చక్రవర్తులు, ధనిక రాజులు

తమ స్వప్రయోజనాల కొరకు రహస్యంగా, బహిరంగంగా కుతంత్రాలు పన్నుతుంటారు. అవి అంతర్జాతీయ సంఘర్షణ, వైషమ్యం, యుద్ధాల కారణంగా పరిణమిస్తున్నాయి.

పెట్టుబడిదారీ వ్యవస్థలో ఇప్పటికీ సమాజ నిర్మాణమైనా, ప్రభుత్వ స్థాపనయినా షావుకారు (Banker) చేతుల్లోనే ఉన్నాయి, అతడు సామూహిక విలువలన్నింటినీ వడ్డీ రేటు ప్రమాణంలో లెక్క కడతాడు. దాని చుట్టే వీటిని త్రిప్పుతున్నాడు. పెట్టుబడి ఏ కార్యాలకై వినియోగపడాలి? ఏ కార్యాలకై పడకూడదు? అన్న విషయం నిర్ణయించేది అతడే. ఈ నిర్ణయం గైకొనడానికి అతని వద్ద ఉన్న ప్రమాణం సమాజానికి అవసరమయినవి, ప్రయోజనకరమైనవేవి? అన్న విషయం కాదు; దానికి బదులుగా, బజారులో దొరికే వడ్డీ రేటుకు సమానమయిన లేదా దానికన్నా అధికమయిన లాభం ఏ పనుల్లో ప్రాప్తమవుతుంది? అన్నదే. ఈ ప్రమాణం ప్రకారం, ఒకవేళ నీటి సరఫరా కన్నా సారా సరఫరా అధిక లాభసాటి అయితే అతడు సామాన్య ప్రజల్ని మంచి నీటి కోసం అలమటింపజేసి నిక్షేపంగా భోగలాలసుల కోసం సారా త్రాపడంలో నిమగ్నుడైపోతాడు.

పెట్టుబడిదారీ వ్యవస్థను ఇప్పటికీ "వాణిజ్య చక్రం" (Trade Cycle) అనబడే రుగ్మత కూడా వదల్లేదు. దాని ప్రకారం ప్రతిసారి కొన్నేండ్ల వరకు చురుకైన వ్యాపారంసాగి ఆ తరువాత ప్రపంచ వాణిజ్యం మందగించడం ప్రారంభమవుతుంది. వ్యాపారం బాగా వేగం పుంజుకున్న తరుణంలో అకస్మాత్తుగా గిడ్డంగుల్లోకి వచ్చిన సరుకు సమంగా బయటికి పోవడంలేదన్న విషయం వ్యాపారులు పసిగడతారు. వారు తమ ఆర్డర్లు కాస్త

తగ్గిస్తారు, పారిశ్రామికులు ఈ పరిస్థితి చూచి ఉత్పత్తి తగ్గిస్తారు. పెట్టుబడిదారు ప్రమాదాన్ని గుర్తించి రుణాలివ్వడం మానుకుంటాడు. పాత బాకీని డిమాండ్ చెయ్యడం మొదలెడతాడు. ఫ్యాక్టరీలు మూతబడతాయి. నిరుద్యోగం ప్రబలుతుంది. ధరలు పడిపోతాయి. వ్యాపారులు, వినియోగదారులు ఉభయులు ధరలు ఇంకా పడిపోతాయన్న ఆశతో ఆర్డర్లు వెయ్యడంగాని, కొనుగోలు చెయ్యడంగాని మానుకుంటారు. నడుస్తున్న ఫ్యాక్టరీలు సయితం ఉత్పత్తిని ఇంకా తగ్గిస్తాయి. నిరుద్యోగం ఇంకా అధికమవుతుంది, ప్రభుత్వాలు ఆదాయం తగ్గడం చూచి ఖర్చులు సయితం తగ్గిస్తాయి, మార్కెట్టు ఇంకా అధికంగా మందగిస్తుంది, ఈ విధంగా వెనక్కిపడ్డ ప్రతి అడుగు ఇంకా ఎన్నో అడుగులు వెనక్కి తగ్గడానికి కారణభూతమవుతుంది. చివరికి దివాలాకోరుతనం చేరువవగానే ఒక్కసారిగా వేగం మారుతుంది, క్రమంగా పెరుగుదల ప్రారంభమవుతుంది. తిరిగి వ్యాపారం చురుకుగా కొనసాగుతుంది. ఈ చక్రం పెట్టుబడిదారీ వ్యవస్థను ఓ శాశ్వత రోగంగా పట్టుకుంది. దీనికి ఇంతవరకు ఏ చికిత్స ముందుకు రాలేదు.

ఇవికాక ఎన్నో చిన్న చిన్న లోపాలు నేటి పరిమిత, సంస్కరణ పొందిన పెట్టుదారీలో, 19వ శతాబ్దిలోని విశృంఖలమయిన, దుర్వర్తన కలిగిన పెట్టుబడిదారీ వ్యవస్థలో మాదిరిగానే నేటికీ ఉన్నాయి. అంటే ఈ వ్యవస్థలోని చెడులకు అసలు కారణాలను అర్థం చేసుకుని, నేర్పుతో వాటిని తొలగించడానికి ప్రజాస్వామ్య వ్యవస్థ ఏ ఉపాయమూ చేపట్టలేదనడానికి ఇది స్పష్టమయిన నిదర్శనమన్న మాట. కాని వాస్తవంగా జరిగిం

ేమంటే, శ్రామిక ప్రజల ఒత్తిడి ఎంత అధికమయితే, లేక
కమ్యూనిస్టుల ప్రమాదం ఎంతగా ప్రబలిపోతే బూర్జువా వర్గం
వారు తమ విధానంలో ఆ మేరకు సవరణలు చేసుకుని, తద్వారా
ప్రజల ఫిర్యాదులు కాస్తంత దూరమయి కమ్యూనిస్టులు వాటి
ద్వారా ప్రయోజనం పొందకుండా ఉండేందుకు వీలుగా మాత్రమే
మసలుకుంటున్నారు.

# చరిత్ర నేర్పిన పాఠం

ఇంతవరకు ముందుంచిన చారిత్రక వివరాలను ఓసారి
సింహావలోకనం చేస్తే ఓ సామాన్య మనిషికయినా ప్రస్ఫుటంగా
బోధపడే విషయాలు అనేకం.

ప్రప్రథమంలో, అతడు పాశ్చాత్య చరిత్ర చూపెట్టినవి,
మన ప్రస్తుత సామాజిక జీవనంలో ఉన్న ఉమ్మడి సమస్యల్ని,
చిక్కుల్ని స్పష్టంగా గుర్తుపడతాడు. భూస్వామ్య వ్యవస్థ కూడా
తన అనేక ప్రత్యేకతలతో ఇక్కడ ఉన్నట్లు, నవీన పెట్టుబడిదారీ
వ్యవస్థ కూడా తన అనేక రుగ్మతలతో ఇక్కడ అవతరించినట్లు
అతడు గుర్తిస్తాడు. కొన్ని రోగాలు మనం మన పతన దశ
నుంచి వారసత్వంగా పొందాము. కొన్నేమో పాశ్చాత్య పారి
శ్రామిక విప్లవం, పెట్టుబడిదారీ వ్యవస్థ పుణ్యమా అని మనకు

అందాయి, కాని ఒక వ్యత్యాసం ఉంది. ఇక్కడ పోప్ పాలన లాంటిది, చర్చి వ్యవస్థ లాంటిదేదీ లేదు. లేదా ఉన్నత వర్గం వారితో పొత్తు పెట్టుకుని, దైవం, మతం పేరు చెప్పి అసమంజసపు ప్రత్యేకతల్ని, బలవంతపు హక్కుల్ని సమర్థిం చేందుకు ఇక్కడ మత పెద్దల వర్గం(Priest Class) కూడా లేదు.

ఈ చారిత్రక అధ్యయనం ద్వారా మన దేశంలోని "బుద్ధి జీవులు" మన సమాజంలోని సమస్యల్ని, చిక్కుల్ని పరిష్కరించ డానికి అనుదినం ప్రతిపాదించే ప్రతిపాదనల పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో తెలిసివస్తాయి. "సాముదాయిక ప్రణాళికా రచన" యొక్క అవశ్యకతను ఒక పెద్ద మనిషి నొక్కివక్కాణించటం మనం అప్పుడప్పుడూ వింటూ ఉంటాము. మరొకరు దేశ ఆర్థిక వ్యవస్థలో "విప్లవాత్మకమైన మార్పులు" తేవాలని కోరడం కూడా మనకు తెలుసు. మరో మహానుభావులు భూమిని వ్యక్తిగత ఆస్తి పరిధి నుండి తీసేసి "జాతీయం" చెయ్యాలని (అంటే భూమిని జాతీయ ఆస్తిగా చెయ్యాలని) చెప్పడం కూడా మనం ఎరిగినదే. అలాగే ముఖ్యమయిన పరిశ్రమలన్నీ "జాతీయం" చేసెయ్యాలని కూడా నినాదాలు వినవస్తుంటాయి. మరో "మేధావుల" ఓ మండలి ఎంతో ఆలోచన, విచారణ జరిపిన తరువాత తీసుకొచ్చే పరిష్కార పథకం, వ్యక్తిగత భూస్వామ్యాన్ని అంతం చేసెయ్యాలన్నది.

ఈ అమూల్యమయిన జ్ఞానమణులన్నీ పాశ్చాత్య ఋంతల పొత్తము నుండి దొంగిలించిన చిదంబర రహస్యాలు! ఇప్పుడు*

*** 'ఇప్పుడు' అంటే అది రెండో ప్రపంచ యుద్ధం తరువాతి కాలమని మరువరాదు.**

రష్యాలో, జర్మనీలో, ఇటలీలో, అమెరికాలో, ఇంగ్లండులో జరిగిన ప్రయోగాలే ఇక్కడ కూడా జరపాలని పథకాలు తయారవుతున్నాయి. కాని ఈ విషయంలో కూడా మనకు వాళ్ళకు ఓ వ్యత్యాసం ఉంది. అక్కడి "శుంఠల్ని" కనీసం ఆవిష్కర్త లని చెప్పవచ్చు కాని ఇక్కడ వైద్యులయి కూర్చున్నవారు కేవలం శుంఠలే కాదు, దానితోపాటు కేవలం అనుకర్తలే. పాశ్చాత్య శుంఠలు ఏదైనా నష్టం జరుగుతూ ఉండటం గమనిస్తే నివారణోపాయంలో కాస్త మార్పులు చేర్పులు చేసుకుంటారు. కాని ఇక్కడ, పాశ్చాత్య దేశాల నుండే ఏదైనా మార్పు జరిగిన సమాచారం అందితే సరి. లేకపోతే ఇక్కడి వైద్యుడు రోగి చివరి శ్వాస వరకు సయితం, దైవ చిత్తమయితే, ఒక్క మందునే పట్టిస్తూ ఉంటాడు.

పాశ్చాత్య దేశాల నాగరికతా సంస్కృతుల చరిత్రలో వారి ఆలోచనల ఆచరణల గాథల్లో మనిషికి బహిరంగంగా కనిపించే విషయమేమంటే, అక్కడ నిరంతర సంఘర్షణ, ఘర్షణ, పోరాటం కొనసాగుతుంటాయి. ఒక వర్గం జీవన రంగాన్ని ఆక్రమించుకుని, నైతికతను, మతాన్ని, చట్టాన్ని, సంప్రదాయాలను, మొత్తం నాగరికతా వ్యవస్థనే ఓ ప్రత్యేక దిశలో లాక్కెళ్ళుతుంది. చివరికి ఎదుటి వర్గాల వారిపై అన్యాయాలు అనంతమైపోతాయి. ఆ తరువాత ఈ బాధిత వర్గంతో నుండి ఎవరయినా లేచి అత్యాచారం చేసే వర్గంతో కలయబడతాడు. అతడు ఆ వర్గంలోని చెడుతో పాటు మంచిని సయితం రద్దు చేస్తాడు. ఆలోచన ఆచరణల వ్యవస్థ మొత్తాన్నీ ఓ అతివాదం నుండి లాక్కెళ్ళి మరో అతివాదం వైపుకు చేరుస్తాడు. చివరికి అది మళ్ళీ

అన్యాయాల సరిహద్దులకు చేరిపోతుంది. ఆ తరువాత ఫిర్యాదులు, ఆరోపణల దశ దాటి మూడో తిరుగుబాటు వరకు పరిస్థితి విషమిస్తుంది. ఈ మొండితనం, మంకు వైఖరి తుఫానులా మారి తద్వారా అసత్యంతోపాటు సత్యమూ కొట్టుకు పోతుంది. అప్పుడు పూర్వులను మించిన ఓ తీవ్రవాదపు వ్యవస్థ నెలకొంటుంది. ఈ తుఫాను సృష్టించిన వినాశనాన్ని చూచి దానికి ఎదురుగా మరో ఎదురు తుఫాను పెల్లుబుకుతుంది. ఇది కూడా తన ప్రత్యర్థికి ఏ మాత్రం తీసిపోకుండా తీవ్రవాదాన్ని ప్రతిబింబిస్తుంది.

ఈ లాగుడు త్రోసుడు కారణంగా పాశ్చాత్య చరిత్ర, ఒక బుద్ధివివేకాలు గల వ్యక్తి నేరుగా ఋజుమార్గంపై నడచినట్లుకాక ఒక మత్తుగొన్న వ్యక్తి తడబడుతూ వక్ర రేఖపై నడచినట్లు వక్రంగా పయనిస్తూ కనిపిస్తుంది. పాపం, హేగల్, మార్క్స్ ఈ దృశ్యాన్ని చూచి, మానవ నాగరికత పరిణామగతికి సహజ మయిన మార్గమిదేనేమో అని భావించారు. కాని వాస్తవమేమంటే ఇవన్నీ కేవలం ఒక్క విషయం వల్ల కలిగిన ఫలితాలు. అదేమంటే, పాశ్చాత్యులు చాలా కాలంగా "ఎలాంటి మార్గదర్శకత్వం, లేక ఎలాంటి ప్రస్ఫుటమయిన గ్రంథమూ లేకుండా" జీవితం గడుపు తున్నారు.

## పాశ్చాత్యుల అవస్థ

సెయింట్ పాల్ ద్వారా వారికి అందిన క్రైస్తవ మతం, షరీఅత్ (ఆచరణ నియమావళి)తో ముందే సంబంధాలను

తెంచుకోంది, నాగరిక, రాజకీయ, ఆర్థిక విధానాల ఓ సువిశాల వ్యవస్థను నిర్మించడానికి అవసరమయిన దైవ మార్గదర్శకత్వం క్రైస్తవంలో ఏ మాత్రం లేకపోయింది. ఈసా (అస్సలామ్) బోధించిన కొన్ని నైతిక ఉపదేశాలు తప్ప! బైబిల్‌కు చెందిన పాత నిబంధనలో సయితం రెండు శాతం దైవ ప్రబోధాలతో బాటు 98 శాతం మానవ ప్రోక్తమయిన మాటలు మిశ్రమమై ఉన్నాయి. అందువల్ల వారు కొంత నమ్మకంతో, కొంత అప నమ్మకంతో దాని వైపుకు మరలినా దాని ద్వారా వారికెంతో మార్గ దర్శకత్వం ప్రాప్తం కాలేదు. అప్పటికి పాశ్చాత్య రోమన్ సామ్రాజ్యం విచ్ఛిన్నమయి ఇంకా కొంత కాలమే అయింది. మధ్య యుగాల చరిత్ర అప్పుడప్పుడే ఆరంభమయింది. సరిగ్గా ఆ సమయానికే ఇస్లామ్ యూరపు సమక్షంలో ప్రత్యక్షమయి నిలిచింది. కాని షరీఅత్ (శాసనాంగం) లేకపోతేనే సరి అన్న షరతుపై క్రైస్తవ మతాన్ని స్వీకరించిన యూరపు. ఇస్లామ్ వైపుకు— షరీఅత్ లేకుండా వట్టి మత విశ్వాసాలు అందజెయ్య డానికి సిద్ధంగా లేని ఇస్లామ్ వైపుకు— మార్గదర్శకత్వం కొరకు ఎలా మొగ్గుతుంది? ఈ కారణం వల్లనూ పాదరీలు వ్యాపింప జేసిన దురభిమానాల కారణంగానూ యూరపు ఇస్లామ్ ద్వారా ఎలాంటి వెలుగునూ పొందలేకపోయింది. ఇకపోతే తమ బుద్ధిని వినియోగించి తమ కొరకు ఓ జీవన వ్యవస్థను నిర్మించు కోవడం తప్ప పాశ్చాత్యులకు గత్యంతరం ఏది? వారు అలాగే చేశారు. కాని వాస్తవమేమంటే. స్వచ్ఛమయిన హేతుబద్ధమైన నిర్ణయాలు చేయడం మనిషికి సాధ్యపడదు. అతని బుద్ధితో పాటు కోరికలనే మార్గభ్రష్టకుడయిన షైతాన్ కూడా ఉన్నాడు.

పైగా మానవులందరూ ఒకేసారి కలిసి ఓ జీవన వ్యవస్థను నిర్మిస్తా రన్నది కూడా సాధ్యంకాని విషయమే. సదా మేధావుల వర్గమె ఓ వ్యవస్థను ప్రతిపాదిస్తుంది. దీని కారణంగా వీరితోపాటు వీరి లాంటి అభిమానాలు, దురభిమానాలు కలవారినే ఆ వ్యవస్థ ఆకర్షిస్తుంది. ఈ కారణాలచేతనే యూరపులో అప్పుడప్పుడు రూపొందిన జీవన వ్యవస్థలన్నీ సమతూకం లేకుండా రూపొం దాయి. ఈ సమతూలనా రాహిత్యానికి తప్పనిసరి పరిణామం ఒక్కటే. దాని రీత్యా అక్కడ నిరంతర సంఘర్షణలు, ఎడ తెగని గింజులాటలు జరుగుతూ వచ్చాయి.

ఇప్పుడు అసలు ప్రశ్న ఏమిటంటే వాస్తవంగా ఈ ప్రపంచంలో మనకూ ఏ మార్గదర్శకత్వం లేదా? ఏ స్పష్టమైన గ్రంథమూ లేదా? మనం కూడా అతి ప్రాచీన సాంస్కృతిక అజ్ఞానం, మధ్యయుగాల మొగల్ వ్యవస్థ, ఆధునిక తెల్ల దొరల నాగరికతలు కలిసి మనల్ని ఏ ఏ సమస్యలకు గురిచేశాయో వాటి పరిష్కారానికి మనం చెయ్యవలసిందేమిటి? కమ్యూనిజం, నాజీజం, ఫాసిజం, కాపిటలిజం లాంటి జీవన వ్యవస్థలు పాశ్చాత్య దేశాల్లో అవలంబించిన మార్గాలనే మనమూ అవలం బించడం అవసరమా? మన వద్ద ఓ మధ్యస్థ వ్యవస్థను నెల కొల్పడానికి తోడ్పడే కాంతి ఏదీ లేదా? ఇస్లాము అంటె ఏమిటో తెలిసిన వ్యక్తి ఎవ్వడూ ఈ ప్రశ్నలకు అనుకూలంగా సమాధానం ఇవ్వలేడు.

## అసలు చిక్కు

ఇస్లామ్ సిద్ధాంతాల కనుగుణంగా మనం ఈ సమస్యల్ని

ఎలా పరిష్కరించగలం? ఈ విషయాన్ని అర్థం చేసుకోవడానికి గాను ముందు ప్రస్తుతం ప్రపంచం అసలు ఏ చిక్కుల్లో పడ్డదో, మనం కూడా ఎందులో చిక్కుకున్నామో, ఆ అసలు చిక్కును స్పష్టంగా అర్థం చేసుకోవాలి. క్లుప్తంగా చెప్పాలంటే ఆ చిక్కు ఇది.

ఒకవేళ మనం విశృంఖల విపణి దృక్పథాన్ని అవలంబిస్తే దాని ద్వారా ప్రతి వ్యక్తికి ఎలాంటి అడ్డూ ఆటంకం లేకుండా తాను కోరినవన్ని వనరుల్ని స్వాధీనం చెసుకుని తాను కోరిన విధంగా లాభసముపార్జనకు కృషిచేసుకునే అవకాశం ఉంటుంది. ఇంకా దాని ద్వారా సమాజంలో న్యాయం సమతూలనం స్థాపించాలంటే, కేవలం పోటీ మనస్తత్వం సృష్టించడం, ఇచ్చిపుచ్చుకునే ధోరణి కల్పించడం, దీనిగ్గాను పుట్టగొడుగుల్లాంటి చట్టాలను నమ్ముకోవలసి ఉంటుంది. అప్పుడు పెట్టుబడిదారీ వ్యవస్థలోని చెడులు ఉత్పన్నమవుతాయి. మన సమాజం మేరకు భూస్వామ్య వ్యవస్థలోని చెడులు అలానే మిగిలిపోతాయి. ఈ రెండు రకాల చెడుల్ని మేము లోగడ "భూస్వామ్య వ్యవస్థ," "ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ" అనే శీర్షికల్లో చర్చించాము

ఒకవేళ వ్యక్తిగత ఆస్తి పద్ధతిని పూర్తిగా అంతం చేసి ఉత్పాదక వనరులన్నింటిపైన సామూహిక యాజమాన్యం, సామూహిక వినియోగాలను అమలుజరిపినట్లయితే అప్పుడు నిస్సందేహంగా పైన పేర్కొన్న చెడుల నివారణ చాలా వరకు సాధ్యమవుతుంది. అయితే ఒకటి, ఈ మౌలికమయిన మార్పు, ధనప్రాణాల అంతులేని నష్టం, మతం, నైతికతల పట్ల ప్రచ్ఛన్న తిరుగుబాటు లేకుండా సాధ్యపడదు. దీని ఉదాహరణ రష్యా

కమ్యూనిస్టు విప్లవంలో కానవస్తుంది. మరో విషయమేమంటే ఒకవేళ ఈ మార్పిడి శాంతియుతంగా ప్రజాస్వామిక విధానాల ప్రకారం జరిగినా సామూహిక ఆస్తి వ్యవస్థ ఎటొచ్చి వ్యక్తిగత స్వేచ్ఛను పూర్తిగా హరింపజేస్తుంది, ప్రజాస్వామిక విధానాల ద్వారా సోషలిజాన్ని స్థాపించడమంటే, వాస్తవానికి ప్రజాస్వామిక పద్ధతి ద్వారా ప్రజాస్వామ్యాన్ని అంతమొందించడమన్న మాట. ఎందుకంటే ప్రజాస్వామ్యం అన్నది, సమాజంలో అత్యధిక సంఖ్య ప్రజలు స్వేచ్ఛా వృత్తిగలవారు లేకుండా అసలు మనజాలదు. కాని, సోషలిజం దీనికి భిన్నంగా స్వేచ్ఛా వృత్తిని అంతమొందిస్తుంది. సంపాదనకు సంబంధించిన ఏ విభాగాన్ని సామూహిక వ్యవస్థలోకి తీసుకున్నా దానికి కార్యకర్తలందరూ ప్రభుత్వ ఉద్యోగులవుతారు. ఉద్యోగుల వర్గంలో అభిప్రాయ స్వేచ్ఛ, ఆచరణ స్వేచ్ఛ ఏ మేరకు ఉంటుందో అందరికీ తెలిసిన విషయమే. ఈ విధానం ఆర్థిక వ్యవస్థలో ఎంతగా విస్తరిస్తుందో అంతగానూ ఆలోచనా స్వేచ్ఛ, మాట్లాడే స్వేచ్ఛ, సంఘాలు ఏర్పరచుకునే స్వేచ్ఛ, రచనా స్వేచ్ఛ ఆచరణ స్వేచ్ఛలకు సంబంధించిన పరిధులు కుంచించుకుపోతూ ఉంటాయి. చివరికి ఏ రోజయితే అర్థిక వ్యవస్థ పూర్తిగా సామూహిక వ్యవస్థలో అంతర్లీనమయిపోతుందో ఆ రోజే దేశం లోని జనాభా అంతా ప్రభుత్వ ఉద్యోగుల వర్గంగా మారిపోతుంది. ఇలాంటి వ్యవస్థ నైజం ప్రకారం ఏ వర్గమయితే ఓసారి అధికారంలోకి వస్తుందో దాన్ని మళ్ళీ అధికారాన్నుండి తొలగించడం సాధ్యపడదు.

మనం వ్యక్తిగత ఆస్తి వ్యవస్థను నిర్మూలించడానికి బదులుగా దానిపై ఓ పటిష్ఠమైన ప్రభుత్వ అదుపు (Government Control)ను నెలకొల్పి మొత్తం జాతీయ వ్యవస్థను, ఫాసిజం, నాజీజంలో మాదిరిగా ఓ కేంద్రీయ ప్రణాళికకు అనుగుణంగా నడిపిస్తే పెట్టుబడిదారీ వ్యవస్థలోని అనేక చెడుల నివారణ జరగవచ్చు. కాని వ్యక్తిగత స్వేచ్ఛకు ఈ మాత్రపు నియమబద్ధత అపాయకరంగా పరిణమించగలదు. దీని పర్యవసానాలు కూడా ఆచరణాత్మకంగా సోషలిజంలోని పర్యవసానాల్లాంటివే అవుతాయి.

మనం పెట్టుబడిదారీ వ్యవస్థను దాని మౌలిక ప్రాతిపదికల పైనే స్థిరంగా ఉంచి అందులో ఇప్పటి వరకు అమెరికా, ఇంగ్లాండు తదితర దేశాల్లో మాదిరిగానే సంస్కరణలు జరిపినా దానివల్ల ప్రజాస్వామ్యం, వ్యక్తిగత స్వేచ్ఛలయితే మనగలుగుతాయి కాని అసలు పెద్ద పెద్ద రుగ్మతల్లో నుండి ఒక్కటీ దూరం కాదు. ఈ రుగ్మతల కారణంగానే పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రపంచానికి ఓ అభిశాపంగా, ఓ విపత్తుగా పరిణమించింది.

ఈ వివరణ వల్ల తేలిందేమంటే, ఓ వైపున నుయ్యి. మరో వైపున గొయ్యి పొంచి ఉన్నాయన్న మాట. సామూహిక సంక్షేమం కొరకు పాటుపడితే వ్యక్తుల స్వేచ్ఛ అంతమవుతుంది. వ్యక్తుల స్వేచ్ఛను రక్షిస్తే సామూహిక సంక్షేమం నాశనమవుతుంది. పారిశ్రామిక విప్లవం దాని సకల శుభాలతో పురోగమిస్తూ ఉండి వ్యక్తిగత స్వేచ్ఛ, సామూహిక సంక్షేమం రెండూ ఒకేసారి సమతూకంతో సర్దుకునే జీవన వ్యవస్థ ప్రపంచానికి ప్రాప్తం కాలేదు. ఇలాంటి ఓ వ్యవస్థను కనుగొనడంపైనే భవిష్యత్తు

ఆధారపడి ఉంది. అది ప్రాప్తం కాకపోతే పారిశ్రామిక విప్లవం అనే పిస్తోలుతోనే మానవుడు ఆత్మహత్య చేసుకుంటాడు. ఒక వేళ అది లభిస్తే ఏ దేశమయితే దాన్ని నడిపి జయప్రదమయిన ఓ ఆదర్శాన్ని నెలకొల్పుతుందో అదే ప్రపంచ నాయకత్వాన్ని పొందుతుంది.

# ఇస్లాం ఆర్థిక వ్యవస్థ - మూల స్తంభాలు

కమ్యూనిజం, కాపిటలిజం మధ్యన ఏ మధ్యస్థ ఆర్థిక సిద్ధాంతాన్ని ఇస్లామ్ అవలంబిస్తుందో దాని ఆధారంగా ఓ వ్యవస్థను నిర్మించడానికి అది తొలుత వ్యక్తిలోను, సమాజంలోను కొన్ని నైతిక, ఆచరణాత్మక ప్రాతిపదికల్ని నెలకొల్పుతుంది. అవే ఆ వ్యవస్థ కట్టడాన్ని పటిష్టంగా నిలుపగలుగుతాయి. ఈ లక్ష్యసాధన కొరకు అది ఒక్కో వ్యక్తి మనస్తత్వాన్ని సంస్కరించి, ఈ మధ్యస్థ వ్యవస్థను నడపడానికి కావలసిన మానసిక స్థితిని వారిలో ఉద్భవింపజేస్తుంది. అది వ్యక్తిగత స్వేచ్ఛపై కొన్ని పరిమితుల్ని విధిస్తుంది. తద్వారా అది సాముహిక ప్రయోజనాల కొరకు నష్టకరం కాకుండా ప్రయోజనకరంగా, సహకారిగా రూపొందుతుంది. అది సమాజంలో కొన్ని నియమాలను నియమిస్తుంది. అవి, ఆర్థిక జీవనాన్ని చెరిపె

కారణాలను రూపుమాపుతాయి. ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ మూలస్తంభాలు ఈ సూత్రాలే. వీటిని అర్థం చేసుకోవడం, ఆధునిక ఆర్థిక సమస్యలకు ఇస్లామీయ పరిష్కారాన్ని అవగతం చేసుకోడానికి చాలా అవసరం.

# 1. ధర్మాధర్మాల విచక్షణ

మొట్టమొదటి విషయమేమంటే, ఇస్లామ్ తన అనుయాయులకు ధనం సంపాదించే సర్వసామాన్యమయిన లైసెన్సు, అనుమతినివ్వదు. అది సంపాదనా మార్గాల్లో సామూహిక ప్రయోజనాల దృష్ట్యా ధర్మాధర్మాల విచక్షణను గుర్తిస్తుంది. ఆ విచక్షణకు ప్రాతిపదిక ఓ మూల సూత్రం: ధనం సంపాదించే ఏ విధానమయినా, దాని వల్ల ఒక వ్యక్తికి లాభం, మరో వ్యక్తికి లేక మరికొందరు వ్యక్తులకు నష్టం కలిగేదయితే ఆ విధానం అధర్మమయింది. ఇంకా, లాభాల మార్పిడి తత్సంబంధం గల వ్యక్తుల మధ్య న్యాయవంతంగా జరిగినట్లయితే అది ధర్మసమ్మతమయింది. దివ్య ఖుర్‌ఆన్‌లో ఈ మూల సిద్ధాంతాన్ని ఈ విధంగా చెప్పడం జరిగింది.

> విశ్వసించిన జనులారా! ఒకరి సొమ్మును మరొకరు పరస్పరం అధర్మ రీతుల్లో తినకండి ; అయితే ఇచ్చిపుచ్చుకోవడం అన్నది పరస్పరామోదంతో జరగాలి. మిమ్మల్ని మీరు హతమార్చుకోకండి. అల్లాహ్ మీ పట్ల ఎంతో దయగలవాడన్న విషయం నిజం. అవధుల్ని అతిక్ర-

మించి అన్యాయంగా అలా చేసేవాడిని మేము తప్పకుండా అగ్నిలో పడవేస్తాము. (అన్ నిసా : 29, 30)

ఈ ఆయత్‌లో ఇచ్చిపుచ్చుకోవడాలకు రెండు షరతులు విధించబడ్డాయి. ఒకటి, ఇచ్చిపుచ్చుకోవడం పరస్పరామోదంతో జరగాలి. రెండు, ఒకరి లాభం మరొకరి నష్టం కాకూడదు. ఈ భావాన్ని చాటే పదాలు "వలా తక్ తులూ అన్‌ఫుసకుమ్" చాలా భావగర్భితమయినవి. వీటికి రెండర్థాలున్నాయి. ఇక్కడ రెండూ వర్తిస్తాయి. ఒకటేమంటే మీరు పరస్పరం ఒకరినొకరు హతమార్చుకోకండి ; రెండోది, స్వయంగా మీరే మిమ్మల్ని హతమార్చుకోకండి. భావమేమంటే, ఏ వ్యక్తి అయితే తన సొంత లాభం కొరకు ఇతరులకు నష్టం కలిగిస్తాడో, అతని చర్య ఆ ఇతరుని రక్తం తాగడంతో సమానం. పర్యవసానంగా అతడు స్వయంగా తన వినాశాన్నే కొనితెచ్చుకుంటాడు. దొంగతనం, లంచం, జూదం, వంచన, వడ్డీ ఇంకా అధర్మమయినవిగా ప్రకటించిన వ్యాపార విధానాలన్నింటిలోనూ అవి ధర్మసమ్మతం కావని చాటే ఈ రెండు కారణాలూ ఉన్నాయి. కొన్నింటిలో "పరస్పరామోదం" అనే భ్రమ కలిగినా మిమ్మల్ని మీరు చంపుకోకండి, అనే ముఖ్యమయిన రెండో షరతు లేదు.

## 2. ధనం కూడబెట్టడం నిషిద్ధం

రెండో ముఖ్యమయిన ఆదేశమేమంటే, ధర్మసమ్మతంగా సంపాదించే ఈ ధనాన్ని కూడబెట్టకూడదు. ఎందుకంటే దీని వల్ల ద్రవ్యచలనం ఆగిపోతుంది. ద్రవ్యపంపిణిలో సమతూకం

ఉండదు. ధనం కూడబెట్టే వ్యక్తి స్వయంగా తాను దుష్టతర మయిన నైతిక రుగ్మతలకు గురికావడం ఒక్కటే కాదు, వాస్తవంగా అతడు మొత్తం సమాజానికి ప్రతికూలంగా తీవ్రమయిన అప రాధాన్ని చేస్తాడు. దాని ఫలితం చివరికి అతనికీ హానికరంగానే పరిణమిస్తుంది. అందువల్లనే దివ్య ఖుర్ అన్ పిసినారితనాన్ని, కుబేరతత్వాన్ని కఠినంగా నిరసించింది. అందులో ఉంది:

> అల్లాహ్ విరివిగా ప్రసాదించిన ఆయన అనుగ్రహాల పట్ల పిసినారితనం చూపేవారు, ఈ పిసినారితనం తమకు లాభకరమైనదని భావించరాదు, కాదు, ఇది వారి కొరకు ఎంతో నష్టకరమయినది. (ఆలిఇమ్రాన్ : 180)
>
> ఎవరయితే బంగారాన్నీ, వెండినీ పోగుచేసి ఉంచుతారో, దాన్ని దైవ మార్గంలో ఖర్చుపెట్టరో, వారికి వ్యధాభరిత మయిన శిక్ష కలిగే శుభవార్తను అందజెయ్యండి. (అత్ తౌబా : 34)

ఈ సూత్రం పెట్టుబడిదారీ వ్యవస్థ పునాదులపైనే దెబ్బ తీస్తుంది. మిగులును కూడబెట్టడం, కూడబెట్టినదాన్నీ ఇంకా ధనార్జనలో వాడడమే వాస్తవానికి పెట్టుబడిదారీకి మూలం. కాని మనిషి తన అవసరానికి మించిన ధనాన్ని కూడబెట్టడాన్ని ఇస్లాం ఇష్టపడదు.

## 3. ఖర్చు చెయ్యడం

కూడబెట్టడానికి బదులుగా ఖర్చు చెయ్యాలని ఇస్లామ్ ఉద్బోధిస్తుంది. కాని ఖర్చు చెయ్యడమంటే, సుఖభోగాల

కొరకు విలాస వస్తువులకై ధనం వెచ్చించడం అని భావం కాదు. ఇస్లామ్ "ఫీ సబీలిల్లాహ్" (దైవ మార్గంలో) అనే షరతు పెట్టి మరీ ఖర్చు చెయ్యమంటోంది. అంటే మీ వద్ద మీ అవసరాలు పోగా మిగిలినదాన్ని సమాజ శ్రేయం కొరకు వినియోగించాలి. ఇదే దైవ మార్గమంటే.

> 'మేము అల్లాహ్ మార్గంలో ఏమి ఖర్చుపెట్టాలి' అని వారు అడుగుతారు. నీవు వారికి సమాధానం చెప్పు, 'మీ నిత్యావసరాలకు పోగా మిగిలింది' అని.
>
> (అల్ బఖర : 219)

> తల్లిదండ్రుల ఎడల సద్భావంతో మెలగండి. బంధువుల్ని, అనాథల్ని, నిరుపేదల్ని ఆదుకోండి. పొరుగున ఉన్న బంధువులు, అపరిచితులయిన పొరుగువారు, ప్రక్కనున్న సహవాసులు, బాటసారులు, మీ స్వాధీనంలో ఉన్న దాస దాసీజనం పట్ల ఉదారంగా వ్యవహరించండి.
>
> (అజ్ జారియాత్ : 36)

> ఇంకా వీరి ధనంలో అర్థించేవారు, ఉపేక్షితుల హక్కు ఉంది.
>
> (అన్ నిసా : 19)

ఇక్కడ ఇస్లామ్ దృక్పథం, పెట్టుబడివారీ దృక్పథానికి పూర్తిగా భిన్నమయిపోతుంది. పెట్టుబడిదారుడు, ఖర్చు చేస్తే పేదవాడినయిపోతానని, ప్రోగు చేస్తే ధనికుడనయిపోతానని భావిస్తాడు. ఇస్లామ్ బోధించేదేమంటే ఖర్చు చెయ్యడం వల్ల శుభలాభాలు కలుగుతాయి. నీ ధనం తరగదు, పైగా పెరుగుతుంది.

దారిద్ర్య ప్రమాదం చూపి షైతాన్ మిమ్మల్ని భయపెడు తాడు. నీతిబాహ్యమైన, నీచమైన(పిసినారితనం) మార్గాన్ని అవలంబించమని ప్రేరేపిస్తాడు, కాని అల్లాహ్ మిమ్మల్ని మన్నిస్తానని, ఇంకా అనుగ్రహిస్తానని వాగ్దానం చేస్తు న్నాడు. (అల్ బఖర : 268)

పెట్టుబడిదారుల అభిప్రాయంలో అతడు ఖర్చు చేసినదంతా అతడు పోగొట్టుకున్నట్లే. ఇస్లామ్ చెప్పేదేమంటే అది పోలేదు. దాని ఉత్తమమయిన లాభం మీకు తిరిగి లభిస్తుంది.

మంచి మార్గంలో మీరు ఏది ఖర్చు చేసినా అది మీకు పూర్తిగా లభిస్తుంది. మీకు ఏ మాత్రం అన్యాయం జరగదు. (అల్ బఖర : 272)

ఇంకా ఎవరయితే మేము ప్రసాదించిన సంపదలో నుంచి గోప్యంగా, బహిరంగంగా ఖర్చు చేస్తారో వారు ఎంత సేపటికీ నష్టం లేనేలేని ఓ బేరాన్ని ఆశిస్తారు. అల్లాహ్ వారి వారి ప్రతిఫలాన్ని పూర్తిగానిస్తాడు. పైగా తన అను గ్రహం మూలంగా ఇంకా ఎంతో అధికంగానే ప్రసా దిస్తాడు. (ఫాతిర్ : 29, 30)

పెట్టుబడిదారు భావించేదేమంటే ధనాన్ని కూడబెట్టి దాన్ని వడ్డీకై అప్పుల్లో వినియోగిస్తే ధనం పెరుగుతుంది. ఇస్లామ్ దానికి భిన్నంగా, వడ్డీ వల్ల ధనం తరుగుతుందని, ధనాన్ని పెంచే మార్గం మంచి పనుల్లో దాన్ని ఖర్చుపెట్టడమని అంటుంది.

అల్లాహ్ వడ్డీని నశింపజేస్తాడు, దానధర్మాలను పెంచి అధికం చేస్తాడు. (అల్ బఖర : 276)

ఇంకా జనుల సంపాదనలో వృద్ధి కలుగుతుందని మీరు వడ్డీనిస్తే దైవం దృష్టిలో అందులో ఎన్నటికీ వృద్ధి కలగదు. మీరు అల్లాహ్ కొరకు జకాత్‌లో ఇచ్చే ధనానికి పెరుగుదల భాగ్యం ప్రాప్తమవుతుంది.

(అర్రూమ్ : 39)

ఇది పెట్టుబడిదారీ సిద్ధాంతానికి పూర్తిగా వ్యతిరేకమయిన కొత్త సిద్ధాంతం. ఖర్చు చేస్తే సంపాదన పెరగడం, ఖర్చు చేసే ధనం వ్యయం కాకపోవడం అలా ఉంచి దానికి ప్రతిఫలం పూర్తిగా ఇంకా అధిక లాభాలతో తిరిగి దొరకడం, వడ్డీ వల్ల ధనంలో పెరుగుదలకు బదులు తరుగు జరగడం, జకాత్, దాన ధర్మాల వల్ల సంపాదనలో తరుగుదలకు బదులు పెరుగుదల జరగడం, ఇవన్నీ పైకి చాలా విచిత్రంగా అగుపించే సిద్ధాంతాలు. వినేవాడు, ఈ మాటలన్నీ పరలోక పుణ్యఫలానికి సంబంధించినవేమో అని భావిస్తాడు. ఈ మాటలకు పరలోక ప్రతిఫలంతో కూడా సంబంధం ఉన్న విషయంలోను, ఇస్లామ్ దృష్టిలో ఆ ప్రతిఫలానికే అసలు ప్రాముఖ్యత కలదన్న విషయంలోను ఎలాంటి సందేహం లేదు. కాని కాస్త పరిశీలనా దృష్టితో పరికిస్తే ఇహలోకంలోను, ఆర్థిక వ్యవస్థ దృష్ట్యా ఈ సిద్ధాంతాలు అత్యంత పటిష్టమయిన పునాదులపై ఉన్నట్టు తేలుతుంది.

ధనాన్ని సేకరించి కూడబెట్టడం, దాన్ని వడ్డీని సంపాయించేందుకు వినియోగించడం వల్ల పర్యవసానంగా చివరికి ధనమంతా సమాజంలో కొందరి వద్దనే పోగయిపోతుంది. సామాన్య ప్రజల కొనుగోలు శక్తి (Purchasing power) అనుదినం తగ్గుతూనే పోతుంది. పరిశ్రమలు, వాణిజ్యం, వ్యవసాయాల్లో

మార్కెట్టు మందగిస్తుంది. జాతి ఆర్థిక జీవనమే వినాశానికి దగ్గరవుతుంది. చివరికి పెట్టుబడిదారులు సయితం తాము కూడబెట్టిన సంపదను ధనార్జనా మార్గంలో పెట్టే అవకాశం అట్టే లేకుండా పోతుంది.*

దీనికి భిన్నంగా ధనాన్ని వెచ్చించడం, జకాత్ చెల్లించడం, దానధర్మాలు చెయ్యడం మూలాన జాతి ప్రజలందరికీ సంపాదన విస్తరిస్తుంది. ప్రతి వ్యక్తికి చాలినంత కొనుగోలు శక్తి ప్రాప్తమవుతుంది. పరిశ్రమలు అభివృద్ధి చెందుతాయి. పొలాలు సస్యశ్యామలమవుతాయి, వాణిజ్యం వికాసమొందుతుంది. లక్షాధికారులు, కోటీశ్వరులు ఎవరూ కాకపోయినా అందరూ సుఖసంతోషాలతో, సుభిక్షంతో అలరారుతారు.

ఈ విధంగా ఫలవంతమయ్యే ఆర్థిక సిద్ధాంతంలోని సత్యతను తెలుసుకోవాలంటే, పెట్టుబడిదారీ వ్యవస్థ క్రింద నేటి ప్రపంచ ఆర్థిక పరిస్థితుల్ని పరిశీలించండి. నేడు ఒక్క వడ్డీ కారణంగా ధన పంపిణీ సంతులనం అవకతవకలయింది. పారిశ్రామిక, వాణిజ్య రంగాల్లో మార్కెట్టు మందగించటం మూలాన ప్రజల ఆర్థిక జీవనం వినాశానికి చేరువయింది. దీనికి ప్రతిగా ఇస్లామీయ యుగం ప్రారంభ కాలాన్ని పరిశీలించండి. ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థను దాని పూర్తి వైభవంతో అమలుజరిపినప్పుడు కొన్నేండ్ల లోపున ప్రజలు ఏ మేరకు భాగ్యవంతులయ్యా;

---

* ఈ విషయాన్నే ఓ హదీసులో సూచనప్రాయంగా ప్రస్తావించడం జరిగింది. అందులో వడ్డీ ఎంత అధికమయినా ఫలితంగా అది తగ్గుదలగానే పరిణమిస్తుంది అని ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు.

రంటే, వారు జకాత్ పొందడానికి అర్హులయినవారిని వెదుకుతూ తిరిగేవారు. స్వయంగా జకాత్‌నిచ్చేవారు తప్ప ఇతరులు వారికి దొరికేవారు కారు. ఈ రెండు పరిస్థితుల్ని పరిశీలిస్తే దైవం వడ్డీని ఎలా వినాశం చేస్తాడో, దానధర్మాలకు ఎలా వృద్ధి వికాసాలనిస్తాడో స్పష్టంగా తెలుస్తుంది.

## మనస్తత్వం

పైగా ఇస్లామ్ మనుషుల్లో సృజించే ఆలోచనా విధానం కూడా పెట్టుబడిదారీ విధానానికి భిన్నమయింది. ఒక వ్యక్తి తన డబ్బును మరొకనికి వడ్డీ లేకుండా ఇవ్వగలగడం అన్నది పెట్టుబడిదారు అయిన మనిషికి ఏ విధంగానూ మింగుడుపడని విషయం. అతడు అప్పు ఇచ్చి వడ్డీ తీసుకోవడమేకాక తన అసలునూ వడ్డీనీ వసూలు చెయ్యడానికి ఋణగ్రస్తుడి బట్టలూ అతని ఇంటి పాత్రలు సయితం జప్తు చేసుకుంటాడు. కాని ఇస్లామ్, అవసరమున్నవానికి కేవలం అప్పు ఇవ్వడమేకాక, అతడు ఇబ్బందుల్లో ఉంటే అతని పట్ల కఠినంగా ప్రవర్తించరాదనీ, ఇంకా అతడు చెల్లించే స్తోమత లేనివాడైతే ఆ రుణాన్ని మాఫీ చెయ్యాలనీ బోధిస్తుంది.

> మీ బాకీదారు ఆర్థిక ఇబ్బందుల్లో ఉంటే అతని పరిస్థితి మెరుగుపడేవరకు గడువు ఇవ్వండి. ఒకవేళ మీరు బాకీని మాఫీ చేసి అతనికి వదలివేసినట్లయితే అదే మీకు శ్రేయస్కరం. మీరు తెలిసినవారే అయితే దాని ప్రయోజనాన్ని అర్థం చేసుకోగలరు. (అల్ బఖర : 280)

పెట్టుబడిదారీ వ్యవస్థలో పరస్పర సహకారమంటే భావం. మీరు సహకార సంస్థకు ముందు డబ్బు కట్టి సభ్యులవ్వాలి, అప్పుడు మీకు ఏదయినా అవసరం ఏర్పడితే ఈ సంస్థ మీకు బజారు వడ్డీ రేటుకు కొంత తక్కువగానే అప్పునిస్తుంది. ఒకవేళ మీ వద్ద డబ్బు లేకపోతే మీరు సహకార సంస్థ నుండి ఏమీ పొందలేరు. దీనికి భిన్నంగా ఇస్లామ్ దృష్టిలో పరస్పర సహకారమంటే, కలిగినవారు లేని సోదరులకు అవసరమేర్పడినప్పుడు కేవలం అప్పు ఇవ్వడమేకాక అప్పు చెల్లించడంలో కూడా వీలయినంతవరకు, దైవం కొరకు వారికి తోడ్పడాలి. ఇందు నిమిత్తంగా జకాత్ ఖర్చు చేసే పద్దుల్లో రుణగ్రస్తుల రుణాన్ని చెల్లించడం కూడా ఒక పద్దు ఉంది.

పెట్టుబడిదారు మంచి పనుల్లో ఏదయినా ఖర్చుపెట్టినా అది కేవలం ప్రదర్శనా బుద్ధితోనే. ఎందుకంటే అతని సంకుచిత దృష్టిలో అతడు చేసే ఖర్చుకు కనీస ఫలమయిన ఈ ప్రతిష్ఠ అయినా అతనికి దక్కాలి, అతనికి ప్రజాదరణ లభించాలి, అతనంటే ప్రజల్లో భయం, నమ్మకం కుదరాలి. అయితే ఇస్లామ్ ప్రకారం, ఖర్చు చెయ్యడంలో ప్రదర్శనా బుద్ధి అసలు కానరాకూడదు. గుప్తంగానయినా, బహిరంగంగానయినా ఏవి ఖర్చు చేసినా దీనికి తక్షణం మీకు ఏ రూపంలోనయినా ప్రతిఫలం లభించాలి అన్న ఉద్దేశ్యమే ఉండరాదు. చివరన దొరికే ఫలితం పైనే దృష్టిని నిలపాలి. ఈ ప్రపంచం మొదలుకొని పరలోకం వరకు మీ దృష్టి ఎంత దూరం పోగలదో అంతవరకూ ఈ ఖర్చు దినదినాభివృద్ధి చెందుతూనే, లాభాలపై లాభాలు ఆర్జిస్తూనే కానవస్తుంది.

ఎవరయితే తన ధనాన్ని ప్రదర్శనా బుద్ధితో ఖర్చు చేస్తాడో దాని ఉపమానం ఇలా చెప్పవచ్చు: ఒక బండ రాయిపై మట్టి పేరుకున్నది. అందులో ఆ వ్యక్తి విత్తనం నాటాడు. నీటి ప్రవాహం ఒకటి వచ్చి మట్టి కొట్టుకుపోయింది. ఇంకా, ఏ వ్యక్తి అయితే మంచి సంకల్పంతో దైవ ప్రసన్నత కొరకు ఖర్చు చేస్తాడో అతని ఉపమానం ఇది : ఇతను సారవంతమయిన నేలలో ఓ తోటను నాటాడు. వర్షాలు పడితే అది రెండింతలుగా పండుతుంది. వర్షం పడకపోయినా కేవలం సన్నని జల్లే దానికి చాలు."

(అల్ బఖర : 264, 265)

మీరు మీ దానధర్మాలను బహిరంగంగా చేసినా మంచిదే. కాని రహస్యంగా, నిరుపేదలకు దానమివ్వటం మీకు ఎక్కువ మేలును చేకూరుస్తుంది. (అల్ బఖర : 271)

పెట్టుబడిదారీ మనస్తత్వంగల వ్యక్తి మంచి పనుల్లో ఖర్చు చేసినా అయిష్టంగా చేస్తాడు. అత్యంత హీనమయిన వస్తువును దానం చేస్తాడు. దానం ఇచ్చిన వ్యక్తి ప్రాణాన్ని తన నోటి బల్లాలతో సగం తోడేస్తాడు. ఇస్లామ్ దీనికి భిన్నంగా, మంచి సరుకును దానమివ్వమని, ఖర్చు చేసి ఉపకారం వెలిబుచ్చరాదని, తీసుకున్న వ్యక్తి మీ ఉపకారానికి మీ ముందు కృతజ్ఞతలు తెలుపాలన్న అభిలాష కూడా మీలో ఉండరాదని బోధిస్తుంది.

మీరు సంపాదించిన దానిలో నుండి, మేము మీ కొరకు భూమి నుండి ఉత్పన్నం చేసిన దానిలో నుండి మేలైన భాగాన్ని దైవ మార్గంలో ఖర్చు పెట్టండి. ఆయన

మార్గంలో ఇవ్వడానికి పనికిరాని వస్తువుల్ని ఏరి తీసే ప్రయత్నం చెయ్యకండి. (అల్ బఖర : 267)

మీరు దెప్పిపొడిచి, గ్రహీత మనస్సును గాయపరచి మీ దానధర్మాలను మట్టిలో కలపకండి. (అల్ బఖర : 264)

ఇంకా వారు అల్లాహ్ ప్రేమలో నిరుపేదలకు, అనాధలకు, ఖైదీలకు భోజనం పెడతారు. 'మేమైతే కేవలం అల్లాహ్ కొరకే మీకు భోజనం పెడుతున్నాము. మేము మీ తరపున ఏ ప్రతిఫలాన్నీ, కృతజ్ఞతాభివందనాల్నీ ఆశించడం లేదు' అని అంటారు. (అద్ దహ్ర ; 8–9)

నైతికతా దృష్ట్యా ఈ రెండు మనస్తత్వాల్లో ఎంత మహత్తర వ్యత్యాసముందో అన్న విషయాన్ని వదిలేద్దాము. కేవలం ఆర్థిక దృక్కోణం రీత్యా చూసినా లాభనష్టాల ఈ రెండు దృక్పథాల్లో ఏ దృక్పథం ఎక్కువ పటిష్టమయినదో ఏది దీర్ఘకాలిక ఫలితాల నిస్తుందో అన్న దృష్టితో చూస్తే ఏది సరయినదో ద్యోతకమవుతుంది. పైగా లాభనష్టాల విషయంలో ఇస్లామ్ దృక్కోణం ఇలాంటిదయినప్పుడు పరిస్థితులు ఏవయినప్పటికీ ఇస్లామ్ వడ్డీ వ్యాపారాన్ని అనుమతించడం ఎలా సంభవమవుతుంది ?

## 4. జకా

ఇంతకు ముందు సూచించినట్లు ఇస్లామ్ కోరేదేమంటే ధనం ఒకేచోట ప్రోగవ కూడదు. సమాజంలో ఏ వ్యక్తుల వద్ద నయినా వారి శక్తి సామర్థ్యాల కారణంగా లేక అదృష్టవశాత్తున, వారి అవసరానికి మించిన ధనం ప్రాప్తమయితే వారు దాన్ని

పోగుచేసి పెట్టరాదని ఇస్లాం అభిలషిస్తుంది. వారు దాన్ని ఖర్చు చెయ్యాలి. ధనావర్తనం వల్ల సమాజంలోని అభాగ్య వర్గాలకూడా చాలినంత వాటా లభించేలాంటి వ్యయాల్లో ఖర్చు పెట్టాలి. ఈ ఉద్దేశ్యంతో ఇస్లాం ఉన్నత, నైతిక బోధనల ప్రేరణల ద్వారా ఎంతో ప్రభావవంతంగా దాతృత్వాన్నీ, నిజమయిన సహకార భావాన్నీ ప్రజల్లో పెంపొందిస్తుంది. తద్వారా ప్రజలు స్వతహాగా ధనాన్ని కూడబెట్టడాన్ని ఏవగించుకోవాలని, దాన్ని ఖర్చుపెట్టేందుకు సమాయత్తమవ్వాలని అభిలషిస్తుంది. మరో వైపున ఎవరయినా దాతృత్వం గురించి చేసిన ఈ బోధనల్ని దాటవేసి తన సొంత నైజం ప్రకారం ధనం సేకరించడానికి, సొత్తు కూడబెట్టడానికే సమాయత్తమవుతే లేక ఎవరి వద్దనయినా ఏదో ఓ విధంగా ఐశ్వర్యం పోగయిపోతే వారి సొమ్ములో నుండి కూడా కనీసం ఓ భాగం సమాజ సంక్షేమ వికాసాల కొరకు కేటాయించడానికి తగిన చట్టాన్ని నిర్మిస్తుంది. ఈ నియమానికే "జకాత్" అని పేరు. ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థలో దీని ప్రాముఖ్యత దృష్ట్యా దీన్ని ఇస్లామ్ మౌలికాంశాల్లో చేర్చడం జరిగింది. నమాజ్ తరువాత అత్యధికంగా తాకీదు చెయ్యబడ్డ నియమం ఇదే. ఎవరయితే ధనం కూడబెడతారో వారి ధనం జకాత్‌ను చెల్లించనంతవరకు వారికి ధర్మసమ్మతం కాదు అని స్పష్టంగా చెప్పడం జరిగింది.

> (ఓ ప్రవక్తా) వారి సొమ్ముల నుండి సదఖాను తీసుకుని వారిని పరిశుద్ధపరచండి." (అత్ తౌబా : 103)

"జకాత్" అన్న పదమే స్వయంగా చాటి చెబుతోంది— ధనవంతుడి వద్ద పోగయ్యే సంపద ఇస్లామ్ దృష్టిలో ఓ మలినం

అపరిశుద్ధ వస్తువు అని, దాని యజమాని అందులో నుంచి ప్రతి ఏటా రెండున్నర శాతం దైవ మార్గంలో ఖర్చు చెయ్యనంతవరకు అది పరిశుద్ధం కాదని, "దైవ మార్గం" అంటే ఏమిటీ? దేవుడైతే నిరపేక్షాపరుడు. ఆయనకు మీ సొమ్మూ అవసరం లేదు. అది ఆయనకు చేరనూ లేదు, ఆయన మార్గమంటే మీరు మీ సమాజంలో లేమికి గురయినవారిని, ఉపేక్షితుల్ని కలిగినవారుగా మార్చడానికి కృషి చెయ్యడం అని, మొత్తం సమాజానికే ప్రయోజనకరం కాగల పనులను, వృద్ధి చెయ్యడమని అర్థం.

> ఈ సద్ఖాత్ అయితే అసలు లేమితో బాధపడేవారి కొరకు, నిరుపేదల కొరకు, సద్ఖాత్ వ్యవస్థలో నియుక్తు లయినవారి కొరకు, ఎవరి హృదయాలనయితే గెలుచు కోవటం అవసరమో వారి కొరకు, ఇంకా బంధ విమోచనానికి, ఋణగ్రస్తుల సహాయానికి, ఇంకా దైవ మార్గంలోను, బాటసారుల సహాయానికిగాను వినియోగించటం కొరకు.
> (అత్ తౌబా : 60)

ఇది ముస్లిమ్‌ల "సహకార సంఘం". ఇది వారి "భీమా కంపెని." ఇది వారి "ప్రావిడెంట్ ఫండ్". ఇది వారి నిరుద్యోగుల 'సహాయ నిధి.' ఇది వారి వికలాంగులు, అగత్యపరులు, వ్యాధిగ్రస్తులు, అనాధలు, వితంతువుల ఉపాధికి సాధనం. ఇంకా వీటన్నింటినీ మించి ఇది ముస్లిమ్‌లను "రేపటి చింత" నుండి నిశ్చింతను ప్రసాదించే మార్గం. దాని సూత్రం చాలా సాధారణమయింది : నేడు నీవు ధనవంతుడివయినందువల్ల ఇతరులకు సహాయం చెయ్యి. రేపు నీవు అభాగ్యుడివయినట్లయితే ఇతరులు నీకు సహాయం చేస్తారు. నేను బీదవాడనైతే

ఏమవుతుంది ? నేను చనిపోతే నా భార్యాబిడ్డలేమవుతారు ? ఏదయినా విపత్తు వచ్చిపడితే, వ్యాధి సోకితే, ఇంట్లో అగ్ని ప్రమాదం సంభవిస్తే, వరద వస్తే, దివాలా తీస్తే ఈ సందర్భాల్లో వచ్చిన ఆపద నుండి తేరుకునే మార్గమేది ? ప్రయాణ సమయంలో దగ్గర ఏమీ డబ్బు లేకపోతే ఎలా ? అని నీవు బాధ పడనవసరం లేదు. నీ పనేమంటే నీవు కూడబెట్టిన ధనంలో నుంచి రెండున్నర శాతం చెల్లించి అల్లాహ్ నెలకొల్పిన ఇన్సూరెన్స్ కంపెనీలో భీమా చేయించుకో. నేడు నీకు ఈ ధనం అవసరం లేదు. ఇది నేడు అవసరమున్నవారికి ఉపకరిస్తుంది. రేపు నీవు అగత్యపరుడివయినప్పుడు లేక నీ సంతతికే అవసరం ఏర్పడినప్పుడు నీవు చెల్లించిన సొమ్మే కాదు, దానికన్నా అధికంగా కూడా నీకు తిరిగి ప్రాప్తమయ్యే అవకాశముంది.

ఇక్కడ తిరిగి పెట్టుబడిదారీ వ్యవస్థలోను, ఇస్లామ్‌లోని సిద్ధాంతాల్లో, విధానాల్లోను పూర్తిగా తేడా అగుపడుతోంది. పెట్టుబడిదారీ వ్యవస్థ కోరేదేమంటే ధనాన్ని కూడబెట్టాలి. దాన్ని పెంచడానికి వడ్డీని సేకరించాలి, తద్వారా ఈ కాల్వల గుండా ఇరుగు పొరుగున ఉన్నవారి ధనం కూడా వచ్చి ఈ చెరువులో చేరాలి. ఇస్లామ్ దీనికి భిన్నంగా ఇచ్చే ఆదేశం ప్రకారం, ధనం అసలు పోగవకూడదు. ఒకవేళ పోగైనా ఆ చెరువులో నుండి జకాత్ కాల్వలు తీసి ఎండిపోయిన పొలాలకు నీరు పట్టాలి ; ఇరుగుపొరుగున ఉన్న భూమంతా సస్యశ్యామలమవ్వాలి.

పెట్టుబడిదారీ వ్యవస్థలో ధనం మార్పిడి నిర్బంధంలో ఉంటుంది, ఇస్లామ్‌లో దానికి స్వేచ్ఛ ఉంది. పెట్టుబడిదారీ

చెరువు నుండి నీరు గ్రహించడానికి మీ "నీరు" అక్కడ ముందు నుంచే ఉండటం అనివార్యం. లేకపోతే అక్కడ్నుంచి మీకు ఒక్క చుక్క నీరయినా ప్రాప్తం కాదు. దీనికి భిన్నంగా ఇస్లామ్ లోని చెరువు నియమం ప్రకారం, ఎవరివద్దనయితే తన అవసరానికి మించి నీరుంటుందో వారు దాన్ని తెచ్చి అక్కడ పడెయ్యాలి, మరెవరికయితే నీరు అవసరముంటుందో వారు అందులోంచి తీసుకువెళ్ళాలి. ఇస్లామ్ మరియు పెట్టుబడిదారీ విధానాలు తమ నిజ స్వరూపం, నైజాల దృష్ట్యా పరస్పరం పూర్తిగా విరుద్ధమయినవి. ఒకే ఆర్థిక వ్యవస్థలో ఇవి ఇమిడి ఉండలేవు.

## 5. వారసత్వపు చట్టం

తన అవసరానికి ఖర్చు చెయ్యగా, దైవ మార్గంలో దానం చెయ్యగా, జకాత్ చెల్లించగా ఆ తరువాత కూడా సంపద ఒక చోట పోగయినట్లయితే దాన్ని వ్యాపింప చెయ్యడానికి ఇస్లామ్ మరో మార్గాన్ని అవలంబించింది. అది ఇస్లామ్ ప్రతిపాదించే వారసత్వపు చట్టం. ఈ చట్టం ప్రకారం, ఎవరయినా కొద్దో గొప్పో ఆస్తిని వదలి మరణిస్తే దాన్ని ముక్కలుగా చేసి దగ్గరి బంధువుల్లోనూ, దూరపు బంధువుల్లోనూ బంధుత్వం రీత్యా నియమం ప్రకారం పంచివెయ్యాలి. ఒకవేళ ఎవరికయినా ఏ వారసుడూ లేకపోతే లేక ఏ దూరపు వారసుడు కూడా దొరక్కపోతే అతనికి ఎవరినయినా పెంచుకునే హక్కును ఇవ్వకుండా అతని ఆస్తిని ముస్లిమ్ సమాజపు ఉమ్మడి ఖజానాలో చేర్చివెయ్యాలి. తద్వారా జాతి మొత్తం ప్రయోజనం పొందగలదు.

వారసత్వపు ఆస్తి పంపకానికి సంబంధించిన ఈ చట్టం ఇస్లామ్‌లోని మాదిరిగా మరే ఆర్థిక వ్యవస్థలోనూ కానరాదు. ఇతర ఆర్థిక వ్యవస్థల ప్రతిపాదనల ప్రకారం ఒక వ్యక్తి కూడబెట్టిన ఆస్తి అతని తరువాత కూడా ఒకడు లేక కొందరు వ్యక్తుల వద్దనే పోగయి ఉంటుంది. జ్యేష్ఠ కుమారుని వారసత్వపు చట్టం (Law of Primogeniture), ఉమ్మడి కుటుంబ విధానం (Joint family system) ఈ ఉద్దేశ్యంతోనే నిర్మించబడ్డాయి. కాని ఇస్లామ్ సంపద ఒకే చోట పోగయి ఉండటాన్ని ఇష్టపడదు. అది దాన్ని వ్యాపింపజెయ్యాలని కోరుతుంది. అప్పుడే ధన పరివర్తనం అవలీలగా జరగ్గలదు.

# 6. యుద్ధ ఫలాలు, విజయ ఫలాలు

ఈ విషయంలో సయితం ఇస్లామ్ ఆ ఉద్దేశ్యాన్నే దృష్టిలో ఉంచుకుని నియమాలు చేసింది యుద్ధంలో సైనికులకు లభించే యుద్ధ ఫలం గురించి చెయ్యబడిన చట్టం ప్రకారం దాన్ని అయిదు భాగాలుగా పంచాలి. నాలుగు భాగాలు సైనికుల్లో పంచి పెట్టాలి. ఒక భాగమేమో ప్రజా సంక్షేమ కార్యాల్లో వినియోగమవ్వాలి.

> మీరు తెలుసుకోవాలి : మీరు యుద్ధ సంపదగా దేన్నయితే పొందారో, దాని అయిదవ భాగం అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు, ఆయన బంధువులకు, అనాథలకు, బీదవారికి, బాటసారులకు చెందుతుంది. (అన్ఫాల్ : 41)

అల్లాహ్ మరియు ప్రవక్త వాటా అంటే, అల్లాహ్ మరియు ప్రవక్త ఆదేశానుసారం ఇస్లామీయ ప్రభుత్వానికి అప్పజెప్ప బడిన సామాజిక సామూహిక అవసరాలు, లక్ష్యాలు అని అర్థం.

ప్రవక్త బంధువుల వాటాను పెట్టడానికి కారణం, జకాత్‌లో వారికి భాగం లేకపోవడమే.

ఆ తరువాత ఈ ఖుమ్స్ (ఐదో వంతు ధనం)లో మూడు వర్గాల వాటాను ప్రత్యేకంగా కేటాయించడం జరిగింది.

సమాజంలోని "అనాథ బాల"లకు వారి విద్యాబోధన ఏర్పాట్లు జరిగి వారు జీవిత రంగంలో ఆసక్తితో పాల్గొనేలా చెయ్యడానికి.

"నిరుపేదలు" వీరిలో వితంతువులు, వికలాంగులు, ఏమీ చెయ్యలేనివారు, నిరాశ్రయులు అందరూ చేరి ఉన్నారు.

"బాటసారులు" ఇస్లామ్, దాని నైతిక బోధనల ద్వారా ప్రజల్లో బాటసారుల పట్ల సానుభూతిని ప్రత్యేకంగా జనింప జేసింది. దీనికి తోడుగా జకాత్, దానధర్మాలు, యుద్ధ ఫలాల్లో కూడా బాటసారుల హక్కును ప్రత్యేకించింది. దీని ద్వారా ఇస్లామీయ రాజ్యంలో వాణిజ్యం, పర్యాటక కృషి, విద్యా భ్యాసం, పరిశీలన, పరిశోధనల కొరకు ప్రజల రాకపోకల్లో ఎంతో సౌలభ్యం సమకూరింది.

యుద్ధ ఫలంగా ఇస్లామీయ ప్రభుత్వ అధీనంలోకి వచ్చే భూములు, ఆస్తులను 'ఫై' అనంటారు. దానికి సంబంధించిన చట్టం ప్రకారం అవి పూర్తిగా ప్రభుత్వ అధీనంలోనే ఉంటాయి.

అల్లాహ్ తన ప్రవక్తకు జనవాసాల ప్రజల నుండి 'ఫై'గా ఇప్పించిన సొత్తు ఆస్తిపాస్తులన్నీ అల్లాహ్ కొరకు, ఆయన ప్రవక్త కొరకు, ప్రవక్త బంధు వర్గం, అనాథలు, నిరుపేదలు, బాటసారుల కొరకే. ఈ సొమ్ము మీలోని ధనవంతుల మధ్యనే పరిభ్రమిస్తూ ఉండరాదని దాని ఉద్దేశ్యం. ఇంకా ఇందులో నిరాశ్రయులైన ముహాజిర్ల వాటా కూడా ఉంది. వీరు తమ ఇండ్లకు, ఆస్తులకు దూరం చెయ్యబడి గెంటివెయ్యబడినవారు.... ముహాజిర్ల రాకకు పూర్వం మదీనాలో విశ్వాసం గైకొన్న వారి వాటా కూడా ఉంది— ఇంకా తరువాత రాబోయే భావి తరాల వాటా కూడా ఉంది. (అల్ హష్ర : 7-10)

ఈ ఆయత్‌లో కేవలం 'ఫై' ధనాన్ని ఖర్చు పెట్టే పద్ధులనే ప్రస్తావించడం జరగలేదు. దానితోపాటు, 'ఫై' ధనంలోనేకాక ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థనంతటా దృష్టిలో ఉంచుకోబడిన లక్ష్యం వైపు కూడా సూచనప్రాయంగా తెలుపడం జరిగింది. అంటే, "ధనం మీలోని ధనవంతుల మధ్యనే పరిభ్రమిస్తూ ఉండరాదని" అనే విషయం. ఈ విషయం దేన్నయితే దివ్య ఖుర్ఆన్ ఒక చిన్నదయిన సమగ్రమయిన వాక్యంలో చెప్పిందో అది ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థకు పునాది రాయిలాంటిది.

# 7. పొదుపుకై ఆదేశం

ఒక వైపునేమో సంపద దేశ ప్రజలందరిలో పరిభ్రమింపజేసేందుకు, ధనవంతుల ధనంలో నిరుపేదల భాగం కేటాయిం

చేందుకు ఇస్లామ్ ఏర్పాట్లు చేసింది. దీన్ని మనం వెనుకటి పుటల్లో గమనించాము రెండో వైపునేమో అది ప్రతి వ్యక్తి తన ఖర్చుల్లో పొదుపును పాటించాలని అదేశిస్తోంది. దీని ద్వారా వ్యక్తులు తమ ఆర్థిక వనరుల్ని వినియోగించడంలో ఏ విధమైన అతివాద వైఖరికి గురయి సంపద పంపిణిలోని సమతూలనాన్ని చెడగొట్టరాదని అది వాంఛిస్తుంది. దివ్య ఖుర్ఆన్ సమగ్రంగా ఇలా బోధిస్తుంది :

> మీ చేతిని మెడకు కట్టి ఉంచకండి, అలా అని దాన్ని నిరాశా నిస్పృహలకు గురయి, నిస్సహాయులయ్యే విధంగా పూర్తిగా స్వేచ్ఛగానూ వదలి పెట్టకండి.
>
> (బనీ ఇస్రాయీల్ : 29)

> ఖర్చు చేసేటప్పుడు ఎవరయితే దుబారా చెయ్యరో ఇంకా పిసినారితనమూ చూపరో, దీనికి భిన్నంగా ఎవరయితే ఈ రెంటికీ మధ్య మధ్యస్థ మార్గాన్ని అవలంబిస్తారో వారే సజ్జనులయిన అల్లాహ్ దాసులు. (అల్ ఫుర్కాన్ : 67)

ఈ బోధన ఉద్దేశ్యమేమంటే ఖర్చుపెట్టే ప్రతి వ్యక్తి తన ఆర్థిక స్థితిగతుల పరిమితుల్లో ఉండి ఖర్చుచెయ్యాలి. తన ఖర్చు తన ఆదాయంకన్నా అధికమయ్యేలానూ చివరికి తన దుబారా ఖర్చులకు ఒక్కొక్కరి సమక్షంలో చెయ్యిచాచి తిరిగేలానూ హద్దులు మీరి ఖర్చు చెయ్యరాదు. ఆ తరువాత ఇతరుల సంపదని దోపిడి చేసుకోవడానికి, వాస్తవ అవసరం లేకుండానే అప్పులు గ్రహించడానికి తయారవరాదు. ఆపైన వారి అప్పుల్ని ఎగ్గొట్టడమో, లేక అప్పుల్ని తీర్చడానికి తనకు ఉన్న ఆర్థిక వనరులన్నింటినీ వ్యయపరచి తనను తాను, తన చేష్టల ఫలితంగా నిరు

పేదలు అనాథల జాబితాలో చేర్చుకోవడమో చెయ్యరాదు. అలా అని తన ఆర్థిక వసతులు ఏ మేరకు ఖర్చుచెయ్య అనుమతి నిస్తాయో ఆ మేరకు కూడా ఖర్చు చెయ్యకుండా ఉండేలా పూర్తిగా పిసినారిగానూ తయారవరాదు.

ఇకపోతే తన అవధుల్లో ఉండి ఖర్చు చెయ్యడమంటే మనిషి సంపాదనాపరుడయితే తన సంపాదన అంతా కేవలం తన భోగభాగ్యాల కొరకు, తన ఠీవి దర్పాల కొరకు ఖర్చు చెయ్యడమని భావం కాదు. ముఖ్యంగా అతని బంధువులు, సన్నిహిత మిత్రులు, పొరుగువారు అతి కష్టంగా జీవితం వెళ్ళబోస్తున్నప్పుడు ఇలాంటి స్వార్థపూరితమైన ఖర్చును ఇస్లామ్ దుబారా ఖర్చుకిందే జమకడుతుంది.

> బంధువుకు అతని హక్కును ఇవ్వండి. లేమికి గురయిన వారికి, బాటసారికి అతని హక్కును ఇవ్వండి. దుబారా ఖర్చు చెయ్యకండి. దుబారా ఖర్చు చేసేవారు షైతాన్ సోదరులు. షైతాన్ తన ప్రభువుకు కృతఘ్నుడు.
>
> (బనీ ఇస్రాయీల్ : 26, 27)

ఈ సందర్భంలో కేవలం నైతిక బోధనలతోనే సరిపుచ్చదు ఇస్లామ్. ఇటు లోభత్వం అటు దుబారా ఖర్చుల అత్యంత అతిశయ రూపాలను అరికట్టడానికి చట్టాలు కూడా చేసింది. తద్వారా సంపాదనా పంపిణీలోని సమతూలనాన్ని చెడగొట్టే విధానాలన్నింటిని నివారించడానికి ప్రయత్నించింది. అది జూదాన్ని హరాం (అధర్మమయింది)గా నిర్ణయిస్తుంది. మద్యం, వ్యభిచారాన్ని నిషేధిస్తుంది. విలాస విషయాలను అనేక దుర్వ్యాపకాలను నిషేధిస్తుంది. వాటి ద్వారా అనివార్యంగా

కాలమూ, ధనమూ వ్యర్థమయ్యే ప్రమాదముంది. సంగీత కళలో మానవుడు పూర్తిగా విలీనమయ్యేలా, అది ఇతర నైతిక, ఆధ్యాత్మిక రుగ్మతల్ని పుట్టించేదిగా, వాటితోపాటు ఆర్థిక జీవనంలో అవ్యవస్థను సృష్టించేదిగా రూపొందేవరకు ఆ కళాభి రుచిని చేరనివ్వదు. సౌందర్య రసజ్ఞతలాంటి స్వాభావిక గుణా లను సయితం అది కొన్ని పరిమితుల్లో బంధిస్తుంది. విలువైన వలువలు, వజ్రవైఢూర్యాల ఆభరణాలు, వెండి బంగారు పాత్రలు, చిత్రపటాలు, విగ్రహాలు వీటన్నింటి గురించి ప్రవక్త మహనీయులు (సఅసం) ఇచ్చిన ఆజ్ఞలన్నింటిలో దాగి ఉన్న ఇతర మర్మ హేతువులతోపాటు, ఓ పెద్ద హేతువు ఏమిటంటే, ఏ ధనమయితే మీ అనేక నిరుపేద సోదరుల అత్యంత తీవ్రమైన అవసరాలను తీర్చగలదో, వారికి నిత్యావసర వస్తువుల్ని సమ కూర్చగలదో దాన్ని కేవలం మీ శరీరం, మీ గృహాల అలంకరణ లకై ఖర్చు చెయ్యడం రసజ్ఞత కాదు. అది హృదయ కాఠిన్యం, దుష్టతరమయిన స్వార్థం. అంటే, నైతిక బోధన, చట్టబద్ధ మయిన ఆదేశాల ద్వారా ఇస్లామ్ మనిషికి ఏ విధమైన జీవితం గడపాలని ఆదేశిస్తుందో అది చాలా నిరాడంబరమయింది. ఇందులో మనిషి అవసరాలు, అభిరుచులు, కోరికల పరిధి సగటు ఆదాయంలో గడపలేనంత విస్తృతం కాజాలదు అతడు తన పరిధి నుండి వెలపలికి వచ్చి, ఇతరుల సంపాదనలో తన భాగం కోసం అర్రులుచాచి చూడడానికి, లేదా ఒకవేళ సగటు కన్నా అధిక ఆదాయం కలిగి ఉన్నా తన సంపాదన అంతా స్వయంగా తన కోసం ఖర్చు చేసుకుని సగటు కన్నా తక్కువ ఆదాయం గల తన సోదరుల సహాయం చెయ్యలేకుండా ఉండ డానికి ఇస్లామీయ జీవన సరళి తావివ్వదు

# ఆధునిక ఆర్థిక సమస్యలు - ఇస్లాం పరిష్కారం

మనం "చరిత్ర నేర్పిన పాఠం" అన్న వ్యాసావళిలో తెలుసుకున్న చిక్కులు ఇస్లామ్ ప్రసాదించిన సూత్రాల ప్రకారం ఎలా పరిష్కరించబడతాయో ఇప్పుడు పరిశీలిద్దాము. అంతకు ముందు కొన్ని ప్రాథమిక సత్యాలను అర్థం చేసుకోవడం అవసరం.

## ప్రాథమిక సత్యాలు

ఇస్లామీయ నాగరికతా వ్యవస్థను అర్థం చేసుకోవలసిన మొట్టమొదటి విషయమేమంటే ఇస్లామీయ దృక్పథం ప్రకారం అసలు ప్రాముఖ్యం వ్యక్తిదేకాని, సంఘానిది, జాతిది, సమాజానిది కాదు. "వ్యక్తి కొరకే సంఘం" కాని "సంఘం కొరకే వ్యక్తి" కాదు దైవం ఎదుట సంఘమో, జాతియో, సమాజమో బాధ్యత కలిగిలేదు. వాస్తవానికి ఒక్కొ వ్యక్తి, వ్యక్తిగతంగా బాధ్యుడు, జవాబుదారుడు. ఈ వ్యక్తిగత బాధ్యతా జవాబుదారీ భావన పైనే మనిషి నైతికంగా విలువ కలిగి ఉన్నాడు. సామూహిక

జీవితానికి అసలు లక్ష్యం అందరి సామూహిక సౌఖ్యం కాదు. ఒక్కొక్క వ్యక్తికి సంబంధించిన శ్రేయోసంక్షేమాలు. ఓ సామూహిక వ్యవస్థ మంచిదో, చెడ్డదో తెలుసుకోడానికి వాస్తవమయిన గీటురాయి, అది తనలోని మనుషుల వ్యక్తిగత పెరుగుదల, వృద్ధివికాసాల్లో, వారి వైయక్తిక శక్తిసామర్థ్యాల వినియోగంలో ఎంతవరకు తోడ్పడుతుంది లేక ఎంతవరకు అవాంతరాలు సృష్టిస్తుంది అన్నదే. ఈ కారణంగానే ఇస్లామ్, వ్యక్తుల్ని సామాజిక ఉక్కు పంజాలో బంధించి, వారి అసలు వ్యక్తిత్వాన్ని అణగదొక్కి అనేక వ్యక్తులు కొందరు వ్యక్తుల చేతుల్లో జీవంలేని యంత్రాల్లా మారిపోవడాన్ని నిరసిస్తుంది. ఇలాంటి జీవిత విధానానికి దోహదపడే ఏ విధమయిన సామూహిక వ్యవస్థనూ, సామాజిక సంక్షేమం పేరుతో ప్రారంభమయ్యే ఏ విధమయిన పథకాన్నీ మరే ఉపాయాన్నీ ఇష్టపడదు.

మానవుని వ్యక్తిత్వానికి సరయిన రీతిలో పోషణ, పెరుగుదల జరగాలన్నా, అతని వ్యక్తిత్వం పరిణతి చెందాలన్నా అతనికి ఆలోచన, ఆచరణల స్వేచ్ఛలేనిదే సాధ్యపడదు. ఈ లక్ష్యానికి కేవలం భావస్వాతంత్ర్యం, రచన, భావ ప్రకటనా స్వాతంత్ర్యాలు, కృషించే శ్రమించే స్వాతంత్ర్యాలు సంఘాలు ఏర్పరచుకునే స్వాతంత్ర్యం మాత్రమే చాలవు. ఆర్థిక స్వాతంత్ర్యం కూడా అవసరం. ఇదొక స్వాభావికమయిన వాస్తవికత. దీన్ని నిర్ధారించడానికి పెద్ద పెద్ద చర్చలు జరిపే అవసరం లేదు. కేవలం ఇంగిత జ్ఞానమే చాలు దీన్ని అర్థం చేసుకోడానికి. దారిన పోయే దానయ్యకూడా తెలుసు ఎవరికి ఆర్థిక స్వాతంత్ర్యం లేదో అతడికి వాస్తవానికి మరే స్వాతంత్ర్యమూ లేదనీ, ఇంకా అతనికి

అభిప్రాయ స్వాతంత్ర్యమయినా నోటితో, కలంతో బావప్రకటనా స్వాతంత్ర్యమయినా, శ్రమించే స్వాతంత్ర్యమయినా లేవని. కనుక మానవతకై అత్యుత్తమ సామాజిక స్థితి ఏదయినా ఏర్పాటా లంటే అందులో ఓ సామాన్యుడికి తన అంతరాత్మను అమ్ముకో కుండా తన కాళ్ళు చేతుల పరిశ్రమ ద్వారా రెండు పూటల భుక్తిని సంపాయించుకునే చాలినన్ని అవకాశాలు ప్రాప్తం కావాలి.

పారిశ్రామిక విప్లవ కాలంలో ఇలాంటి అవకాశాలు అరుదై పోయ్యాయి. భారీ పరిశ్రమలు, పెద్ద వాణిజ్య సంస్థలు, పెద్ద పెద్ద వ్యవసాయ క్షేత్రాలు కలిసి వ్యక్తిగత వృత్తి పనులవాళ్ళ కొరకు, చేతి పనులవాళ్ళ కొరకు, చిన్న చిన్న వ్యాపారుల కొరకు, సన్నకారు వ్యవసాయదారుల కొరకు జీవన రంగాన్ని ఎంతో స్వల్ప తరం చేసివేశాయి. ఈ సన్నకారు ప్రజలు వారి సమక్షంలో తమ వృత్తులు స్వేచ్ఛగా విజయవంతంగా నడుపుకోలేరు, అయినప్పటికీ ఉత్పాదనా సాధనాల వ్యక్తిగతస్వామ్యం ఉన్న వ్యవస్థలో, ఏ కాస్త ఆర్థిక స్తోమత ఉన్న వ్యక్తులకయినా స్వేచ్ఛగా తమ సొంత పారిశ్రామిక లేక వ్యావసాయిక సంస్థలు నెలకొలుపుకునే అవ కాశాలు మెండుగా ఉంటాయి. ఎలాంటి ఆర్థిక స్తోమతలేని వారైనా కనీసం ఒక వ్యక్తి వద్ద లేక ఏ సంస్థలోనయినా ఉద్యోగం చెయ్యడం వారి అంతరాత్మకు భారంగా అగుపిస్తే వారు మరో గుమ్మంలో నిలబడగలరు.

కాని ఉత్పాదనా సాధనాలన్నింటినీ సామూహిక ఆస్తిగా పరిగణించే చోట లేదా వ్యక్తిగత ఆస్తులనయితే ఆమోదించి నాజీజం, ఫాసిజం విధానాల ప్రకారం ఆర్థిక వ్యవస్థనంతటినీ

రాజ్యాధికారం కింద, ఓ బృహత్తర బహుళార్ధ పథకం కింద నడిపే చోటనయితే వ్యక్తుల ఆర్థిక స్వాతంత్ర్యం మాత్రం ఏ విధంగానూ మిగలదు. దాని అంతంతోపాటు మానసిక, సామాజిక, రాజకీయ స్వాతంత్ర్యాల ప్రాణం పైపైనే ఎగిరిపోతుంది.

అందువల్ల ఏ జీవన వ్యవస్థ అయితే మానవుని వ్యక్తిగత ప్రత్యేకతను ప్రియతమంగా భావిస్తుందో, మరే వ్యవస్థ అయితే మానవ వ్యక్తిత్వపు ఎదుగుదలను లక్ష్యంగా ప్రాముఖ్యాన్నిస్తుందో దానికి, ఇలాంటి సామూహిక సంక్షేమపు పథకాలను సూత్ర ప్రాయంగా, ఖచ్చితంగా తిరస్కరించడం తప్ప గత్యంతరంలేదు. ఎందుకంటే వాటి ప్రకారం భూమి, పరిశ్రమలు, వాణిజ్యాలను జాతీయ ఆస్తిగా పరిగణించడం, లేదా వాటిపై రాజ్యాధికారం నాజీజం రూపంలో ప్రతిష్ఠింపజేసి, ఒకే కేంద్ర ప్రణాళిక కింద మొత్తం ఆర్థిక యంత్రాన్ని నడపడం జరుగుతోంది.

ఈ విషయంలో ఇస్లామ్ ఈ మార్గాన్నే అవలంబించింది. అది కమ్యూనిజాన్ని మరో కారణంగా కూడా వ్యతిరేకిస్తుంది. అదేమంటే, కమ్యూనిస్టులు ఉత్పాదనా వనరుల్ని వ్యక్తిగత ఆస్తి నుండి తీసి జాతీయ ఆస్తిగా మార్చడానికి హింసా దౌర్జన్యాలు జరుపుతారు. కాని ఒకవేళ తమ పథకాన్ని అమలుపరచడానికి ఇలాంటి దౌర్జన్యపూరితమయిన హింసాకాండను, అన్యాయభరిత మైన దండనా విధానాలను ప్రయోగించకుండా దానికి బదులుగా పరిణామ ప్రధానమయిన సోషలిజంలోని విధానాల ప్రకారం భూముల్ని, పరిశ్రమల్ని, వాణిజ్యాలను శాసనాల ద్వారా క్రమేణ జాతీయ ఆస్తిలోకి మార్చే పద్ధతిని అవలంబించినప్పటికీ ఇస్లామ్ నైజం దాన్ని స్వీకరించడానికి సిద్ధపడదు. ఎందుకంటే

ఇలాంటి వ్యవస్థ తన నైజం ననుసరించి మానవతకే వినాశకరంగా రూపొందుతుంది. అదే విధంగా నాజీజం, ఫాసిజంలోని కట్టుబాట్లు, ప్రణాళికలు సయితమూ ఇస్లామ్ నైజానికి విరుద్ధమయినవే ఎందువల్లనంటే వీటి సామూహిక ప్రయోజనాలేవయినా ఇవి మాత్రం మానవుని ప్రత్యేకత వ్యక్తమవడంలో, దాని వృద్ధివికాసాల్లో, దాని పరిపూర్ణతా మార్గంలో అవరోధాలే.

ఈ విషయాన్ని మరో కోణంలో కూడా పరిశీలించాలి. ఇస్లామ్, మానవునిలో జనింపజేసే మానసిక స్థితికి, నైతికతా దృక్పథాలకు పునాదిరాళ్ళు దైవ భీతి, దైవం ఎదుట అతని జవాబుదారీ భావం. ఈ రెండు గుణాలు ఏ వ్యక్తి లేక ఏ వర్గంలో ఉంటాయో వారిపై సామూహిక వ్యవహారాల నాయకత్వపు భారం వేస్తే, వారు తమ సొంత బరువేకాక దానితోపాటు లక్షలాది మనుషుల బాధ్యతాభారాన్ని సయితం వాళ్ళ భుజాలపై నుండి తీసుకుని తమ భుజాలపై వేసుకునే వ్యవస్థను సంస్థాపించడానికి, దాన్ని నడపడానికి స్వయంగా వారే సిద్ధంకారు.

ఇదే విషయాన్ని మహా ప్రవక్త (సఅసం) ఒకసారి మదీనాలో క్షామం ఏర్పడినప్పుడు అన్నారు. పుర ప్రజలు ఆయనతో, "ధరలు బాగా పెరిగిపొయ్యాయి, మీరు అధికారికంగా వస్తువుల ధరలు నిర్ణయించండి" అని కోరినప్పుడు ఆయన అలా చెయ్యడానికి నిరాకరించారు. దానికి చెప్పిన కారణం ఇది : "నేను దైవాన్ని కలుసుకున్నప్పుడు ఏ ఒక్క వ్యక్తి కూడా నేను

అతని పట్ల అత్యాచారం చేసినట్లు నాకు ప్రతికూలంగా ఫిర్యాదు చేసేవాడు ఉండరాదని నా ప్రబల వాంఛ.*"

దీనికి తోడుగా ఇస్లామ్ ప్రతి విషయంలోనూ మనిషి సహజ స్థితికి చేరువగా ఉండాలని కోరుతుంది. జీవితపు ఏ వ్యవహారంలోనూ కృత్రిమతను అది ఇష్టపడదు. మానవ ఆర్థిక వ్యవహారాల సహజ స్థితి ఏమంటే దైవం భువిపై జీవన భృతి కొరకు సృజించిన వనరుల్ని వ్యక్తులు స్వాధీనం చేసుకుని వ్యక్తిగతంగానూ, సమాజగతంగానూ వాటిని వినియోగించుకోవాలి, వాటి ద్వారా ప్రయోజనం పొందాలి, పరస్పరం వస్తువుల విషయంలోను, సేవల విషయంలోను ఇచ్చిపుచ్చుకోవడాలు స్వేచ్ఛగా జరుపుకోవాలి. ఈ పద్ధతిపైనే ఎంతో కాలం వరకు మానవ ఆర్థిక వ్యవస్థ సాగుతూ వచ్చింది. మనిషి సమాజంలో ఉంటూ ఆర్థిక విషయాల్లో స్వేచ్ఛగా తన జీవిత విషయాల్లో స్థిరంగా ఉండగలగాలంటే ఈ సహజ వ్యవస్థలోనే ఆ అవకాశం లభిస్తుంది. పోతే, పరిపక్వత చెందని మస్తిష్కాలు ఊహించి అనుదినం రచిస్తూ ఉండే చిన్న పెద్ద "ఇజాలు" అన్నీ ఏదో ఒక

* అంటే ఆయన ధరల పెరుగుదలను అలానే వదిలేశారని, దాని నివారణోపాయాల పట్ల శ్రద్ధ వహించలేదని భావం కాదు. నిజానికి ప్రభుత్వం తన కృత్రిమ జోక్యం వల్ల చిక్కులతో కూడుకున్న ధరల వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయడం పట్లనే ఆయన తన అయిష్టతను వ్యక్తపరిచారు. ఆ విధానాన్ని వదలి ఆయన తన శక్తినంతటినీ వ్యాపారుల నైతిక సుశిక్షణ వైపుకు మరల్చారు. నిరంతర ప్రబోధం ద్వారా ధరల్ని కావాలని పెంచడం మహాపాతకమని వారి మనస్సుల్లో చెరగని ముద్ర పడేలా చేశారు. ఈ పద్ధతి బాగా ఉపయోగపడింది. కొంత కాలానికే ధరలు సమ స్థాయికి దిగి రాసాగాయి.

కృత్రిమ వ్యవస్థను ప్రతిపాదిస్తాయి. అందులో మనిషి, ఓ ప్రత్యేక శాశ్వత అస్తిత్వం, ఆత్మగల మనిషిగా, ఓ చైతన్యవంత మయిన వ్యక్తిత్వంగా, ఓ లక్ష్యబద్ధమయిన ప్రాముఖ్యం గల అస్తిత్వంగా జీవించడానికి బదులు, కేవలం సామూహిక వ్యవస్థ యంత్రంలో ఓ పరికరంగా మాత్రం మిగిలిపోతాడు.

కృత్రిమ విధానాల్లా విప్లవ విధానాలను సయితం ఇష్ట పడదు ఇస్లామ్. అజ్ఞాన కాలంలో అరేబియా వాసులు జీవిక సంపాదనకై అనేక విధానాలను అనుసరించేవారు. ఇస్లామ్ వచ్చి వాటిని నిషేధించి ఎంతో హేయమైనవిగా నిర్ణయించింది. కాని ముందుగానే ఉన్న ఆస్తుల్ని వేలెత్తి చూపి ఎవరెవరయితే అధర్మ మార్గాల ద్వారా ధనం సంపాయించారో వారి ఆస్తులు జప్తు కావలసిందే అని ఓ వివాదాన్ని లేవనెత్తలేదు ఇస్లామ్. చివరికి వడ్డీ వ్యాపారులు, వ్యభిచార వృత్తివారు, దోపిడిదారుల గత చర్యలపై కూడా దండించడం జరగలేదు. ఎవరి అధీనంలో ఏదయితే ఉండిందో ఇస్లామ్ సివిల్ చట్టం దానిపై వారి ఆస్తి అధికారాన్ని ఒప్పుకుంది. భావిలో మాత్రం అధర్మపు విధానా లను నిషేధించడం జరిగింది. లోగడ గడించిన ఆస్తుల్ని ఇస్లామీయ వారసత్వపు చట్టం క్రమేణ పంపిణీ చేస్తూ వచ్చింది.

## వ్యాధి నిర్ణయం

పై యదార్థాలను బాగా ఆకళింపు చేసుకున్నాక ఇక కాస్త వెనక్కి తిరిగి మేము ప్రారంభంలో ప్రస్తావించిన చర్యల్ని ఓసారి పునశ్చరణ చేసుకోండి.

వాటిలో మనం గమనించిందేమంటే, పారిశ్రామిక విప్లవ కాలంలో ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రాతిపదికగా ఏర్పడిన ఆర్థిక సూత్రాలు పాతవే. అవి అజ్ఞాత కాలం నుండి మానవ ఆర్థిక వ్యవహారాలకు ఆధారభూతమయినవే. అయినా వాటిలో రుగ్మతలు పొడసూపడానికి మౌలికమయిన కారణాలు నాలుగు. ఇవి పోను పోను గట్టి ప్రతిచర్యకు మూలమయ్యాయి.

మొదటిది, ఈ వ్యవస్థను నెలకొలిపేవారు, నడిపేవారు ఈ సూత్రాల విషయంలో ఎంతో అతిశయానికి గురయ్యారు. అది ఆధునిక పారిశ్రామిక యుగానికి ఏ విధంగానూ సరయినది కాదు.

రెండోది, వారు సహజమయిన సూత్రాలకు తోడుగా కొన్ని తప్పుడు సూత్రాలను కూడా కలిపివేశారు.

మూడోది, వారు సహజమయిన ఆర్థిక వ్యవస్థకు అత్యంత ముఖ్యమయిన కొన్ని సూత్రాలను విస్మరించారు. ఈ సూత్రాలు, పెట్టుబడిదారీ వ్యవస్థకు పునాదులుగా చెప్పబడే ఏడు సూత్రాల కన్నా తక్కువ ప్రాముఖ్యం గలవి కావు.

ఆ తరువాత మనం చాలా విపులంగా పరిశీలించి ఒక వైపు కమ్యూనిజం, సోషలిజం, ఫాసిజం, నాజీజం, రెండో వైపున పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రస్తుత వారసులు ఆ వ్యవస్థ సృష్టించిన చెడుల్ని నివారించడానికి కృషి చేసినట్లు తెలుసుకున్నాము. అవన్నీ వైఫల్యాన్ని ఎదుర్కోవడానికి కారణమేమంటే అవి ఏవీ రోగానికి మౌలిక కారణాలను అసలు అర్థమే చేసుకోలేదు. పూర్వ కాలం నుండి ఆచారంగా వస్తున్న సహజ సూత్రాలనే అసలు రోగ కారణంగా కొందరు భావించారు. వారు దాని

నివారణతోపాటు వ్యక్తిగత స్వేచ్ఛను సయితం 'నివారణ' చేసి వేశారు. మరో వర్గం కేవలం రోగ చిహ్నాల్ని మాత్రం దూరం చెయ్యడానికే తమ శ్రద్ధనంతా అంకితం చేశారు. రోగానికి అసలు మూలమయిన అనేక కారణాలను అలాగే వదిలేశారు. అందువల్ల వారి వ్యవస్థలో వ్యక్తిగత స్వేచ్ఛయితే ప్రాప్తమయింది. కాని, అది సామూహిక ప్రయోజనాల కొరకు హానికరంగానే ఉండిపోయింది. పెట్టుబడిదారీ వ్యవస్థలోని అత్యంత అంధకారమయమయిన కాలంలోనూ అది అంతే హానికరంగా ఉండేది.

ఇప్పుడు ఏ వ్యక్తి అయినా ఈ రోగ నిర్ణయాన్ని కాస్త పరిశీలనగా చూస్తే మానవాళికి వివేకవంతమయిన, సంతులితమైన, సమంజసమయిన వ్యవస్థ అవసరమని ఇట్టే గ్రహించగలుగుతాడు. అది :

ఒకటి, ఆర్థికతకు సంబంధించిన సహజమయిన సూత్రాలనయితే అట్టే పెట్టాలి. ఎందుకంటే అవి వ్యక్తిగత స్వేచ్ఛ కొరకు అవసరమయినవి. అయితే వాటిని ప్రయోగించడంలో అతివాదానికి పోకుండా ఉండాలి. దానికి బదులుగా వ్యక్తుల కృషి, ఆచరణలపై కొన్ని ప్రతిబంధకాలు విధించాలి. వాటివల్ల ఆ స్వేచ్ఛలు సామూహిక ప్రయోజనాలకు హానికరం కాకపోవడమే కాక ఆచరణాత్మకంగా దోహదకరమయినవిగా మారాలి.

రెండు, ఈ సహజ సూత్రాలకు తోడుగా అన్నిరకాల తప్పుడు సూత్రాలను ఆర్థిక వ్యవస్థ నుండి దూరం చేసివెయ్యాలి.

మూడు, ఈ సూత్రాలతోపాటు సహజ ఆర్థిక వ్యవస్థకు కావలసిన ఇతర మౌలిక సూత్రాలను సయితం అమలుపరచాలి.

నాలుగు, వ్యక్తుల్ని, ఈ సహజ సూత్రాల వాస్తవ ఆచరణా పరిధిని అతిక్రమించనివ్వరాదు.

## ఇస్లామీయ చికిత్స

సరిగ్గా ఇదే పద్ధతిని ఇస్లామ్ అవలంబిస్తుంది. అది 'విశృంఖల విపణి'ని 'స్వేచ్ఛా విపణి'గా మార్చివేస్తుంది. ఈ స్వేచ్ఛను కొన్ని పరిమితుల్లో బంధిస్తుంది నాగరిక సామాజిక రంగాల్లో ఇంకా ఇతర రంగాల్లో మానవ స్వేచ్ఛను అది ఏ విధంగా కొన్ని నియమాల్లో బంధిస్తుందో అదే విధంగా ఆర్థిక రంగంలోనూ అది కొన్ని నియమాలను విధిస్తుంది. దీనితోపాటు అది స్వేచ్ఛా విపణిలోనూ పెట్టుబడిదారీ వ్యవస్థలోని హానికరమయిన, దుష్టకరమయిన ప్రత్యేకతలు, ప్రభావాలు, పర్యవసానాలు చొరబడగల ద్వారాలన్నింటినీ మూసివేస్తుంది. ఇప్పుడు ఇస్లామీయ సూత్రాల ప్రకారం ఆర్థిక వ్యవస్థ స్వరూపం ఎలా తయారవుతుందో కాస్త వివరంగా పరిశీలిద్దాము.

## 1. "భూ"స్వామ్యం

ఇతర ఆస్తులన్నిటిలానే భూమిపై కూడా మనిషి వ్యక్తిగతంగా స్వామ్యం కలిగి ఉన్నాడని ఇస్లామ్ అంగీకరిస్తుంది. ఒక వస్తువుపై ఒకానొక మనిషికి స్వామ్యం, అధికారం ప్రాప్తమై అది రుజువవటానికి ఎన్ని చట్టపరమయిన మార్గాలున్నాయో వాటన్నిటి ప్రకారం "భూమి"పై కూడా ఒక వ్యక్తికి స్వామ్యం

అధికారం ప్రాప్తమవుతుంది. దీనికి ఒక హద్దు, పరిమాణం అంటూ లేదు. ఒక చదరపు గజం మొదలుకొని వేల ఎకరాల వరకు భూమి అయినాసరే అది ఒకవేళ చట్టబద్ధంగా అతని అధికారంలోకి వచ్చినట్లయితే అది అతని ధర్మబద్ధమైన ఆస్తియే. అతడు తానే సేద్యం చెయ్యాలన్న నిబంధన కూడా లేదు. ఏ విధంగానయితే ఇల్లు, ఫర్నీచరు అద్దెకు ఇవ్వవచ్చునో, మరే విధంగానయితే వ్యాపారంలో భాగస్వామ్యం పొందవచ్చునో అదే విధంగా భూములు కూడా "అద్దె" (కౌలు)కు ఇవ్వవచ్చు. అందులోనూ భాగ్యస్వామ్యపు (పంపకం) నియమం ప్రకారం సేద్యం కూడా సాధ్యమే. ఎవరయినా అద్దె లేకుండా, లేక వాటా తీసుకోకుండా తన భూమిని ఎవరికయినా సేద్యం చేసుకోడానికి ఇస్తే అది దానమనబడుతుంది. కాని కౌలుకయినా, పాలుకయినా సేద్యపు వ్యవహారం చెయ్యడం ధర్మబద్ధమయినదే— ఏ విధంగానయితే వ్యాపారంలో భాగస్వామ్యం లేక అద్దె కొరకు ఏదయినా వస్తువునివ్వడం ధర్మబద్ధమో అదే విధంగా ఇదీ ధర్మబద్ధమే, అయితే భూస్వామ్య వ్యవస్థ (జాగీర్దారీ వ్యవస్థ)లోని రుగ్మతల మాటకు వస్తే అవన్నీ ఆ వ్యవస్థ వల్ల పట్టినవే కావు అందువల్ల వాటిని పరిష్కరించడానికి అసలు భూమిపై నుండి వ్యక్తిగత ఆస్తి విధానాన్నే రద్దు చెయ్యడం కూడా సరయిన పద్ధతి కాదు, లేక దానిపై కృత్రిమంగా "భూసంస్కరణల" పేరుతో పరిమితులు విధించడం కూడా సరికాదు. కొందరు సగం తెలిసిన వైద్య పుంగవులు ఈ విధానాన్ని ప్రతిపాదిస్తున్నారు. ఇస్లామ్ ప్రకారం ఈ రుగ్మతల పరిష్కారం ఇది :

(1) భూమి క్రయవిక్రయాలపై ఉన్న ఆంక్షలన్నీ ఎత్తి వేయాలి. ఇతర వస్తువుల్లా దాని లావాదేవీలు కూడా విచ్చలవిడిగా జరగాలి.

(2) వ్యవసాయదారులు (కమతగాళ్ళు), వ్యవసాయదారులు కానివారు (కామందులు) అన్న విభేదాన్ని వర్గ విభజనను ఏ రూపంలోనూ లేకుండా ఎత్తివెయ్యాలి.

(3) నేడు భూస్వాములకు ఉన్న ప్రత్యేక రాయితీలు, హక్కులు కూడా చట్టబద్ధంగా తొలగించివెయ్యాలి.

(4) భూస్వాములు, వ్యవసాయదారుల మధ్య విధులు, హక్కులను చట్టబద్ధంగా నిర్ణయించాలి. ఆ హక్కులు తప్ప మరెలాంటి హక్కులు భూస్వాములకు తమ కమతగాళ్ళపై ఉండరాదు.

(5) భూస్వామ్యం, వ్యవసాయానికి సంబంధించిన ఒక్క విధానం మాత్రం అమలులో ఉండాలి, దాని ప్రకారం కామందులు మరియు కమతగాళ్ళు కేవలం వ్యాపారంలోని భాగస్వాముల్లానే వ్యవహరించాలి. ఒకవేళ దీన్ని అధిగమించి భూస్వామ్యం అత్యాచారానికి ప్రతిరూపంగా మారితే, లేక రాజ్యం ఏలే మరో రాజ్య వ్యవస్థగా మారితే లేదా దాన్ని అక్రమంగా రాజకీయ అధికార ప్రాప్తి కొరకు మార్గంగా వినియోగించుకోవడం జరిగితే— అది ధర్మబద్ధమయిన భూస్వామ్యం కాదు గనక, దానికి వ్యక్తిగత ఆస్తికి లభించవలసిన రక్షణ లభించరాదు. రక్షణ కేవలం ధర్మబద్ధమయిన భూస్వామ్యానికే ప్రాప్తం కావాలి.

(6) వారసత్వపు వ్యవహారంలో అజ్ఞానపు ఆచారాలన్నింటినీ అంతమొందించాలి. జమీందారుల ప్రస్తుత ఆస్తుల్ని

షరీఅత్ ప్రకారం వారి బ్రతికున్న వారసులకు పంపకం చేసి వెయ్యాలి. భవిష్యత్తులో సేద్యపు భూములకు సంబంధించిన ఇస్లామియ వారసత్వపు చట్టాన్ని సరిగ్గా అమలు జరపాలి.

(7) భూమిని బంజరుగా వదలివెయ్యడాన్ని నిషేధించాలి. ఉదాహరణకు ప్రభుత్వంవారు ఎవరికయినా భూమిని ఇనాముగా బహూకరిస్తే దాన్ని అతను మూడేళ్ళ కంటే అధికంగా బీడుగా ఉంచినట్లయితే అప్పుడు ఆ ఇనామును రద్దు చెయ్యాలి. ఇంకా ఏ సొంత భూములయితే బీడుగా వదలివెయ్యబడతాయో వాటిపై ఓ నిర్ణీత కాలం తరువాత ప్రత్యేక పన్నులు విధించాలి.

(8) జమీందారులు, వ్యవసాయదారుల నుండి ఉత్పత్తిలోని ఓ నిర్ణీత భాగాన్ని వసూలు చేసి వాటిని ప్రత్యేక లక్ష్యాల కొరకు వినియోగించాలి. (ఆ లక్ష్యాలు జకాత్ శీర్షిక కింద ముందు వస్తున్నాయి).

(9) కొత్త శాస్త్రీయ పద్ధతిలో భారీ ఎత్తున వ్యవసాయం చెయ్యదలచుకుంటే దాని కొరకు సహకార సంస్థలు స్థాపించుకోవాలి. వాటిలో చిన్న చిన్న భూస్వాములు తమ భూస్వామ్యపు హక్కుల్ని భద్రపరచుకుంటూ పరస్పరామోదంతో తమ ఆస్తుల్ని ఓ పెద్ద వ్యవసాయ క్షేత్రంగా మార్చుకొని కలిసిమెలసి ఓ సంస్థలా ఆ వ్యవహారాన్ని నడిపించుకోవచ్చు

ఈ "సంస్కరణలు" జరిపిన తరువాత కూడా భూస్వామ్యంలో ఏదైనా చెడుగు మిగులుతుందా ? అలాంటి చెడుగును ఎవరైనా సహేతుకంగా సూచించగలరా ??

ఆ. అ. సి. (10)

# 2. ఇతర ఉత్పాదనా సాధనాలు

వినియోగపు వస్తువులు, ఉత్పాదనా సాధనాల్లో వ్యత్యాసాన్ని పాటించదు ఇస్లామ్. ఒకదానిపై వ్యక్తిస్వామ్యం ధర్మ సమ్మతం చేసి మరోదానిపై వ్యక్తిస్వామ్యాన్ని అధర్మంగా నిర్ణయించదు. ఒక వ్యక్తి ఇతరులకై నిత్యావసర వస్తువులు తయారు చేసి లేక సమకూర్చి వాటిని వాళ్ళకు అమ్మడం ఇస్లామ్ ప్రకారం పూర్తిగా ధర్మసమ్మతమయిన విషయమే. అతడు ఈ పని తాను స్వయంగా నూ చెయ్యగలడు, ఇతరుల ద్వారా వారికి వేతనమిచ్చి కూడా చేయించగలడు. ఈ సరకు తయారీలో లేక వాటిని సమకూర్చడానికి అతడు వినియోగించే ముడిసరకుపై, యంత్రాలపై, కర్మాగారాలపై వాటన్నిటిపై అతడు స్వామ్యం కలిగి ఉండగలడు. ఇదంతా పారిశ్రామిక విప్లవానికి పూర్వం ఏ విధంగానయితే ధర్మసమ్మతమయిందో అదే విధంగా ఇప్పుడు కూడా ధర్మసమ్మతమయిందే. అయితే విశృంఖల పరిశ్రమలు, వాణిజ్యం నడపడం మునుపయినా సరయిన విధానం కాదు, ఇప్పుడయినా అది అధర్మమే. దాన్ని ఇస్లామీయ సూత్రాల ప్రకారం దిగువ పేర్కొన్న నియమాలకు అనుగుణంగా మలచవలసి ఉంటుంది.

(1) కొత్తగా కనిపెట్టిన ఏదయినా వస్తువును అది మానవ శక్తికి బదులుగా యాంత్రిక శక్తితో పని చేసేదయితే, దాన్ని బాగా పరిశీలించనంతవరకు పరిశ్రమల్లో వినియోగించే అనుమతినివ్వకూడదు. ఆ పరిశీలనలో అది ఎందరు మనుషుల జీవికపై ప్రభావం చూపుతుంది అన్న విషయాన్ని కూలంకషంగా

చూతాలి. దాని ప్రభావానికి గురయ్యేవారి జీవికకు ప్రత్యామ్నాయంగా చెయ్యబడే ఏర్పాట్లేమో అన్న విషయాన్ని సంతృప్తికరంగా గమనించాలి.

(2) ఉద్యోగులు, యాజమాన్యం మధ్యన హక్కులు, విధులు, ఉద్యోగ నిబంధనల వివరాలయితే ఇరువర్గాల పరస్పర ఆమోదం ప్రకారమే జరుగుతాయి. కాని ప్రభుత్వం ఈ వ్యవహారంలో న్యాయం కలగటానికి కొన్ని సూత్రాలు నిర్ణయించాలి. ఉదాహరణకు ఒక ఉద్యోగికి అధమాతి అధమ వేతనం, లేక కూలి ప్రమాణం, పనిచేసే అత్యధిక కాల పరిమితి, వ్యాధిగ్రస్తుడయితే చికిత్స, అంగ నష్టం కలిగితే పరిహారం, పూర్తిగా పని చేసే అర్హత కోల్పోతే పింఛను హక్కు ఇత్యాది విషయాలు.

(3) ఉద్యోగికీ, యాజమాన్యానికీ మధ్యన తలెత్తిన తగాదాల పరిష్కారానికి తీర్పు చెప్పడంలో ప్రభుత్వం బాధ్యత వహించాలి. దానిగ్గాను పరస్పర అవగాహనకై, మధ్యవర్తిత్వానికై న్యాయస్థానానికి వెళ్ళేందుకు ఒక నియమావళిని నిర్ణయించాలి. దాని ద్వారా సమ్మెలు, లాకౌటులు చేసే అవసరమే ఏర్పడకూడదు.

(4) వ్యాపారంలో దొంగ నిల్వలు (Hoarding), సాహస వ్యాపారాన్ని (Speculation), వ్యాపార జూదాన్ని, పరోక్షపు వడ్డీని కూడా పూర్తిగా నిషేధించాలి. ధరలు కృత్రిమంగా పెరిగే విధానాలన్నింటినీ చట్టపరంగా నిషేధించాలి.

(5) ఉత్పాదనను ఇష్టపూర్వకంగా నాశనం చెయ్యటాన్ని అపరాధంగా నిర్ణయించాలి.

(6) పరిశ్రమలు, వ్యాపారాల్లోని ప్రతి విభాగాన్ని వీలై నంతవరకు పోటీ కొరకు తెరచి ఉంచాలి. తద్వారా గుత్తాధి పత్యం వల్ల ఒక వ్యక్తికయినా లేక ఒక వర్గానికైనా ఇతరులెవ్వరికీ ప్రాప్తంకాని హక్కులు లభించకుండా ఉండాలి.

(7) ప్రజల నైతికతపై లేక ఆరోగ్యంపై చెడు ప్రభావం వేసే ఎలాంటి పరిశ్రమనయినా లేక వాణిజ్యానికయినా అనుమతి ఉండరాదు. ఒకవేళ ఇలాంటి వస్తువేదయినా ఏ కారణంచేత నయినా అవసరమయితే దాని పరిశ్రమకు, క్రయ విక్రయానికి అవసరం మేరకు ప్రతిబంధకాలు విధించాలి.

(8) ప్రభుత్వం నాజీజం విధానాన్ని అనుసరించి పరిశ్రమల్ని, వాణిజ్యాన్ని మొత్తం తన అధీనం (Control)లోకి తీసుకోరాదు కాని మార్గదర్శకత్వం, సమన్వయం మాత్రం చేస్తూ ఉండాలి తద్వారా దేశంలో పరిశ్రమలయినా, వాణిజ్య మయినా పెడమార్గాన పోకుండా చూడాలి. ఇంకా ఆర్థిక జీవితానికి సంబంధించిన వివిధ విభాగాల్లో సామరస్యం కూడా ఏర్పడేలా జాగ్రత్తపడాలి

(9) ఇస్లామీయ వారసత్వపు చట్టం ద్వారా జమీందారుల మాదిరిగానే పారిశ్రామికుల వద్ద వ్యాపారుల వద్ద ప్రోగయిన సంపత్తి కూడా నిరంతరం విభజించబడుతూ ఉండాలి. అప్పుడే శాశ్వత ధనవంతుల వర్గాలు ఏర్పడడానికి ఆస్కారముండదు.

(10) వ్యవసాయదారుల మాదిరిగానే వ్యాపారులు, పారిశ్రామిక వర్గంవారు. ఇతర వాణిజ్యకారుల నుండి కూడా వారి

ఆదాయంలోని ఓ భాగాన్ని జకాత్ శీర్షిక కింద ప్రస్తావించబడే ఆశయాల కొరకు తప్పనిసరిగా ధనం వసూలు చెయ్యాలి.

# 3. ఆర్థిక వ్యవహారాలు

ఆర్థిక విషయంలో ఇస్లామ్ వ్యక్తుల హక్కుల్ని అంగీకరిస్తుంది. వ్యక్తులు తమ రాబడిలో నుండి, తమ ఖర్చులు పోగా మిగిలిన ధనాన్ని కూడబెట్టడానికయినా, ఇతరులకు ఋణాలు ఇవ్వడానికయినా, ఏదయినా వ్యాపారం చెయ్యడానికయినా లేక ఏదయినా పరిశ్రమలో, వ్యాపారంలో పెట్టుబడి పెట్టి అందులో లాభనష్టాల భాగస్వాములవడానికయినా పరిపూర్ణ స్వాతంత్ర్యం కలిగి ఉన్నారు. వారికి ఆ హక్కు ఉంది. 'ఇస్లామ్ దృష్టిలో జనులు తమ ఆదాయంలోని మిగులు ధనాన్ని సత్కార్యాల్లో వినియోగించడమే వాంఛనీయమయినా అది పైన పేర్కొన్న విధానాలను సయితం ధర్మమయినవిగా పరిగణిస్తుంది. అయితే ఈ కొన్ని నిబంధనలను వారు పాటించవలసి ఉంటుంది.

(1) కూడబెట్టేటట్లయితే, కూడబెట్టిన ధనంలోని రెండున్నర శాతం ధనం ఏటేటా "జకాత్" కింద పేర్కొన్న కార్యాల్లో వినియోగించడానికి తప్పనిసరిగా చెల్లించాలి. వారు మరణించిన తరువాత వారి ఆస్తి మొత్తం ఇస్లామీయ వారసత్వపు చట్టం ప్రకారం వారసుల్లో పంపిణీ జరగాలి.

(2) ఋణంగా ఇచ్చిన పక్షంలో వారు కేవలం తమ అసలును మాత్రమే తిరిగి పొందగలరు. ఎలాంటి పరిస్థితిలోనూ వారు వడ్డీకి అర్హులు కారు. అప్పు తీసుకునే వ్యక్తి తన సొంత

ఖర్చులగ్గాను తీసుకున్నా లేక ఏదయినా పరిశ్రమలో పెట్టుబడి పెట్టడానికి తీసుకున్నా ఇచ్చినవారు వడ్డీ మాత్రం తీసుకోరాదు. అలాగే తాను ఇచ్చిన ధనం తిరిగి వస్తుందనడానికి నమ్మకంగా, పుచ్చుకునేవారి నుండి ఏదయినా భూమిగాని మరేదయినా ఆస్తిని గాని తాకట్టు పెట్టుకుంటే దాని ద్వారా కూడా ఎలాంటి లాభం పొందడానికి వీల్లేదు. "అప్పు" మీద ఎలాంటి లాభం పొందినా అది వడ్డీ కిందే వస్తుంది. అది ఏ రూపంలోనూ తీసుకోడానికి వీల్లేదు. అలాగే ఒక వస్తువును నగదుగా కొన్నప్పుడు ఒ ధర, అప్పుగా కొన్నప్పుడు అధిక ధర కూడా నిషిద్ధమే.

(3) పరిశ్రమ, వ్యాపారం లేక వ్యవసాయంలో స్వయంగా పెట్టుబడి పెట్టిన పక్షంలో క్రితంలో భూమి మరియు ఇతర ఉత్పాదనా మార్గాల విషయంలో ప్రస్తావించిన నిబంధనల్ని పాటించవలసి ఉంటుంది.

భాగస్వామ్య విధానాన్ని అనుసరించిన పక్షంలో తప్పనిసరిగా లాభనష్టాలను సమంగా భరించవలసి ఉంటుంది. నిర్ణీత నిష్పత్తిలో రెంటిలోనూ భాగం పంచుకోవలసి ఉంటుంది. పెట్టుబడి పెట్టేవాడు కేవలం లాభంలోనే భాగం పంచుకుని నిర్ణీత రేటు ప్రకారం తప్పనిసరిగా లాభం పొందే ఏ విధానం ప్రకారం వాటాదారులుగా చేరినా అది చట్టరీత్యా నిషిద్ధమే అవుతుంది.

# 4. జకాత్

ఇస్లామ్ సమాజంలోని వ్యక్తులకు ఉద్యోగం, బ్రతుకు తెరువును కల్పించే బాధ్యత ప్రభుత్వంపై వెయ్యాదు. ఎందు

కంటే ఉద్యోగ కల్పనా బాధ్యత అన్నది ఉత్పాదనా వనరులపై సామూహిక అధీనం పొందనంతవరకు, కనీసం నాజీజం లాంటి ఆధిపత్యం లేనంతవరకు సాధ్యపడదు. ఈ విధానాల కీడుల్ని ఇంతకుముందే చర్చించాము. అయితే సామూహిక జీవితంలో వ్యక్తుల్ని పూర్తిగా విస్మరించడాన్ని వారిని వారి సొంత వనరులపై సొంత పరిస్థితులపై వదిలెయ్యటాన్ని, ఆపదలకు గురయినవారిని ఆదుకునేవారు ఎవరూ లేకపోవడాన్ని కూడా ఇస్లామ్ సరయిన పద్ధతిగా భావించదు. అది ఒక వైపు ప్రతి వ్యక్తిపై వ్యక్తిగతంగా నైతిక బాధ్యతను మోపుతుంది. అతడు తనవారనక, పరాయి వారనక ఏ వ్యక్తిని సహాయానికి అర్హుడుగా భావించినా అతన్ని తన తాహతు మేరకు ఆదుకోవాలని ఇస్లామ్ సూచిస్తుంది. మరో వైపు అది పారిశ్రామికవేత్తలు, వ్యాపారులు, భూస్వాములు తమ వ్యవహార క్షేత్రాల్లో పనిచేసేవారి హక్కుల్ని సక్రమంగా నిర్వర్తించాలని కోరుతుంది. వీటన్నింటినీ మించి అది, మొత్తం సమాజంపై, ప్రభుత్వంపై దాని పరిధుల్లో ఉండే వ్యక్తుల బాధ్యతా భారాన్ని మోపుతుంది. ఏ వ్యక్తి అయినా కనీస జీవన అవసరాలు కొరవడి బాధపడకుండా అవి జాగ్రత్తపడాలని సూచిస్తుంది.

సమాజంలో ఎవరయితే ఉపాధిని కోల్పోతారో, ఏదైనా తాత్కాలిక కారణంచేత పని చెయ్యలేకపోతారో, లేక శాశ్వతంగా పనికి అర్హత కోల్పోతారో, లేక ఏదయినా దుర్ఘటన లేక ప్రమాదానికి గురవుతారో వారందరినీ ఆదుకోవడం ప్రభుత్వ బాధ్యత. అనాథులయిన బాలుర సంరక్షణ ప్రభుత్వ విధి. చివరికి ఎవరయినా ఋణగ్రస్తుడై తన ఋణం చెల్లించలేకపోతే కడకు దాన్ని

చెల్లించవలసింది ప్రభుత్వమే. ఇది సోషియల్ ఇన్సూరెన్స్‌కు సంబంధించిన చాలా విస్తృతమయిన పథకం. దీన్ని నేరుగా ప్రభుత్వ నిర్వహణకిందే అమలుపరచవలసి ఉంటుంది. దీనికిగ్గాను నిధుల్ని సమకూర్చే ఏర్పాట్లు దిగువన పేర్కొన్న విధంగా చేస్తుంది ఇస్లామ్.

(1) ఓ నిర్ణీత హద్దుకు మించి ధనాన్ని సమీకరించి ఉంచిన వ్యక్తి తన ఆస్తిలో నుండి రెండున్నర శాతం జకాత్ విధిగా చెల్లించాలి.

(2) ప్రతి భూస్వామి, వ్యవసాయదారుడు వర్షం ద్వారా పండించే పంటలో 10 శాతం, మోటు ద్వారా లేక నీటి కాలువల ద్వారా పండించే పంటలో 5 శాతం ఈ పద్దులో జమచెయ్యాలి.

(3) ప్రతి పారిశ్రామికుడు, ప్రతి వ్యాపారి ప్రతి సంవత్సరం చివరలో తన వ్యాపార సరకు విలువలో రెండున్నర శాతం చెల్లించాలి.

(4) పశువుల్ని పెంచుకునేవారు పరిమిత సంఖ్యకన్నా అధికంగా పశువులను కలిగి ఉంటే ఓ ప్రత్యేక లెక్క ప్రకారం తన పశు సంపదలోని ఓ భాగాన్ని ప్రభుత్వానికి ఇవ్వాలి.

(5) ఖనిజ సంపదలు, గుప్త నిధుల నుండి కూడ అయిదో వంతు ప్రభుత్వం తీసుకుంటుంది.

(6) ఎప్పుడయినా యుద్ధం సంభవిస్తే యుద్ధ ప్రాప్తిలో నుండి 20 శాతం ఈ పద్దులోకి తీసుకోవాలి.

(7) ఈ ధనమంతా, దివ్య ఖుర్ఆన్‌లో "జకాత్" మరియు 'ఖుమ్స్'ను ఖర్చు పెట్టేందుకు నిర్దేశించిన పద్దుల్లో వ్యయపరచ

బడుతుంది. దాని ఓ పెద్ద భాగమే మేము పైన ఉదాహరించిన సోషల్ ఇన్సూరెన్స్ పథకం.

# 5. ప్రభుత్వ పరిమిత జోక్యం

ప్రభుత్వమే స్వయాన పారిశ్రామికునిలా, వ్యాపారునిలా, భూస్వామిలా వ్యవహరించడాన్ని ఇస్లామ్ సూత్రప్రాయంగా అంగీకరించదు. ఇస్లామ్ ప్రకారం, ప్రభుత్వం మార్గం చూపాలి. న్యాయం నెలకొల్పాలి, చెడుల్ని అరికట్టాలి. సాంఘిక సంక్షేమం కొరకు కార్యక్రమాలు చేపట్టాలి. అంతేకాని, రాజకీయ శక్తితో పాటు వాణిజ్యాన్ని జతపరిస్తే బయల్పడే దుర్గుణతలు అసంఖ్యాకం. కనుక ఈ పద్ధతిలోని కొన్ని బాహ్యపరముయిన లాభాల కొరకు దీని చెడుల్ని సహించడానికి ఇస్లామ్ సిద్ధంగా లేదు. కాని అది కేవలం కొన్ని రకాల పరిశ్రమల్ని, వ్యవహారాలను మాత్రం ప్రభుత్వం ఆధీనంలో ఉంచడం భావ్యమని భావిస్తుంది. అలాంటివి జాతి జీవనానికి అత్యవసరమైనవై ఉండాలి; అయితే వాటిని నడపడానికి వ్యక్తులు స్వయంగా ముందుకు రాకపోతే లేక వ్యక్తుల చేతుల్లో అవి ఉండటం సామూహిక ప్రయోజనాల దృష్ట్యా నష్టకరమయితే ఇస్లామ్ వాటిని ప్రభుత్వ ఆధ్వర్యాన నడపడానికి అనుమతిస్తుంది. ఇలాంటి వ్యవహారాలు కాక ఇతర పారిశ్రామిక, వాణిజ్య కార్యక్రమాలను దేశ ప్రగతి, సంక్షేమాల దృష్ట్యా ప్రభుత్వం స్వయంగా నడపదలిస్తే వాటిని చాలావరకు విజయవంతంగా నడిపి తరువాత ఆ వ్యవహారాలను వ్యక్తుల హస్తగతం చెయ్యడానికి అది ప్రయత్నించాలి.

## సమతూకపు ఆర్థిక వ్యవస్థ

ఈ పరిమితులు, నియమాలు, ఈ సంస్కరణాత్మక విధానాలను మేము "ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ" శీర్షికలో సూచించిన 7 సహజసిద్ధమయిన సూత్రాలతో జోడించినట్లయితే వీటి ద్వారా భూస్వామ్య వ్యవస్థ, పెట్టుబడిదారి వ్యవస్థల్లోని చెడులన్నిటి నివారణ కాగలదు. అప్పుడు అది ఓ సమతూకం గల ఆర్థిక వ్యవస్థగా రూపొందుతుంది. అందులో వ్యక్తిగత స్వేచ్ఛ, సామూహిక సంక్షేమం రెండూ సమంగా న్యాయవంతంగా సమన్వయం పొందగలుగుతాయి. నేటి పారిశ్రామిక విప్లవం తెచ్చిన ప్రగతి వేగంలో ఏ మాత్రం తగ్గుదల జరక్కుండా ఇది సాధ్యమే.

ఈ సంతులిత ఆర్థిక వ్యవస్థకు నాలుగు మౌలిక సూత్రాలు ప్రాతిపదికలు.

(1) కొన్ని చట్టపరమయిన, వ్యావహారికమైన పరిమితులకు, పరిధులకు కట్టుబడి స్వేచ్ఛా విపణిని అనుమతించడం.

(2) జకాత్ విధిగా నియమించడం.

(3) వారసత్వపు చట్టాన్ని అమలుపరచడం.

(4) వడ్డీని నిషేధించడం,

## ఆమోదయోగ్యం

వీటిలో మొదటి అంశాన్ని సూత్రప్రాయంగానయినా అందరూ సరయినదేనని ఒప్పుకుంటున్నారు. కనీసం ఎవరయితే విశృంఖల పెట్టుబడిదారీ వ్యవస్థలోని చెడుల్ని, కమ్యూనిస్టు

ఫాసిస్టు రుగ్మతల్ని స్పష్టంగా చూడగలుగుతున్నారో వారంతా దీన్ని అంగీకరిస్తున్నారు. దీని వివరాలకుపోతే కొన్ని చిక్కులు ఉత్పన్నమవుతున్న మాట నిజమే. కాని మేము ప్రస్తుత శీర్షికలో భూమి, ఇతర ఉత్పాదనా వనరులు అంశం కింద ఇచ్చిన వివరణలు చదివాక ఇలాంటి చిక్కులు దూరమై ఉంటాయని మేము నమ్ముతున్నాం.

రెండో అంశంలోని ప్రాధాన్యత నేడు చాలావరకు ప్రపంచం ముందుకు ప్రస్ఫుటంగా వచ్చిందనే చెప్పవచ్చు. కమ్యూనిస్టు వ్యవస్థ అయినా, ఫాసిజం అయినా లేక ప్రజాస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థ అయినా ఈ మూడు వ్యవస్థలు ప్రతిపాదించిన విస్తృత సోషల్ ఇన్సూరెన్స్ పథకాలకన్నా విస్తృత ప్రాతిపదికపై సామూహిక ఇన్సూరెన్స్‌ను 'జకాత్'వ్యవస్థ సమకూర్చుతుంది. 'జకాత్, వ్యవస్థను కాస్త క్షుణ్ణంగా పరిశీలిస్తేనే ఈ విషయం బోధపడుతుంది. చిక్కులేమయినా ఏర్పడితే అవి కేవలం జకాత్‌కు సంబంధించిన ఆదేశాలు పూర్తి వివరంగా తెలియకపోవడం చేతనే ఏర్పడుతాయి.

## అభ్యుదయవాదుల తిరోగమనం

మూడో అంశానికి సంబంధించినంతవరకు ప్రపంచంలోని వారసత్వపు చట్టాలన్నింటికీ భిన్నమయిన విధానాన్ని అవలంబించింది ఇస్లామ్. దాని మర్మ హేతువును ప్రారంభంలో చాలామంది గ్రహించలేకపోవడంచేత రకరకాల ఆక్షేపణలు చేసేవారు. కాని నేడు క్రమంగా ప్రపంచం మొత్తం ఈ వైపుకే మరలుతోంది.

చివరికి కమ్యూనిస్టు రష్యా కూడా ఈ పద్ధతినే అవలంబించవలసి వచ్చింది.*

## అరిష్టాలన్నిటికీ మూలం

ఇకపోతే నాల్గవ అంశాన్ని అర్థం చేసుకోవడం నేటి ప్రజలకు చాలా కష్టమయిపోయ్యింది. బూర్జువా ఆర్థిక శాస్త్రం గత శతాబ్దాల్లో వడ్డీకి సంబంధించిన భావనను చాలా లోతుగా నాటి వేసింది. అది, వడ్డీని నిషేధించడం కేవలం భావోద్రేకాలకు సంబంధించిన విషయమని, ఎవరికయినా వడ్డీ లేకుండా రుణమివ్వడమన్నది కేవలం ఓ నైతిక రాయితీ మాత్రమే అని, మతం దీన్ని ఎంతో అతిశయంతో వాంఛించడంలో ఏ మాత్రం అర్థం లేదని, వాస్తవానికి హేతుబద్ధంగా చూస్తే వడ్డీ చాలా సమంజసమే

* సోవియట్ రష్యాలో నేటి వారసత్వపు చట్టం ప్రకారం సంతానం, భార్య, భర్త, తల్లిదండ్రులు, సోదరులు, సోదరీలు, పెంపుడు సంతానం కూడా వారసత్వానికి హక్కుదారులుగా నిర్ణయించడం జరిగింది. ఇంకా, మనిషి తన ఆస్తిని తన బంధుగణంలోని అగత్యపరులకు లేక ప్రజాసంస్థలకు పంచిపెట్టేందుకు వీలునామా వ్రాసిపెట్టగలడని నియమం ప్రవేశపెట్టడం జరిగింది. అయితే వారసులయిన బంధువుల హక్కుకు ప్రాధాన్యత ఉంటుంది. దీనికి తోడుగా ప్రాజ్ఞతకు చేరని సంతానాన్ని, నిరుపేద బంధువుల్ని వారసత్వపు హక్కు నుండి దూరం చేసే వీలునామా నిషేధించబడింది. ఈ చట్టాన్ని చూచి ఎవరయినా ఇట్టే గ్రహించగలడు— క్రీ.శ. 625లో నిర్మించిన చట్టాన్ని, కమ్యూనిస్టు "అభ్యుదయవాదులు" తిరోగమించి 1945లో అనుసరిస్తున్నారని !

కాక ప్రయోజనకరం, అవసరమయింది కూడా అని ప్రచారం చేసింది.

ఈ తప్పుడు సిద్ధాంతం, దీని ముమ్మర ప్రచారం మూలంగా, ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థలోని ఇతర లోపాలన్నీ విమర్శకులందరికీ అగుపడతాయి. కాని ఈ భయంకరమయిన మౌలికమయిన లోపం వైపు ఎవరి దృష్టి పోదు. చివరికి కమ్యూనిస్టు రష్యా కూడా ఈ "అరిష్టాల మూలాన్ని" బ్రిటన్, అమెరికాల్లా పెంచిపోషిస్తోంది.

## ముస్లిములు కూడా...

ఇంకా శోచనీయమైన విషయమేమంటే ప్రపంచాన వడ్డీకి పరమ శత్రువులు కాగల ముస్లిములు సయితం పాశ్చాత్యుల ఈ తప్పుడు ప్రచారానికి అతి ఘోరంగా గురి అయ్యారు. పరాజయ పరమయిన మన ధార్మిక వర్గంలోనూ సామాన్యంగా ఓ అపార్థం వ్యాపించింది. అదేమంటే వడ్డీ ఒకవేళ అభ్యంతరకరమయిన విషయమే అయినా, కేవలం తమ సొంత ఖర్చులకు అప్పు తీసుకునేవారి వద్ద నుండి వడ్డీ తీసుకునే పక్షంలోనే అది వర్తిస్తుంది. కాని, వ్యాపారంలో మదుపు పెట్టడానికి గ్రహించే ఋణాల వరకు వాటిపై వడ్డీ ఇచ్చి పుచ్చుకోవడాలు పూర్తిగా ధర్మసమ్మతమే, పవిత్రమూ, పరిశుద్ధమే, ఇంకా ఇందులో ధర్మం, నీతి, బుద్ధి, ఆర్థిక శాస్త్ర సూత్రాల్లో దేని దృష్ట్యా కూడా ఎలాంటి చెడుగు లేదు అన్న అపార్థం ప్రబలిపోయింది.

పైగా ఎన్నో భ్రమలు కూడా ముస్లిముల్లో ఏర్పడ్డాయి. పురాతన పంథాలోని షావుకార్లు, కోమటి ఆసాములు వడ్డీ తినడం వేరు, నేటి బ్యాంకింగ్ వ్యవస్థ వేరని కూడా భావించబడుతోంది. బ్యాంకుల "పరిశుద్ధ" వ్యవహారాలయితే పరమ పవిత్రమయినవి కనుక బ్యాంకులతో లావాదేవీల సంబంధాలు పెట్టుకోవడంలోనూ తప్పు లేదని ఊహించబడుతోంది.

ఈ భ్రమల భ్రమణాల నుండి బయటపడ్డవారు సయితం వడ్డీని పూర్తిగా నిషేధిస్తే నేటి కాలంలో ఆర్థిక వ్యవస్థను నెల కొల్పడం ఎలా సాధ్యమవుతుంది? అన్న చిక్కులో పడి పోయ్యారు.

నిజానికి ఇది అసంభవం కానేకాదు. అయితే చిత్తశుద్ధి. దృఢసంకల్పం అవసరం. ఇలాంటి చిక్కుల్ని విశదంగా చర్చించవలసి ఉంటుంది, ఈ పుస్తకంలో ఆ చర్చకు తావులేదు. వడ్డీ వ్యవస్థను త్వరలో వేరొక పుస్తకంలో చర్చిద్దాము.

ఈ పుస్తక రచయితదే మరో ప్రామాణిక,
సైద్ధాంతిక రచన

# ధర్మపథంలో జీవనరథం

దైవ నిర్దేశితమయిన నిత్య నూతన జీవన మార్గాన్ని కాదని తన స్వహస్తాలతో ఎన్నో జీవన వ్యవస్థల్ని రూపొందించుకున్నాడు మానవుడు. కాని అవి నిజ జీవితంలో— తాత్కాలికంగా కొంత ప్రయోజనాన్ని చేకూర్చిపెట్టినా— క్రమంగా నీరుగారిపోయాయి.

ఇస్లామ్ ఓ సమగ్ర జీవన వ్యవస్థ అయినపుడు దాని ఆధ్యాత్మిక, నైతిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ విధానాలు ఎలా ఉంటాయి? వాటి మధ్య ఇస్లామ్ సమన్వయాన్ని ఎలా స్థాపిస్తుంది? అన్న అంశాన్ని చర్చించే పుస్తకం.